# భారతి

[సచిత్ర మాసపత్రిక]



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాదు



ఆంధ్రపత్రికా ముద్రాలయము,
మద్రాసు.



సెప్టెంబరు

సంపుటము 19] 1942 [సంచిక 9



# విషయానుక్రమణిక

## సెప్టెంబరు, 1942



వర్ణచిత్రము: 'కాళికా తాండవము'

చిత్రకారుడు: శ్రీ 'రాజు' (బాలసుబ్రహ్మణ్యం)




సంపుటము 19
సంచిక 9

# భారతి

చిత్రభాను భాద్రపదం
1942 సెప్టెంబరు


# పాణినీయము - కావ్యభాష


= శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి =


## 1. ప్రయోగసాధనము

పాణినీయము కావ్యభాషానుశాసకము కాదని 'చింతామణివిషయపరిశోధనము'లో వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు వ్రాసిన ద్వితీయ భాగమునకు ఖండనరూపము లగు నావ్యాసములు ౧౯౩౭ అక్టోబరు, నవంబరు భారతిపత్రికలలోఁ బ్రకటింపఁబడినవి. వానికి సమాధానముగా శ్రీశాస్త్రిగారొక యనుబంధము నిటీవలఁ దమ గ్రంథమునఁ బ్రకటించిరి. నావ్యాసములలో గతార్థములు కాని విషయము లందు నాకుఁ గనిపించినవి కావు. ఐనను బహుగ్రంథపరిశోధనమువలన నిటీవల నాకగపడిన కొన్ని క్రొత్తవిషయములతోడను, బహువారము సమగ్రమహాభాష్యపర్యాలోకనమువలన లభించిన పాణినీయరహస్యములతోడను నావ్యాసవిషయములను విపులీకరించుట యావశ్యక మని తోఁచినది. కావునఁ బ్రకరణానుసారముగా వానిఁ గొన్నిటి నిటఁ బొందుపఱచి నే నీవ్యాసమును వ్రాయ సమకట్టితిని.

"అపాణినీయప్రయోగములు పరశ్శతములు కావ్యములలోఁ గలవు. అందుఁ బ్రధానతమము లివి—" అని శాస్త్రిగారు మొత్తము పదునొకండు ప్రయోగములు 'చింతామణివిషయపరిశోధనము'నఁ బ్రదర్శించిరి (పుటలు ౧౧౧–౧౧౫). అవి యన్నియుఁ బాణినీయములని నిరూపించుటయే యీ ప్రథమ శీర్షకములోని ప్రధాన విషయము.

### ౧. లుఙ్ లఙాదిప్రయోగములు - పాణినీయము

"అద్యతనభూతము, అనద్యతనభూతము, అనద్యతనపరోక్షభూతము మున్నగు నియమములు వీడిన ప్రయోగము లెల్లఁ బాణినీయసమ్మతములు కావుగదా!" అని శ్రీశాస్త్రిగా రనుచున్నారు. ఈ ప్రయోగములు పాణినీయసమ్మతములో, కావో చర్చింతును.

ఒక వస్తువున సామాన్య విశేషధర్మములు రెండును నున్నప్పు డావస్తువునందలి విశేషధర్మమును వివక్షించి విశేషధర్మబోధకముగ నొకప్పుడును, సామాన్యధర్మము వివక్షించి సామాన్యధర్మబోధకముగ మఱియొకప్పుడును శబ్దప్రయోగ మొనర్చుట లోకసహజము. ఉదా: చూతవృక్షము — ఇందు వృక్షత్వ మను

సామాన్యధర్మమును, చూతత్వ మను విశేషధర్మమును గూడఁ గలవు. ఒకతఱి విశేషధర్మ మగు చూతత్వమును వివక్షించి చూతవృక్షమునే చూత మందుము. మఱి యొకపరి సామాన్యధర్మ మగు వృక్షత్వమును వివక్షించి చూతమునే వృక్ష మనియు నందుము. ఇం దేదియును దప్పు కాదు. ఇట్లే భూతకాలమందు భూతత్వ మను సామాన్యధర్మమును, 'అనద్యతనభూతత్వ' మను విశేష ధర్మమును గలవు. ఇందు 'అనద్యతనభూతత్వ' మను విశేషధర్మమును వివక్షించిన 'అనద్యతనభూతే లఙ్' అను సూత్రమున లఙ్ ప్రత్యయము వచ్చును. ఇఁక నీ 'అనద్యతనభూత'మును 'అనద్యతనభూతము' గా, అనఁగా విశేషధర్మరూపముగా వివక్షింపక భూతసామాన్య ముగా వివక్షించునప్పుడు చూతమందు వృక్షశబ్ద ప్రయోగమువలెనే 'అనద్యతనభూత'మందు సయితము లుఙ్ ప్రయోగము విరుద్ధము కాదు. ఇట్లే లుడర్థమున లుట్, లృట్ ప్రత్యయములును, లృడర్థమున లృట్, లుట్ ప్రత్యయములును, లిడర్థమున లుఙ్ లఙ్ ప్రత్యయ ములును, లుఙర్థమున లిట్ లఙ్ ప్రత్యయములును, లఙర్థ మున లిట్ లుఙ్ ప్రత్యయములును బరస్పర బాధకములు కాక వక్తృవివక్షాధీనములుగాఁ బాణినీయమునుబట్టియే సాధువు లగుచున్నవి. ఒక వస్తువునం దున్న ధర్మము ప్రయోక్త వివక్షింపకపోవుటయు, లేని ధర్మమును వివక్షించుటయు లోకసిద్ధము లని "అనుదరా కన్యా", "సముద్రః కుండికా" అను దృష్టాంతములఁ బ్రదర్శించి 'అద్యతనా' దులయం దనద్యతనాదుల వివక్షించి లఙాదిప్రయోగములును, భూతసామాన్యమును వివ క్షించి లుఙాదిప్రయోగములును, 'అనద్యత' నాదుల యందు భూతసామాన్యాదుల వివక్షించి లుఙాది ప్రయోగములును బాణినీయానుశిష్టము లని మహాభాష్య కర్తయే వివరించినాఁడు (చూ: మహాభాష్యము, ౩-౨-౧౧౦). ఆ మహాభాష్య వచనములు 'అద్యతనభూతము', 'అనద్యతన భూతము' మున్నగునియమములు వీడిన వని శ్రీ శాస్త్రిగా రనిన మహాకవిప్రయోగము లన్నియును బాణినీయమునుబట్టియే సాధువు లని నొక్కి వక్కా ణించుచున్నవి. మహాభాష్యకలశాంబుధి నాలోడించి దాన నేర్పడిన సుశబ్దప్రయోగామృత మాస్వాదించి జీర్ణింపఁజేసికొనిన మహాకవు లిట్టివి యేల ప్రయో గింపరు? ఈ ప్రయోగములు పాణినీయమర్మజ్ఞులు కవు లని చాటునవియో, కా వని యుద్ఘాటించునవియో నిరూపించుటకుఁ బాఠకలోకమే ప్రమాణము. అపరి శోధనమూలకముగ నపాణినీయము లనఁబడు నిట్టివియా కావ్యభాషకు వేఱువ్యాకరణము కావలయు ననుటకు శ్రీ శాస్త్రిగారి కాధారములు?

### ౨. 'అక్షాదూహిన్యా ముపసంఖ్యానమ్— అక్షోహిణీ, అక్షౌహిణీ'

ఇట 'అక్షోహిణీ', 'అక్షౌహిణీ' అను రెండు రూపములు వార్తికకారసమ్మతము లనిన తత్త్వ బోధినీగ్రంథమును వివరించి యా వ్యాఖ్యానము త ప్పనుచు శ్రీ శాస్త్రిగా రిట్లు వ్రాసియున్నారు: "వార్తికకారునకు 'అక్షోహిణీ' 'అక్షౌహిణీ' అను రూపద్వయమునకును సాధుత్వ ముపదేశించు తలంపే యున్నయెడల నాతఁ డా వార్తికమును వైకల్పికముగ నుపదేశించియుండఁడా?" (పుట ౧౧౩) ఇఁక యథార్థ మెట్టిదియో పరిశోధింతము. ఇట వ్యాఖ్యాతలు పొర పడినా రని శ్రీ శాస్త్రిగారి యాశయము. ఈవార్తి కము 'అక్షౌహిణీ'శబ్దసాధనమున కేర్పడినది గాని 'అక్షో హిణీ' శబ్దనిషేధమున కేర్పడినది కాదు. ఊహినీశబ్దముతో 'అక్ష' శబ్దమునకు సంబంధ మేర్పడినపుడు వృద్ధియగు ననునదియే దీని యర్థము. 'అర్థవద్గ్రహణే నానర్థ కస్య గ్రహణమ్' అను పరిభాష పాణినీయ శాస్త్ర సిద్ధమయి జాగరూకత వహించియుండుటచే 'ఊహినీ' శబ్దమునకు విధింపఁబడిన వృద్ధి 'ఊహ' శబ్దమునకు రాదు. 'ఊహ' శబ్దమునకు 'అక్ష' శబ్దముతో సమాస మేర్పడిన 'అక్షోహ' శబ్దము నిష్పన్న మగును. తరువాత 'అక్షోహాః అస్యా అస్తి' అను నర్థమున 'అక్షోహ' శబ్దమునకు వచ్చిన 'ఇన్' ప్రత్యయము 'అక్షోహ' అను సముదాయమునకు సంబంధించినది గాని తదేకదేశ మగు 'ఊహ' శబ్దమునకు సంబంధించి నది కాదు. ఇట్లు వృద్ధినిమిత్తక మగు 'ఊహినీ' శబ్దమే కానరాని యీ లక్ష్యమున వార్తికము ప్రవర్తిం

పదు గదా! ఇట్టిచో 'అక్షోహిణీ' శబ్దసాధనమున వ్యాఖ్యాత లొనర్చిన యపరాధ మేమి? స్వనిమిత్తములు లేక సూత్రవార్తికములు ప్రవర్తించుట యెట్లు? వార్తికకారునకు 'అక్షోహిణీ, అక్షౌహిణీ' శబ్దములు రెండును సాధువులుగా సమ్మతములే. ఇక 'వా'గ్రహణ మేల చేయలే దని శ్రీ శాస్త్రిగా రడిగిరి. 'వా'గ్రహణము లేకయే యీ రెండు రూపములును స్వరసముగాఁ బాణినీయసాధితము లగుచుండ వ్యర్థముగా నతఁ డేల 'వా'గ్రహణము చేయవలయును? ఇంత యేల? మహాభాష్యకర్తయే ఆత్మన్‌శబ్దములోని తృతీయా విభక్తికి లోపము రాదని సమాసమునందు 'ఆత్మనా చతుర్థః' వంటి ప్రయోగముల సాధించుచున్న 'ఆత్మనశ్చ' అను సూత్రవ్యాఖ్యానావసరమున 'జనార్దనస్త్వాత్మచతుర్థ ఏవ' అను మహాకవిప్రయోగమును ప్రదర్శించి 'ఆత్మా చతుర్థః అస్య' అను విగ్రహమును జూపి బహువ్రీహిసమాసాశ్రయణముచేఁ బైసూత్రము ప్రవర్తింపక విభక్తిలోపము వచ్చి 'ఆత్మచతుర్థః' అను ప్రయోగము సాధు వగుచున్న దని స్పష్టముగా నిరూపించెను. దీనిని బట్టి 'ఆత్మనా చతుర్థః', 'ఆత్మచతుర్థః' అను రెండు రూపములును సమాసభేదముచే సూత్రకారసమ్మతము లనియేకదా మహాభాష్యకర్త నిర్వచించెను? అట్లైన సూత్రకారుఁ డేల 'వా'గ్రహణము చేయలే దని పతంజలిని మన మడుగుట యెంత వఱకు సమంజసమో విజ్ఞులూహింపుఁడు. ఇట్టి వనేకములు మహాభాష్యమునఁ బ్రదర్శింపఁబడినవి. ఇట వ్యాఖ్యాత లొనర్చిన వింత వ్యాఖ్యానము లేవియు లేవు. పాణినీయశాస్త్ర సంప్రదాయజ్ఞుల కిది యొక క్రొత్తవిషయముగాఁ జేసి యింతగా బోధింప నక్కఱ లేదు.

## ౩. 'ఆఙో యమహనః'

'ఆజఘ్నే విషమవిలోచనస్య వక్షః', 'ఆహధ్వం మా రఘూత్తమమ్'—'స్వాంగకర్మకాచ్చేతి వక్తవ్యమ్' అను వార్తికమునుబట్టి పైసూత్రము స్వాంగకర్మకము గాని, అకర్మకముగాని యగునప్పుడే 'ఆఙ్' పూర్వకము లగు 'యమ, హన' ధాతువులకు ఆత్మనేపదమును విధించుచున్నది. పై ప్రయోగము లట్టివి కావుగాన అపాణినీయము లని శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. ఇక్కడఁ బాణినీయమునుబట్టి యీ ప్రయోగములు సాధించుటకు వ్యాఖ్యాతలు త్రొక్కిన భిన్నభిన్న మార్గములు కూడఁ బ్రదర్శించిరి. భాగవృత్తికారాదులు 'ప్రాప్య' అనుదాని నధ్యాహరించి 'రఘూత్తమం ప్రాప్య మా ఆహధ్వమ్' అనురీతిని సమన్వయించి పాణినీయమునుబట్టియే ఆత్మనేపదమును సాధించిరి. ఇట్లే 'విషమవిలోచనస్య వక్షః ఉపసృత్య గాండీవీ భుజాభ్యా మాజఘ్నే' అని యన్వయించుకొనిన భారవిప్రయోగమున నైనను ఆత్మనేపద మసాధువు కాదు. కావ్యములలోని శ్లోకముల సమన్వయించుట కధ్యాహారము లక్కడక్కడ నవసర మగుటయు, వానిని మనము పూరించుకొనుచుండుటయుఁ గావ్యపాఠకు లెల్లరకు విశదమే. అట్టివి దుష్టములుగాని, యస్వరసములుగాని కావ్యసంప్రదాయమునుబట్టి కాఁజాలవు. హేమచంద్రాదు లిట్టివి కవిప్రమాదములే యని పదదోషములలో నొకటి యగు చ్యుతసంస్కారమున కుదాహరణముగా నొసఁగిరి. కవులకుఁ బ్రమాదములు తప్పనివని తరువాత నిరూపించెదను. ఏమైన నిట్టివి పాణినీయము కావ్యభాషానుశాసకము కా దనుటకు నవి కావు.

## ౪. 'సుభ్రు' శబ్దము—తత్సాధనము

"విమానవా సుభ్రు కుతః పితుర్గృహే—అను కాళిదాసప్రయోగమునందలి సంబోధనహ్రస్వము అపాణినీయము కాఁగా 'సుభ్రూదీద్వ్యజమ్బ్వర్థానాం ధాస్వః' అని యిట్లు (ముగ్ధ. ౧౫౩) వోపదేవుఁడు సాధించియున్నాఁడు!" అని శాస్త్రిగారు వ్రాసినారు (పుట ౧౧౪). సుభ్రూశబ్దమున కేర్పడిన యీహ్రస్వ మపాణినీయ మని శాస్త్రిగారు వ్రాసిరి. కాని యిది యట్టిది కాదు. ఈ శబ్దసాధనమునకు ముందు కవు లెంద ఱీ శబ్దము నిట్లు ప్రయోగించిరో యవలోకింతము.

'హా, పితః క్వాఽసి హే సుభ్రు' (భట్టి), 'ప్రథమ మరుణచ్ఛాయ...సుభ్రు! తాం సంగిరం తే' (శ్రుతబోధలో కాళిదాసు), 'ముకుళయతి చ నేత్రే సర్వదా సుభ్రు! ఖేదః' (మాలతీమాధవము-భవభూతి), 'యాని వైశ్రవణే సుభ్రు!' (సుందరకాండ-వాల్మీకి)

'సుభ్రు! త్వం కుపితే త్యపాస్త మశనం త్యక్త్వా కథా యోషితామ్' (మఱియొక మహాకవి).

ఇఁక నేతత్సాధనప్రకార మెట్టిదియో యరయుదము. సంస్కృతమహాకవు లందఱును మహాభాష్యమును సమగ్రముగా నధ్యయనించి తదవలోడన మొనర్చి తన్మర్మముల నెఱిఁగినవారు. కావ్యసృష్టియే పరమావధిగాఁ గల వీరు యథార్థము నిరూపింపఁ జాలక వాదప్రతివాదముల కాకర మగు వ్యాఖ్యాతల కేవల శాస్త్రసమన్వయదృష్టితోడనే ప్రధానముగాఁ బాణినీయము నవలోకింపక ప్రామాణికశిరోమణి యగు మహాభాష్యకర్త ప్రదర్శించిన యుదాహరణములఁ బట్టియు, స్వయముగా నాయా సందర్భములలో నతఁ డొనర్చిన ప్రయోగములఁ బట్టియు శాస్త్రకర్తల యాశయ 'మిదమిత్థ' మ్మని నిర్ణయించి దాన నేర్పడిన సాధుప్రయోగరత్నములతోడనే స్వకావ్యభూషల నలంకరించిరి. కవిప్రయోగములకును, మహాభాష్యమునకును గల పరస్పర సంబంధమును విశదీకరించి యీ యాశయ మిట్టి దని స్థాపింపఁగల నిదర్శనము లనేకములు గలవు. స్థాలీపులాకన్యాయముగా నొకటి మాత్ర మిట నుదాహరించెదను. మహాభాష్యకర్త యొక సందర్భమున విశేష్యనిఘ్నము — విశేష్యమును బట్టి లింగవ్యవస్థ గలది — అగు శక్యశబ్దమును నపుంసకముగా 'క్షుత్ ప్రతిహంతుం శక్యా' అనుటకు మాఱు 'శక్యం చానేన శ్వమాంసాదిభిరపి క్షుత్ ప్రతిహంతుమ్' (౧-౧-౧) అని ప్రయోగించెను. ఈ మహాభాష్యప్రయోగమును గాంచి మహాకవులు తమ కావ్యములలో విశేష్యాశ్రయ మగు లింగవ్యవస్థను ద్రోసిపుచ్చి శక్యశబ్ద మెట్లు ప్రయోగించియున్నారో పరికింపుఁడు:

'శక్య మరవిందసురభిః కణవాహీ మాలినీతరంగాణామ్,
అంగై రనంగతప్తై రవిరళ మాలింగితుం పవనః'

(శాకుంతలము, 3–౮)

'శక్య మోషధిపతే ర్నవోదయాః
కర్ణపూరరచనాకృతే తవ' (కుమా. ౮–౬౩)

"శక్య మంజలిభిః పాతుం వాతాః కేసరగంధినః"

(రామా)

పై ప్రయోగములను బట్టి పాణినీయమునకు రామాయణమునకును, పాణినీయమునకుఁ గాళిదాసాది మహాకవుల కావ్యములకును గల పరస్పరసంబంధ మెట్టిదియో మన మూహింపవచ్చును. మొట్టమొదట నాదికవి యగు వాల్మీకి తన కావ్యమున 'శక్యా అంజలిభిః పాతుం వాతాః కేసరగంధినః' అనుటకు మాఱు 'శక్య మంజలిభిః పాతుం వాతాః కేసరగంధినః' అని స్వోపజ్ఞముగా నీప్రయోగ మొనర్చెను. అటుతరువాతఁ బాణినీయప్రాసాదమునకు మూలస్తంభ మైన మునిత్రయమువారిలో నొకఁడగు మహాభాష్యకర్త యేతత్ప్రయోగాన్వేషణమున జాగరూకుఁ డై రామాయణాది మహాకావ్యములలోని సాధుప్రయోగముల నశేషముగా సాధించుటయే మా పరమాదర్శ మని చాటుచు 'శక్యం చానేన శ్వమాంసాదిభిరపి క్షుత్ ప్రతిహంతుమ్' అని పై రామాయణప్రయోగముతోఁ దుల్యకక్షముగాఁ దాను ప్రయోగించి యేతదనుగుణముగాఁ బ్రక్రియ నేర్పఱచి దీని సాధింపుఁ డని పాణినీయుల కాజ్ఞాపించినాఁడు. వ్యాఖ్యాత లీక్రిందిరీతిని సాధింపఁ గడఁగినారు:

I "శకేః కర్మసామాన్యే లింగసర్వనామ నపుంసకయుక్తే కృత్యప్రత్యయః. తతః పదాంతరసంబంధాదుపజాయమానమపి స్త్రీత్వం బహిరంగత్వాదంతరంగసంస్కారం న బాధతే ఇతి 'శక్యం క్షు'దిత్యుక్తమ్. యదా తు పూర్వమేవ విశేషవివక్షా తదా 'శక్యా క్షు'దితి భవత్యేవ..." (కైయటము, ౧-౧-౧)

II "శకేః 'శకిసహోశ్చ' ఇతి కర్మణి యతి సతి శక్యమితి రూపం భవతి. కర్మాభిధాయాం కర్మవచనే లింగవచనస్యాపి సామాన్యోపక్రమాత్ విశేషానపేక్షాయామితి. యథా — 'శక్యమోషధిపతే ర్నవోదయాః కర్ణపూరరచనాకృతే తవ, అప్రగల్భయవసూచికోమలా శ్ఛేత్తు మగ్రనఖసంపుటైః కరాః' న చైకాంతిక స్సామాన్యోపక్రమః. తేన 'శక్యా భంక్తుం ఝటితి బిసినీకందవచ్చంద్రపాదా' ఇత్యపి భవతి." (కావ్యాలంకార సూత్రవృత్తి ౫–౨౩)

III "శక్యమిత్యవ్యయం. నచే చ్ఛక్య ఇతి ప్రయోగ స్స్యాత్. తథా — రామాయణేఽపి 'శక్య

మంజలిభిః పాతుం వాతాః కేసరగంధినః' " (శాకుంతలము - శ్రీనివాసవ్యాఖ్య)

ప్రతిపదోక్తములగు స్వసూత్రవార్తికాదులే కాక స్వప్రయోగాదులచేఁ దాము సూచించిన యర్థము సయితము పాణినీయమునకు మూలాధారమని 'నమునే' సూత్రభాష్యమున మహాభాష్యకర్త స్పష్టీకరించినాఁడు.

ఇఁకఁ బ్రకృత మనుసరింతము. 'సుభ్రు' అను రూపసాధనమునకు మహాభాష్యకర్తయే పాణినీయమున మార్గ మేర్పఱచెను. 'అప్రాణిజాతేశ్చారజ్జ్వాదీనామ్' అను వార్తికమునకు సహజదీర్ఘోకారాంతము లగు 'అలాబూః, కర్కంధూః' అనునవి మహాభాష్యమున నుదాహరింపఁబడినవి. "ఊఙ్ప్రకరణేఽప్రాణిజాతేశ్చారజ్జ్వాదీనా మితి వక్తవ్యమ్. అలాబూః, కర్కంధూః. అప్రాణిజాతే రితి కిమర్థమ్? కృకవాకుః. అరజ్జ్వాదీనామితి కిమర్థమ్? రజ్జుః, హనుః." (మహాభాష్యము, ౪-౧-౨-౬౬) అత్ర ఉద్ద్యోతకారః - "ఊఙి సతీతి—అత్రవార్తికే ఉత ఇత్యస్యాసంబంధ ఇతి భావః."

'భ్రూ'శబ్దమునకు 'సు'శబ్దముతో సమాస మేర్పడఁగా సుభ్రూశబ్దము నిష్పన్న మగును. ఈసుభ్రూశబ్దము సహజదీర్ఘోకారాంతమే యైనను మహాభాష్యకర్త యొసఁగిన వార్తికోదాహరణములఁబట్టి 'అలాబూః, కర్కంధూః' అనువానికివలెనే పైవార్తికముచే 'ఊఙ్'ప్రత్యయమువచ్చుట మహాభాష్యాభిప్రేత మనక తప్పదు. ఇట్లు ఊఙంత మైన సుభ్రూశబ్దమున భ్రూశబ్దావయవ మగు నూకారమే కానరాదని 'అచిశ్నుధాతుభ్రువాం య్వో రియఙువఙౌ' అను సూత్ర మీ లక్ష్యమును ద్రోసిరాజనఁగా 'నేయఙువఙ్స్థానావస్త్రీ' అను నదీసంజ్ఞానిషేధ మిటఁ బ్రవర్తింపలేదు. 'అంబార్థనద్యోర్హ్రస్వః' అను హ్రస్వ మిఁక బాధకము లేదుగదా యని సుభ్రూశబ్దమునకు హ్రస్వ మను గ్రహించినది. ఊఙంతమగు సుభ్రూశబ్దమునకు సంబోధనమున 'హేసుభ్రు' అను రూపము పాణినీయమును బట్టియే యిట్లేర్పడినది. మల్లినాథాదులు సయితమీశబ్ద మిట్లు పాణినీయసాధిత మగుచున్న దని వ్యాఖ్యానించిరి.

"సుభ్రు ఇత్యత్ర భ్రూశబ్ద స్యోవఙ్స్థానీయత్వాత్ 'నేయఙువఙ్స్థానావస్త్రీ' ఇతి నదీసంజ్ఞాప్రతిషేధాత్ 'అంబార్థనద్యోర్హ్రస్వః' ఇతిహ్రస్వత్వం నాస్తి. తేన హ్రస్వః ప్రామాదిక ఇతి కేచిత్. అన్యేతు 'అప్రాణిజాతేశ్చారజ్జ్వాదీనా' మిత్యత్ర 'అలాబూః, కర్కంధూ' రిత్యూకారాంతాదప్యూఙ్ప్రత్యయముదాజహార భాష్యకారః-ఏతస్మాదేవ నియమజ్ఞాపకాత్ క్వచి దూకారాంతస్యాప్యూఙంతత్వా న్నదీత్వేహ్రస్వత్వ మిత్యాహుః. అత ఏవాహ వామనః 'ఊకారాంతాదప్యూఙ్ ప్రకృతే' రితి. 'సుభ్రుః కుతస్తాతగృహే ఽవమానన' మితి పాఠాంతరకరణం తు సాహస మేవ. ఉక్తోపపత్తిసంభావనాత్, అన్యత్రాపి 'సుభ్రు త్వం కుపితే త్యపాస్త మశనం త్యక్తా కథా యోషితామ్' ఇత్యాది ప్రయోగదర్శనాత్" (కుమా. ౫-౮౩ మల్లినాథవ్యాఖ్య)

"భ్రూశబ్దాత్ 'అప్రాణిజాతేః' ఇత్యాది నోఙ్, ఉవర్ణాంతమాత్రస్య విధానా ద్బహువ్రీహిః, ఉపసర్జనత్వం చ, పునః స్త్రియా మూఙ్. 'అంతా దివచ్చ' ఇతి పూర్వం ప్రత్యంతవత్త్వా త్ప్రాతిపదికత్వం. అతః సంబుద్ధౌ హ్రస్వత్వమ్" (భట్టి. ౬-౩౦౨: జయమంగళవ్యాఖ్య)

"కథమ్ 'హా పితః క్వాఽసి హేసుభ్రు' ఇతి భట్టిః, 'విమానానా సుభ్రు కుతః పితు ర్గృహే' ఇతి కుమారః? అనేన నదీత్వప్రతిషేధా ద్ధ్రస్వాభావాత్. ఉచ్యతే — 'అప్రాణిజాతే శ్చారజ్జ్వాదీనామ్' ఇత్యూఙి సమాసే ఉపసర్జనహ్రస్వత్వే కృతే 'ఊఙుతః' ఇత్యూఙి తస్య సముదాయభక్తత్వా దత్ర నోవఙ్స్థానత్వ మితి సంబుద్ధిహ్రస్వ ఇతి భట్టి టీకా. 'వామి' ఇత్యత్రో వాగ్రహణ మపకృష్య వ్యవస్థితవిభాషాత్వా దితి శ్రీకంఠః" (దుర్ఘటవృత్తి)

మహాభాష్యమర్మజ్ఞు లగు కవు లిట్టివి ప్రయోగింపకమానరుగదా! మహాభాష్యమునుబట్టి పాణినీయసూత్రములకుఁ గవు లానాఁ డొనర్చిన వ్యాఖ్యానము లెట్టివియో సరిగాఁ బరిశోధించుకొనక వారి ప్రయోగము లన్నియు నపాణినీయములనిన నది మన దోషము గాని కవుల దోషము కాదుగదా! పాణినీయము కావ్య

భాషానుశాసకము కాదనుట కీక నివి సాధకములా, బాధకములా ?

## ౫. ఛాందసప్రయోగములు—తత్సాధనము

"'త్రియంబకం సంయమినం దదర్శ' అనుచోట 'త్రియంబక' శబ్ద మపశబ్దముగనే పరిగణింపఁబడుచున్నది. ఆశ్లోకమునకు వ్యాఖ్యానము చేయుసందర్భమున 'మహాకవిప్రయోగత్వాత్సోఢవ్యః' అని మల్లినాథుఁడు వ్రాసియున్నాఁడు" అని శ్రీ శాస్త్రిగారు వ్రాసియున్నారు (పుట ౧౧౮). వేదమున 'త్రియంబకమ్', 'త్ర్యంబకమ్' అను రెండురూపములును గలవు. లోకమున 'త్ర్యంబకమ్' అనునదియే ప్రయోగార్హము. అట్టిచో ఛాందస మగు 'త్రియంబకమ్' అనునది లోకమున నెట్లు సాధు వగు నను విషయమే యిప్పుడు చర్చింపవలసినది. ఛాందసప్రయోగముల మఱికొన్నిటిఁ గూడఁ గవులు కావ్యములలోఁ బ్రయోగించిరి. 'నామ రూపం కుహో[1] త్పన్నమ్', 'విజ్ఞానం చ కుహోత్పన్నమ్', 'సంస్కారాశ్చ కుహోత్పన్నాః', (అశ్వఘోషుఁడు), 'భక్తస్య తత్ర సమరన్త[2] మమాఽపి వాచః' (భవభూతి), 'మహిమ్నః పంథానం మదనపరిపంథిప్రణయిని' (మూకకవి) మొ.

మహాకావ్యములలోని యీ ఛాందసప్రయోగములు పాణినీయమునుబట్టి యెట్లు సాధువులు కాఁగలవో మన మిఁకఁ జర్చింతము. 'పద్దన్నోమాస్హృన్నిశసన్యూషన్దోషన్యకఞ్ఛకన్నుదన్నాసఞ్ఛస్ప్రభృతిషు' అను సూత్రములోనికి 'శీర్షంశ్ఛందసి' అను సూత్రమునుండి 'ఛందసి' అనుదాని ననువర్తించి పదాద్యాదేశములు ఛాందసము లనియే కైయటాదులు వ్యాఖ్యానించిరి. 'మాసశ్ఛందసి' అను వార్తికమున వార్తికకారుఁడొనర్చిన ఛందోగ్రహణమునుబట్టి లోకమునఁ గూడఁ గ్వాచిత్కముగా నీప్రయోగములు సాధువు లనిరి (చూ: కైయటము, ౭-౮-౮౧).

సిద్ధాంతకౌముదీకర్త యగు దీక్షితుఁడు కూడ నిట్లు వ్రాసియున్నాఁడు: "పద్దన్న ఇత్యత్ర హి చ్ఛందసీ త్యనువర్తితం వృత్తౌ. తథాఽప్యపోభీత్యత్ర మాసశ్ఛందసీతి వార్తికే ఛందోగ్రహణసామర్థ్యాల్లోకేఽపి క్వచి దితి కైయటోక్తరీత్యా ప్రయోగ మనుసృత్య పదాదయః ప్రయోక్తవ్యా ఇతి బోధ్యమ్" (అజంతనపుంసకలింగప్రకరణము). మఱియును 'క్వాచ్ఛందసి' అను సూత్రముచే నిష్పన్నమై వైదిక మగు 'అధ్వర్యు' శబ్దమును మహాభాష్యకర్త యిట్లు ప్రయోగించినాఁడు: "ఏకశత మధ్వర్యుశాఖాః" (పస్పశాహ్నికము). పాణిని కూడ 'అధ్వర్యుక్రతు రనపుంసకమ్' అని సూత్రించెను. ఈ ప్రయోగములను బట్టి ఛాందసములును లోకమునఁ గ్వాచిత్కములుగాఁ బ్రయోగార్హము లని శరణదేవుఁ డిట్లు వ్యాఖ్యానించియున్నాఁడు: "ఛాందసా అపి భాషాయాం క్వచి త్ప్రయుజ్యంతే. అధ్వర్యుశబ్దేన 'క్వాచ్ఛన్దసి' ఇత్యుప్రత్యయాంతేన జ్ఞాపితమ్" (దుర్ఘటవృత్తి)

కావ్యములలో నగపడుచున్న 'త్రియంబకమ్' మొదలగు ఛాందసప్రయోగములు పైరీతిని పాణినీయమునుబట్టియే సాధువు లగుచున్నవి. హేతువాదమును బట్టి పరిశీలించినను నిట్టివి యుక్తియుక్తము లని మన మొప్పికొనక తప్పదు. కావ్యకర్తలు సాంగముగా నాఁడు వేదాధ్యయన మొనర్చిన మహానుభావులు. వైదికకర్మాచరణముతోడనే తమ జీవితము సార్థకపఱచుకొనిన శిష్టాచారపరాయణులు. భవభూత్యాది మహాకవుల జీవిత చరిత్రమును సంపూర్ణముగాఁ బరిశోధించినవారి కిది విదిత మగును. ఇట్టి శ్రోత్రియోత్తముల రసనాగ్రమునఁ బల దనినను వలచి ఛాందసవాణి తాండవింపక మానునా? యుక్తియుక్తములు, సూత్రకృత్సమ్మతములు, మహాభాష్యానుగృహీతములు నగు నీ ప్రయోగములు పాణినీయము కావ్యభాషానుశాసకము కా దనఁ జాలినవియా ?

---

1. కింశబ్దమునకు 'వా హ చ చ్ఛందసి' అను సూత్రముచే ఛాందస మగు 'కుహ' అను రూప మేర్పడినది.

2. 'సమరంసత మేఽపి' అనునది ముద్రితపాఠమైనను, ప్రాచీనపాఠము 'సమరన్త' అనునదియే. 'బహుళం ఛంద స్యమాఙ్యోగేఽపి' అను సూత్రమున నేర్పడిన 'సమరన్త' అనునది ఛాందసరూపము (చూ: శిష్టప్రయోగసంగ్రహము).

### ౬. వ్యధికరణబహువ్రీహి - పాణినీయము

ఈ సందర్భమున శ్రీ శాస్త్రిగారిట్లు వ్రాసియున్నారు: "వేయేల! మనుమార్గుఁడు మున్నగు వ్యధికరణబహువ్రీహు లెల్ల నపాణినీయములే గదా!" (పుట ౧౧౫) ఇట్లనుటలో శ్రీ శాస్త్రిగారి యాశయ మేమియో నాకుఁ దెలియదు. పాణినీయానుశాసకు లగు మువ్వురు మహర్షులును నేకకంఠముగా వ్యధికరణ బహువ్రీహి పాణినీయసమ్మత మని చెప్పియున్నారు. చూడుఁడు :

(౧) పాణిన్యాచార్యుఁడు 'సప్తమీ విశేషణే బహువ్రీహౌ' అని సూత్రించి బహువ్రీహిలోని సప్తమ్యంతమునకుఁ బూర్వనిపాతము విధించెను. వ్యధికరణబహువ్రీహియే పాణినీయసమ్మతము కానప్పుడు బహువ్రీహిసమాసమున సప్తమ్యంతమే యసంభవము. సప్తమ్యంతమే యసంభవ మయినప్పుడు పైసూత్ర మసంగతము. కావున వ్యధికరణబహువ్రీహి సూత్రకారసమ్మత మని యొప్పికొనకతప్పదు.

(౨) వార్తికకారుఁడు 'సప్తమ్యుపమాన పూర్వపదస్యోత్తరపదలోపశ్చ', 'సముదాయవికార షష్ఠ్యాశ్చ'(బహువ్రీహి ర్వక్తవ్యః) అని వార్తికముల రచించి వ్యధికరణబహువ్రీహిని గంఠోక్తముగా విధించినాఁడు.

(3) మహాభాష్యకర్త "'సప్త మ్యుపమాన పూర్వపద స్యోత్తర పదలోపశ్చ'—సప్తమీ పూర్వ పద స్యోపమానపూర్వస్యచ బహువ్రీహి ర్వక్తవ్యః, ఉత్తరపదస్యచ లోపో వక్తవ్యః. కంఠేస్థః కాలో ఽస్య కంఠేకాలః; ఉష్ట్రముఖ మివ ముఖ మస్య ఉష్ట్రముఖః; ఖరముఖః. 'సముదాయ వికార షష్ఠ్యాశ్చ'-సముదాయ వికారషష్ఠ్యాశ్చ బహువ్రీహి ర్వక్తవ్యః. ఉత్తరపదస్యచ లోపో వక్తవ్యః. కేశానాం సమాహార శ్చూడా. అస్య కేశచూడః; సువర్ణస్య వికారో ఽలంకారో యస్య సువర్ణాలంకారః ఇత్యాది." (౨-౨-౨-౨౪) అని పైవార్తికముల సోదాహరణములుగా వ్యాఖ్యానించినాఁడు. ఇది గాక 'వ్యక్తవాచాం సముచ్చారణే' అను సూత్రము నీతఁడు వ్యాఖ్యానించుచు 'వ్యక్తాః వాచి వర్ణా యేషాం త ఇమే వ్యక్తవాచః' అను విగ్రహమును ప్రదర్శించి సూత్రములోని 'వ్యక్తవాచామ్' అనునది వ్యధికరణపద బహువ్రీహిగానే యంగీకరించినాఁడు (౧-3-౨-౪౮).

ఇఁక శాస్త్రిగారు చూపిన 'మనుమార్గుఁడు' అనునది 'సప్తమ్యుపమానపూర్వపద స్యోత్తరపదలోపశ్చ' అను వార్తికముచే "మనోః మార్గః మనుమార్గః, మనుమార్గ ఇవ మార్గః యస్య సః (మనుమార్గః)" అను విగ్రహముతో భాష్యకర్త యీ వార్తికమున కుదాహరణ మొసఁగిన 'ఉష్ట్రముఖః' అనుదానివలె సమానాధికరణబహువ్రీహిగానే పాణినీయమున సాధితమైనది. దీనిని శ్రీ శాస్త్రిగారు వ్యధికరణబహువ్రీహి యనుట ప్రమాదము. వ్యధికరణబహువ్రీహులు కంఠేకాలాదులు. అవి మునిత్రయసమ్మతము లని నిరూపించితిని. ఇట్లు మునిత్రయసమ్మతమగు వ్యధికరణబహువ్రీహి పాణినీయసమ్మతమో, పాణినీయవిరుద్ధమో బుద్ధిమంతు లూహింపుఁడు. ఈ రీతిని పాణినీయము సమన్వయించుకొనుటచేతనే యపాణినీయము లగు పరశ్శతప్రయోగములు కావ్యములలో వీరి కగపడినవేమో?

### ౭. ద్వంద్వములోని యథాసంఖ్యము- పాణినీయము

"రామలక్ష్మణులు రావణేంద్రజిత్తులఁ జంపిరి- మొదలగు చోటులలో యథాసంఖ్యార్థకము లగు ద్వంద్వప్రయోగము లెల్ల నపాణినీయములే కదా!" అని శాస్త్రిగా రనుచున్నారు. అపాణినీయము లనుచు వీరు పైనఁ జూపిన ద్వంద్వప్రయోగమునకు 'చంపఁబడినవారు రావణేంద్రజిత్తులు, చంపినవారు రామలక్ష్మణులు' అను నర్థము పాణినీయవిరుద్ధము కాదు. రాముఁడు రావణుని, లక్ష్మణుఁడు ఇంద్రజిత్తును జంపెను అను కథాభాగ మాయాకావ్యములలోని పూర్వాపర సందర్భములఁబట్టియు, నాకథలకు మూలము లగు పురాణాదులఁబట్టియు మనము తెలిసికొనవలయును. కావ్యములలోఁ గవు లసమగ్రముగా సూచించిన యితరవిషయము లెన్నియో పూర్వాపర సందర్భములఁ బరిశీలించియుఁ, బురాణముల నవలోకించియు మన మెఱుఁగునప్పు డీసందర్భమునమాత్ర

మట్టిది కూడ దను సహృదయు లుండరు. ఇట్లు యథా సంఖ్యార్థకము లగు ద్వంద్వప్రయోగము లన్నియుఁ బాణినీయము లగుచుండ 'రాముఁడు రావణాసురుని జంపెను, లక్ష్మణుఁడు ఇంద్రజిత్తును జంపెను' అనుటయే యిట వక్తృతాత్పర్యవిషయ మని విమర్శకు లివి యన్నియు నపాణినీయము లనుట పాణినీయము కావ్యభాషానుశాసకము కా దను తమ సిద్ధాంతమును సమర్థించుకొనుటకే యని పాఠకలోక మీఁక నాకళింపకపోదు.

## ౮. ద్విగుసమాసము-పాణినీయము

"త్రిలోకములు, చతుర్యుగములు, త్రిపురుషులు, పంచపాండవులు మున్నగు ప్రయోగము లెల్ల నపప్రయోగములే కదా!" అని శ్రీ శాస్త్రిగారు వ్రాసియున్నారు (పుట ౧౧౫). పై నుదాహరించిన శబ్దము లన్నియు సంజ్ఞావాచకములు.

(౧) త్రిలోకములు-ఈశబ్దముచే భూర్భువస్స్వర్లోకములు మూఁడే వ్యవహరింపఁబడుచున్నవి. ఏడు లోకములలో నివిగాక తక్కిన యేనూఁడులోకములు నీశబ్దముచే బోధింపఁబడవు. కావున నిది సంజ్ఞావాచకము.

(౨) త్రిపురుషులు-ఇది బ్రహ్మవిష్ణుమహేశ్వరులయందు రూఢము. లోకమున నేముగ్గురు పురుషులనో బోధింప నిది సమర్థము కాదు. కనుక నీశబ్దము సంజ్ఞావాచకము.

(౩) చతుర్యుగములు-జ్యోతిశ్శాస్త్రమున నైదు సంవత్సరములకు యుగ మను వ్యవహారము కలదు. అట్టి యుగములు నాలు గీశబ్దముచే వ్యవహరింపఁబడవు. కృతత్రేతాద్వాపరకలియుగముల నాలుగింటినే యీ శబ్దము బోధించును. కావున నిది సంజ్ఞావాచకము.

(౪) పంచపాండవులు-ఇది సంజ్ఞావాచకము. పాండవు లనిన పాండుని గోత్రాపత్యము (మనుమలు) కూడ నగును. కావుననే శ్రుతకీర్త్యాదులు 'ఉపపాండవు' లనఁబడిరి. ఇఁక పంచపాండవు లనిన ధర్మజ, భీమా, ర్జున, నకుల, సహదేవులే యగుదురు.

సంఖ్యాపూర్వకము లగు నీసంజ్ఞావాచకములకుఁ బాణినీయమునఁ గర్మధారయసమాసము విధింపఁబడినది. 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' అను సూత్రముచేఁ గర్మధారయసమాసము రాఁగా 'త్రయశ్చ తే లోకాశ్చ-త్రిలోకాః' (త్రిలోకములు), 'త్రయశ్చ తే పురుషాశ్చ-త్రిపురుషాః' (త్రిపురుషులు), 'చత్వారశ్చ తే యుగాశ్చ-చతుర్యుగాః' (చతుర్యుగములు), 'పంచ చ తే పాండవాశ్చ-పంచపాండవాః' (పంచపాండవులు) అనురీతి నీశబ్దములు పాణినీయముచేతనే సాధితము లైనవి. 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' అను సూత్రోదాహరణసందర్భమున నిట్టి శబ్దములే కాశికా కౌముదులలో నుదాహరింపఁబడినవి.

## ౯. 'మీననేత్రి' ప్రభృతులు-పాణినీయము

'స్వాంగా చ్చోపసర్జనా దసంయోగోపధాత్' అను నీ పాణినిసూత్రము సంయోగోపధములకు జీష్ప్రత్యయము రా దనినది. సంయోగోపధకజీషంతములు లోకమునఁ గల వని ముగ్ధబోధవ్యాకరణ వ్యాఖ్యానకర్త శ్రీ రామతర్కవాగీశుఁ డీక్రిందిరీతి నుదాహరించియున్నాఁడు:

'అంగాంత్ర దంతకంఠం చ
శృంగకర్ణోష్ఠ మి త్యపి,
పుచ్ఛనేత్రం తథా గాత్రం
జంఘ మంగాది రీరితః'

ఈకారికను బ్రదర్శించి శ్రీ శాస్త్రిగా రిట్లు వ్రాసిరి: "సంయోగోపధములలో జీష్ప్రత్యయము వచ్చున వింత యధికముగాఁ గావ్యభాషలో నగపడుచుండఁగాఁ బై పాణినిసూత్ర మెంతవఱకుఁ దదనుశాసనబుద్ధితో రచింపఁబడెనో బుద్ధిమంతు లూహింతురు గాక!" (పుట ౧౧౨)

ఇది యెంతవఱకు సత్యమో విమర్శింతము. ముగ్ధబోధవ్యాకరణవ్యాఖ్యానకర్త యుదాహరించిన శబ్దము లన్నియు శాస్త్రిగారు పాణినీయసాధితములు కా వనిరి. ఈవ్యాఖ్యానకర్త యుదాహరించినవి మొత్తము పదునొకండుశబ్దములు. ఇందా ఱుశబ్దములు-దంత, శృంగ, కర్ణ, ఓష్ఠ, జంఘా, పుచ్ఛశబ్దములు -ప్రతిపదో

క్తముగాఁ బాణినీయముచే నెట్లు సాధింపఁబడుచున్నవియో పరికింపుఁడు: 'నాసికోదరౌష్ఠజంఘాదంతకర్ణ శృంగాచ్చ', 'పుచ్ఛాచ్చ.' ఈ వ్యాఖ్యాత యుదాహరింపని మఱియొక సంయోగోపధమునుగూడ జీషంతముగా వార్తికకారుఁడు సాధించినాఁడు—'పక్షాచ్చ' (ఉలూకపక్షీ శాలా). ఇఁక నితఁ డుదాహరించినవానిలోఁ బాణినీయముచేఁ బ్రతిపదోక్తముగా సాధింపఁబడక మిగిలినవి యైదుశబ్దములు. వీనిలో అంగ, గాత్ర, కంఠ శబ్దములు మూఁడు కాశికాకారుఁడు పాణినీయానుసారముగా సాధించినాఁడు. ఈసందర్భమున శాస్త్రిగారు 'చింతామణివిషయపరిశోధనము' లోఁ బ్రదర్శించిన (పుట ౧౧౧) కౌముదీగ్రంథమున 'పుచ్ఛాచ్చ' అను వార్తికము 'అంగగాత్రకంఠేభ్యో వక్తవ్యమ్—స్వంగీ స్వంగేత్యాది' అను వృత్తిగ్రంథమధ్యపతితముగా నొనర్చి దీక్షితుఁడు ప్రమాదమనిన యంగాదులతోపాటు పుచ్ఛశబ్దమును గూడఁ బ్రమాద మనిరి. చూ: "అత్ర వృత్తిః, అంగగాత్రకంఠేభ్యో వక్తవ్యమ్.(పుచ్ఛాచ్చ) స్వంగీ, స్వంగేత్యాది. ఏత చ్చానుక్తసముచ్చయార్థేన (సూత్రస్థిత) చకారేణ సంగ్రాహ్య మితి కేచిత్. భాష్యాద్యనుక్తత్వా దప్రమాణమితి ప్రామాణికాః" (సిద్ధాంతకౌముది)

'పుచ్ఛాచ్చ' అనునది కాత్యాయనుని వార్తికమే కాని శాస్త్రిగా రనుకొనినట్లు కాశికాకారుని కారిక కాదు. సరిగా గ్రంథపరిశోధన మొనర్పక వీరు ప్రమాదపడినారు. ఈ వార్తిక ముదాహరణప్రత్యుదాహరణములతో మహాభాష్యమున వ్యాఖ్యానింపఁబడినది."(సూ)'నాసికోదరౌష్ఠజంఘా దంతకర్ణశృంగాచ్చ' (వా)'నాసికాదీనాం విభాషాయాం పుచ్ఛాచ్చ'—నాసికాదీనాం విభాషాయాం పుచ్ఛా చ్చేతి వక్తవ్యమ్. కల్యాణపుచ్ఛీ, కల్యాణపుచ్ఛా. (వా) 'కబరమణివిషశరేభ్యో నిత్యమ్'—కబరమణివిషశరేభ్యో నిత్యమితి వక్తవ్యమ్. కబరపుచ్ఛీ (కబర), శరపుచ్ఛీ (శర), మణిపుచ్ఛీ (మణి), విషపుచ్ఛీ (విష). (వా) 'ఉపమానాత్పక్షాచ్చ పుచ్ఛాచ్చ'—ఉపమానా త్పక్షాచ్చ పుచ్ఛాచ్చేతి వక్తవ్యమ్. ఉలూకపక్షీ శాలా, ఉలూకపుచ్ఛీ సేనేతి." (౪-౧-౩-౫౫)

ఇఁక వృత్తికారుఁడు సాధింపఁగా మిగిలినవి అంత్ర, నేత్ర శబ్దములు రెండు. ఈశబ్దముల విషయమునఁ బాణినీయాశయ మేమియో విమర్శించుటకు ముందు 'అంగాది' శబ్దసాధనసందర్భమున వృత్తిగ్రంథము ప్రామాదిక మనిన దీక్షితుని వచనము కవుల కెంతవఱకుఁ బ్రమాణము కాఁదగినదియో పరిశోధింతము. అంగగాత్ర కంఠశబ్దములు సంయోగోపధములు. 'స్వాంగాచ్చోపసర్జనా దసంయోగోపధాత్' అను సూత్రము సంయోగోపధములకు జీష్ప్రత్యయము రా దనుచున్నది. 'కృశాంగీ' త్యాదుల మహాకవులు ప్రయోగించిరి. ఈశబ్దముల సాధుత్వము నిరూపించుచు వృత్తికారుఁడు కాశికాగ్రంథకర్త సంయోగోపధము లగు నోష్ఠాదులకుఁ గొన్నిటికి వికల్పముగా జీష్ప్రత్యయము విధించుచున్న 'నాసికోదరౌష్ఠ జంఘాదంత కర్ణశృంగాచ్చ' అను పాణినిసూత్రములోని చకారము విశేషార్థకము—సంయోగోపధములకు, మఱి కొన్నిటికిఁ గూడ జీష్ప్రత్యయము వచ్చు నను నర్థము కలది—అని అంగాదులను వైకల్పిక జీషంతములుగా సాధించినాఁడు. 'అంగగాత్రకంఠేభ్యో వక్తవ్యమ్' అను కాశికాకారుని వార్తికమునకుఁ గల యాశయ మిట్టి దని తద్వ్యాఖ్యానకారుఁడగు న్యాసకారుఁడు—జినేంద్రబుద్ధిపాదుఁడు వివరించినాఁడు. చూ: "అంగేతి—అంగాదిభ్య ఉపసర్జనేభ్యో జీష్ భవ తీత్యేతదర్థరూపం వ్యాఖ్యేయ మి త్యర్థః. కిమర్థమ్? సంయోగోపధత్వాత్ జీష్ న ప్రాప్నోతి. తదర్థమేతదర్థరూపం వ్యాఖ్యేయమ్. తదిదం వ్యాఖ్యానమ్. ఉత్తరసూత్రే చకారోఽనుక్తసముచ్చయార్థః. తే నాంగాదిభ్య స్సంయోగోపధేభ్యో జీష్ భవ తీతి". చకారమున కిట్టి యర్థము భాష్యములలోఁ జెప్పఁబడనందునఁ బ్రామాణికు లొప్పికొన రని దీక్షితుఁడు "అత్ర వృత్తిః—"ఇత్యాదిగా వ్రాసెను. కాని, మహాభాష్యకర్త పాణినీయమునుగూర్చి యిట్లు ముచ్చటించెను: "ప్రమాణభూత ఆచార్యో దర్భపవిత్రపాణిః శుచావవకాశే ప్రాఙ్ముఖ ఉపవిశ్య మహతా ప్రయత్నేన సూత్రాణి ప్రణయతి స్మ. తత్రాశక్యం వర్ణే నాప్యనర్థకేన భవితుమ్. కిం పున రియతా సూత్రేణ" (౧-౧-3-౧.) ఈమహాభాష్యమునుబట్టి శిష్టప్రయోగము లనేకము లగపడుచున్నప్పు డేప్రయోజనము లేని 'నాసి

కోదరాష్ఠ...' సూత్రస్థచకారము విశేషార్థకము — అంగాదులకు, మఱికొన్నిటికిఁ గూడ జీష్ప్రత్యయము వచ్చు నను నభిప్రాయము కలది——అని వ్యాఖ్యానించుట తప్పు కాదు. ఐనను సిద్ధాంతకౌముదీకర్త యగు దీక్షితుఁ డీనాఁ డిది భాష్యానుక్త మగుటచేఁ బ్రమాద మనినాఁడు. ఇదియే సిద్ధాంత మనుకొందము. ఐనను వృత్తికారుఁడు మొదలు దీక్షితునివఱకును గల మహాకవులు తమనాఁ డప్రతిహతముగాఁ బాటింపఁబడుచున్న వృత్తికారసిద్ధాంతమును బ్రమాణముగాఁ గొని అంగ, గాత్ర, కంఠ శబ్దములు జీషంతములుగాఁ బ్రయోగించుట తప్పనఁజాలము. ఈనాఁడు కౌముది వలె నానాఁడు వృత్తిగ్రంథమును బఠనపాఠనాదులలోఁ గల దను ప్రసిద్ధి కలదు. ఈనాఁడు కౌముది చదివి పై వ్యాఖ్యానములు చదువక కొందఱును, జదివినను నాగేశాదుల నవీనమతములు సరిగా వని మఱికొందఱును దీక్షితాదుల సిద్ధాంతములకే యలవడి కావ్యములు వ్రాయుచుండుట మనము ప్రత్యక్షముగాఁ జూచుచున్నాము. ఈపట్టున యఙ్లుగంత ప్రయోగమును నిదర్శనముగాఁ గొనుఁడు. ఈప్రయోగమునుగూర్చి మహాభాష్యమున నిట్లున్నది: "ఏవంతర్హి సిద్ధే సతి య ద్ధుశ్న్ గ్రహణం కరోతి తజ్ జ్ఞాపయ త్యాచార్యః యఙ్లుగ్ భాషాయాం భవ తీతి. కి మేతస్య జ్ఞాపనే ప్రయోజనమ్? బేభిదీతి, చేచ్ఛిదీతీత్యేత త్సిద్ధం భవతి భాషాయామపి" (౬-౪-౩-౮౭) ఇట్లు స్పష్టముగా యఙ్లుగంతము లోకమునఁ బ్రయోగార్హ మని మహాభాష్యకర్త చెప్పుచున్నను నీప్రయోగము ఛాందస మని మఱియొక భాష్యమును బట్టి నాగేశభట్టు సిద్ధాంత మొనర్చెను. ఇఁక దీక్షితుఁడో, యీభాష్యమే సిద్ధాంతభాష్య మని యఙ్లుగంతప్రయోగము లౌకిక మను సిద్ధాంతమును స్థాపించుటయేకాక తన శబ్దకౌస్తుభప్రారంభమున "విశ్వేశం సచ్చిదానందం వందేఽహం యోఽఖిలం జగత్, చర్కరీతి జరీహర్తి సంజరీహర్తి లీలయా" అని స్వయముగాఁ బ్రయోగించినాఁడు. దీక్షితునకుఁదరువాతివాఁడగు నాగేశభట్టీప్రయోగము ఛాందస మనినను దరువాతి మహాకవు లీసిద్ధాంతము పాటింపక నాఁటినుండి నేఁటివఱకును యఙ్లుగంతములఁ బ్రయోగించుచున్నారు. ఇట్లే 'కంబుకంఠీ' ఇత్యాదులు దీక్షితుఁడు తప్పనినను బాణినీయము కావ్యభాషానుశాసక మను పాణినీయులే యీ సిద్ధాంతము నాదరింపక వృత్తికారమతానుయాయులై 'కంబుకంఠీ' ఇత్యాదులే ప్రయోగించుచున్నారు. దీనినిబట్టి మన మి ట్లూహింపవచ్చును. లక్ష్యము లనేకములు ప్రదర్శించి లక్షణము తదనుగుణముగా నున్న దని యొక వ్యాఖ్యాత వ్యాఖ్యానించినప్పు డావ్యాఖ్యానము కేవలలక్షణదృష్టితోఁ బ్రమాద మని తరువాతివారు నిరూపించినను ద్వరలో నావ్యాఖ్యానము ప్రమాణపదము నధిష్ఠింపదు. ప్రామాణికులగు వ్యాఖ్యాతల భిన్నభిన్నవ్యాఖ్యానములు శాస్త్రసంప్రదాయమునుబట్టి మతభేదములుగాఁ బరిగణింపఁబడుచున్నవి. మా: కైయటమతము, వృత్తికారమతము, దీక్షితమతము, నాగేశమతము మొ. ఈమతములలో నేమతము ననుసరించినను నామతము శాస్త్రవిరుద్ధము కాదు. కావున లక్ష్యలక్షణముల సమన్వయించుచుఁ బాణినీయమునకు వ్యాఖ్యాన మొనర్చిన యొక వ్యాఖ్యాతను బ్రమాణముగాఁ గొని తదనుసారముగాఁ గవులు ప్రయోగించిన 'కృశాంగీ' ఇత్యాదులు పాణినీయములనవలసినవియేకాని అపాణినీయము లని నిరాకరింపవలసినవి కావు. తమ కాలమునకుఁ బాణినీయవ్యాఖ్యానములలో నెల్ల వృత్తిన్యాస గ్రంథములకుఁ గల ప్రాశస్త్యమును గవు లె ట్లుద్ఘాటించుచున్నారో పరికింపుఁడు: "అనుత్సూత్రపదన్యాసా[1] సద్వృత్తి[2] స్సన్నిబంధనా, శబ్దవిద్యేవ నో భాతి రాజనీతి రపస్పశా" (మాఘము, ౨-౧౧౨). ఇట్లు వృత్తికారునినుండి దీక్షితునివఱకుండు మహాకవులును, దరువాతివారును 'నతాంగి' ఇత్యాదులు ప్రయోగించుట పాణినీయవిరుద్ధము కాదు. వృత్తిగ్రంథమున కిప్పుడు జరిగిన కాలనిర్ణయము సరి కాదు. ఈ గ్రంథము చాలఁ బ్రాచీనమైనది. ఇఁక వృత్తికారునకును బూర్వులగు మహాకవులు 'సుగాత్రీ' ఇత్యాదుల నెట్లు ప్రయోగించి రని

---

1. "ఇష్ట్యుపసంఖ్యాన వైరపేక్ష్యేణ సూత్రార్థ కృత్రై రేవ సర్వార్థప్రతిపాదకో న్యాసగ్రంథః యస్యాం సా........."

2. "సతీ వృత్తిః కాశికాఖ్య సూత్రవ్యాఖ్యాన గ్రంథవిశేషః యస్యాం సా" (మల్లినాథవ్యాఖ్య)

మనము చర్చింపవలసియున్నది. పాణినీయమున కౌనాఁడేయే వ్యాఖ్యానములు కలవో యావ్యాఖ్యానము లీ సూత్రముల కే మని వ్యాఖ్యాన మొనర్చినవియో మన కీనాఁడు తెలియరాదు. కాని పాణినీయపారంగతులని తమ కావ్యము లెల్లఁ బ్రత్యక్షసాక్ష్య మిచ్చుచున్న ప్రాచీన మహాకవు లైన నీ జీవంతముల నిట్లు ప్రయోగించుట కేదేని కారణ ముండకపోదు. దానిని మన మిట్లూహింపవచ్చును. వృత్తికారుఁడు సాధింపఁగా మిగిలిన అంత్ర, నేత్రశబ్దముల రెంటిని బాణినీయ మెట్లనుశాసించినదియో తత్సాధనప్రకారము కూడ నీ సందర్భముననే పాఠకులకు విశదపడును.

## నేత్రశబ్దము :

పాణిని కరణార్థమున నీఞ్ ధాతువునకంటె ష్ట్రన్ ప్రత్యయము విధించి నేత్రశబ్దము సాధించినాఁడు. చూ: 'దామ్నీశసయుయుజస్తుతుదసిసిచమిహపతదశనహః కరణే' (౩-౨-౧౮౨). ఈ ష్ట్రన్ ప్రత్యయము షిత్తు. షిత్త్వము ప్రత్యయమాత్రవృత్తి ధర్మము కాకపోవుటనుబట్టి ప్రత్యయగ్రహణపరిభాష యిటఁ బ్రవర్తింపదు. కావున 'మీననేత్ర' ఇత్యాదులు షిదంతములు. అనుపసర్జనాధికారము తదంతవిశేషణము[1] 'మీననేత్ర' ఇత్యాదులలోని నేత్రశబ్దాదు లుపసర్జనములే యైనను 'మీననేత్ర' ప్రభృతులు విశిష్టము లనుపసర్జనములు. అనుపసర్జనము లగు షిదంతములకు 'షిద్గౌరాదిభ్యశ్చ' అను సూత్రముచేఁ బాణినియే ఙీష్ప్రత్యయము విధించినాఁడు. ఇట్లు పాణినీయానుశిష్టము లగుట పరికించియే మహాకవులు వీనిని స్వకావ్యములలోఁ బ్రయోగించిరి. ఇవి పాణినీయము కావ్యభాషానుశాసకము కాదనఁజాలినవి కావు.

## అంత్రశబ్దము :

అమ గతౌ అను ధాతువునకు 'అమిచిమిదిశసిభ్యః క్త్రః' అను నుణాదిసూత్రముచే 'క్త్ర' ప్రత్యయము వచ్చిన 'అంత్రమ్' అని యగును. ఈ 'క్త్ర' ప్రత్యయాంతమునకు స్త్రీలింగమున 'స్థూలాంత్రా' వంటి టాబంత రూపములు నిర్బాధములు. ఇఁక అతి బంధనే అను ధాతువునకు 'సర్వధాతుభ్యః ష్ట్రన్' అనుసూత్రమున 'ష్ట్రన్' ప్రత్యయము వచ్చినను 'అంత్రమ్' అని యగును. ఈ ష్ట్రన్ ప్రత్యయాంతముతో సమాస మేర్పడిన 'మీననేత్రీ' అనువానివలెనే 'స్థూలాంత్రీ' వంటి జీవంతములును బాణినీయమునుబట్టి యేర్పడుట ప్రక్రియామర్మజ్ఞులెఱుఁగనిది కాదు. ఇట్లుభయవిధము లగు వ్యుత్పత్తితోడ నీశబ్ద మమరసుధాకారుఁడే వ్యాఖ్యానించినాఁడు.

## అంగశబ్దము :

ఉణాదులలో నీశబ్దము ప్రతిపదోక్తముగా సాధింపఁబడలేదు. ఈశబ్దసాధనమున వ్యాఖ్యాతలు భిన్నభిన్నమార్గములు త్రొక్కిరి: అగిధాతువుకంటె అచ్ ప్రత్యయము అని అమరసుధ; అమధాతువుకంటె 'బాహుళకాద్గన్' అని వాచస్పత్యము; అగిధాతువుకంటె ఘ ప్రత్యయము, లేక ఘఞ్ ప్రత్యయము, లేక అమధాతువుకంటె గన్ ప్రత్యయము అని లఘుశబ్దార్థసర్వస్వము. కాని, ప్రామాణికము లగు శిష్టప్రయోగము లనేకము లగపడుచున్నప్పుడు 'ఉణాదయో బహుళమ్' అనుసూత్రమున మహాభాష్యకర్త "ప్రకృతిం దృష్ట్వా ప్రత్యయ ఊహితవ్యః, ప్రత్యయంచ దృష్ట్వా ప్రకృతి రూహితవ్యా" "సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయాశ్చ తతః పరే, కార్యా ద్విద్యా దనూబంధ మేత చ్ఛాస్త్ర ముణాదిషు". అని యభ్యనుజ్ఞ యిచ్చిన రీతిని 'అగి కంపనే' అను ధాతువుకంటె షిత్తగు ప్రత్యయ మొకదానిని వికల్పముగా విధించుకొని 'అంగ' శబ్దము సాధించుకొనిన 'కృశాంగీ, కృశాంగా' యిత్యాదులును బాణినీయము వలననే సాధితము లగుచున్నవి. కనుకనే నిగమాంతదేశికులు తన తత్త్వటీకయం దిట్టివానినిగూర్చి యిట్లు చెప్పినాఁడు (చూ: శిష్టప్రయోగసంగ్రహము):

"ఈదృశానాం ప్రయోగాణా మబహిష్కారసిద్ధయే,
బహుధా బహుళాదీనా మష్టాధ్యాయ్యా ముపక్రమః.
విశిష్టోక్త్యనుసారేణ వ్యుత్పత్తి స్స్మర్యతే బుధైః,
అవిగీతప్రయోగేషు విగానం నైవ సాంప్రతమ్"

---

1. 'విభాషా సపూర్వస్య' (౪-౧-౩౪)— 'అనుపసర్జనస్య' ఇ తీషణోత్తరార్థ మనువృత్త మపి న పత్యు ర్విశేషణమ్. కింతు తదంతస్య. తేన బహువ్రీహా వపి. దృఢపత్నీ; దృఢపతిః; వృషలపత్నీ, వృషలపతిః (కౌముది, స్త్రీప్రత్యయప్రకరణము.)

క్రియతే. అన్వైర చాఽనుప్రయోగో యథా స్యాత్. ఈహాంచక్రే. వ్యవహితస్య మా భూత్, ఈహాం దేవ దత్తశ్చక్రే" (౩-౧-౩-౪౦).

ఇతఁడు మఱియొకచో లిడంతమునకు నఞుతో సామర్థ్యప్రదర్శన మొనర్చుచు నిట్లు ప్రయోగించి నాఁడు: "న కారయామ్, న హారయామ్- నాఽత్ర నఞ ఆమంతేన సామర్థ్యమ్. కేన తర్హి? లిడంతేన. 'న చ కార కారయామ్, న చకార హారయామ్." (మహాభాష్యము, ౨-౪-౨-౮౧)

ఈ మహాభాష్యకార ప్రయోగము లౌకికముగా దని కైయటుఁడిట్లు వ్యాఖ్యానించినాఁడు: "న చ కారేతి నఞో లిడంతేన సామర్థ్యం ప్రదర్శయతి. నత్వయం లౌకికః ప్రయోగో వ్యవహిత విపర్యస్త ప్రయోగనివృత్త్యర్థత్వా దనుప్రయోగారంభస్య"(మహాభాష్యము ౨-౪-౨-౮౧ సూ, కైయటము.)

కైయటుఁ డిట్లు వ్యాఖ్యానించినను కైయటుని కంటెఁ బ్రాచీను లగు పైమహాకవులు 'న చకార కారయామ్' 'న చకార హారయామ్' అను మహాభాష్యప్రయోగములఁ బట్టి ప్రకృతవార్తిక తద్వ్యాఖ్యాన మహాభాష్యములు ప్రాయికము లనుకొని పై రీతిని బ్రయోగించియుండవచ్చును. 'తాన్హ రాజా మద్రయామేవ చకార' అని బహ్వృచ బ్రాహ్మణమునఁ గలదు. ఇందలి యామంత వ్యవహిత ప్రయోగమును గాంచి శ్రోత్రియోత్తము లగు మహాకవులు పైరీతిని బ్రయోగించినను బ్రయోగింపవచ్చును. ఏమైన నివి పాణినీయము కావ్యభాషానుశాసకము కా దనుటకుఁ దగిన ప్రమాణములు కావు.

## ౧౧. సౌత్రప్రయోగములు-పాణినీయము

'ఇకో యణచి' 'సనాద్యంతా ధాతవః' 'సుప్తిఙంతం పదమ్' అను పాణినిసూత్రప్రయోగము లెల్ల సౌత్రము లగుటచేఁ గదా సాధువు లగుచున్నవి? ఇట్టివి పెక్కు గలవు. ఇట్టివాని సాధుత్వమును బాణినీయ వ్యాకరణమునుబట్టి విమర్శించుట యుక్తము కాదు గదా! (చింతా. పుట ౧౧౫) ఈపట్టున శ్రీశాస్త్రి గారు వ్రాసిన వ్రాఁత లివి: 'ఙమో హ్రస్వా దచి ఙముణ్ణిత్యమ్' అను పాణినీయసూత్రమును బట్టి పైసూత్రము లన్నియు 'ఇకో యణ్ణచి' 'సన్నాద్యంతా ధాతవః' 'సుప్తిఙ్ఙంతం పదమ్' అనురీతి నేర్పడ వలసినవి. ఐనను వైదికకర్మోపయోగి శిష్టవ్యవహారభాషనే లక్ష్యపథమం దుంచుకొనిన పాణిని తన సూత్రములకు సయితము తమ యనుశాసనము ప్రమాణ మని భావింప లేదు. ఈయాశయము నెఱుఁగక సౌత్రత్వాత్సాధువు లని వీనిని వ్యాఖ్యాతలు సమర్థింపఁజూచి రనునది శాస్త్రిగారి వాదసారాంశము. ఇట్టి యభిప్రాయమే సత్య మయిననాఁడు పాణిని ప్రత్యేక మనుశాసన మేర్పఱుపకపోయినను పాణినిసూత్రప్రయోగములఁ బట్టి పాణినీయ లక్ష్యములు సాధువు లని సాధించుట తప్పు కాకపోదు. ఇట్లు సాధించినవారు వ్యాఖ్యాతలు కారు. మునిత్రయము వారిలో నొకఁ డగు మహాభాష్యకర్త. మునిత్రయము వారి యాశయ మెఱుఁగక తరువాతివారు పొరపడినా రని శాస్త్రిగా రనుచున్నారేకాని మునిత్రయమువారే పొరపడినా రని వీ రింకను నన సాహసింప లేదు. ఇఁక సూత్రనిర్దేశములను బట్టి మహాభాష్యకర్త పాణినీయ లక్ష్యముల నెట్లు సాధించియున్నాఁడో గమనింపుఁడు.

(౧) "స్త్రీవత్, పుంవత్...ఆచార్యప్రవృత్తిర్జ్ఞాపయతి. న వత్యర్థే నఞ్స్నఞౌ భవత ఇతి. యదయం 'స్త్రియాః పుంవ' దితి నిర్దేశం కరోతి. ఏవమపి స్త్రీవదితి న సిధ్యతి. యోగాపేక్షం జ్ఞాపకమ్."(మహాభాష్యము ౫-౧-౨-౧౧౮)

'స్త్రీ పుంసాభ్యాం నఞ్స్నఞౌ భవనాత్' అను సూత్రముచొప్పున వతిప్రత్యయబాధకములుగా నఞ్స్నఞ్ ప్రత్యయములు వచ్చి 'స్త్రియా తుల్యః, పుంసా తుల్యః' అను నర్థమున, 'స్త్రైణః పౌంస్నః' అను రూపములే పాణినీయమునుబట్టి యేర్పడుచున్నవి. 'పుంసా తుల్యః పుంవత్, స్త్రియా తుల్యః స్త్రీవత్' అను రూపములు సుప్రసిద్ధములు. ఈరూపములు పాణినీయమునుబట్టి యెట్లు సాధువు లగు నని పైభాష్యమున నాశంకించి 'స్త్రియాః పుంవత్' అను సూత్రప్రయోగమును బట్టి వతిప్రత్యయమునకు నఞ్స్నఞ్ ప్రత్యయములు

బాధకములు గావనుటయే పాణినిసమ్మతమని పతంజలి పై లక్ష్యముల సాధించినాఁడు.

(౨) "కథమాశీరితి? నిపాతనాత్సిద్ధమ్. కిం నిపాతనమ్? 'ఙ్‌యాశిః ప్రైషేషు తిఙాకాఙ్క్ష'మితి" (మహాభాష్యము ౬-౪-౨-3౪)

ఆశీశ్శబ్దమును పై సూత్రనిర్దేశమును బట్టి పతంజలి సాధించినాఁడు.

(3) "'వయసి ప్రథమే' — 'ఇహాఽపి తర్హి ప్రాప్నోతి కన్యేతి. నిపాతనాదేత త్సిద్ధమ్. కిం నిపాతనమ్? 'కన్యాయాః కనీన' చేతి" (మహాభాష్యము ౪-౧-౨-౨౦)

'వయసి ప్రథమే' అను సూత్రమున 'కన్యా' అనుచో జీప్ప్రత్యయము వచ్చునని యాశంకించి పై సూత్ర నిర్దేశమునుబట్టి రా దని ప్రత్యుత్తరించినాఁడు.

(౪) "'శాశ్వతికే ప్రతిషేధః'—శాశ్వతికే ప్రతిషేధో వక్తవ్యః. న వక్తవ్యః. 'నిపాతనాత్సిద్ధమ్' నిపాతనాదేతత్సిద్ధమ్. కిం నిపాతనమ్? 'యేషాం చ విరోధశ్శాశ్వతిక' ఇతి"(మహాభాష్యము, ౬-౪-౪-౧౪౪)

ఈ మహాభాష్యమునఁ బతంజలిభగవానుఁడు ప్రత్యేకవిధానము లేకున్నను పై సూత్ర ప్రయోగమును బట్టియే శాశ్వతికశబ్దము సాగునవినాఁడు. (ఇట్టి వనేకములు)

ఈ రీతిని సూత్రప్రయోగములఁ బట్టి మహాభాష్యకర్తయే కాక 'నమునే' సూత్రభాష్యమునఁ బతంజలి తమ కాదేశించినట్లు వ్యాఖ్యాతలగు కైయటాదులు సయితము మహాభాష్యప్రయోగములఁ బట్టి లక్ష్యసంస్కార మెట్లొనర్పఁ గడఁగినారో తిలకింపుఁడు:

(౧) 'ఓషధి, వనస్పతీనాం వృద్ధిహ్రాసౌ', 'జ్యోతిషాం గతి రితి' (౫-౧-౨-౧౧౯), అత్ర కైయటః. భాష్యకారవచనా 'జ్జాతిరప్రాణినా' మిత్యేకవద్భావో న భవతి'

'జాతి రప్రాణినామ్' అను సూత్రమునుబట్టి 'ఓషధివనస్పతీనామ్' అను భాష్యప్రయోగ మసాధు వగుచుండఁ గైయటుఁడు పై సూత్ర మనిత్య మని యీ ప్రయోగమును సాధించినాఁడు.

(౨) ఏవం తర్హి 'శాశ్వతే ప్రతిషేధః' శాశ్వతే ప్రతిషేధో వక్తవ్యః. శాశ్వతమ్. (మహాభాష్యము ౬-౪-౪-౧౪౪) అత్ర కైయటః—'శాశ్వత మితి. భాష్యకారవచనప్రామాణ్యా దణ్ ప్రత్యయః'

(అత్ర ఉద్ద్యోతకారః) 'ఇఞా బాధా' దణ్ దుర్లభోఽత ఆహ 'భాష్యకారేతి.' తత్ప్రామాణ్యా త్సంధివేలాదిగణే 'శశ్వతో' వేతి పాఠానుమానమితి భావః.

పాణినీయముఁ బట్టి లోకసుప్రసిద్ధ మగు శాశ్వత శబ్ద మసాధు వగుచుండఁ బై భాష్యకారప్రయోగమును ప్రమాణముగాఁ గొని సంధివేలాదిగణమున 'శశ్వత్'శబ్ద పాఠ మొనర్చి 'సంధివేలాద్యృతు నక్షత్రేభ్యోఽణ్' అనుసూత్రమున నణ్ణంతముగాఁ బై వ్యాఖ్యాతలు శాశ్వత శబ్దమును సాధించినారు.

ఇంత యేల? మహాభాష్యకర్త పాణినిసూత్ర ప్రయోగములను బాణినిసూత్రములచేతనే సాధువు లని యెట్లు సాధించియున్నాఁడో గమనింపుఁడు.

(యా స్త్ర్యాఖ్యౌ నదీ)- అథ స్త్ర్యాఖ్యావితి. కోఽయం శబ్దః. స్త్రియమాచక్షాతే స్త్ర్యాఖ్యౌ. యద్యేవం స్త్ర్యాఖ్యాయావితి ప్రాప్నోతి. అనుపసర్గే హి కో విధీయతే...అథవా పునరస్తు క ఏవ 'స్త్రియమాచక్షాతే స్త్ర్యాఖ్యావితి. నను చోక్తం స్త్ర్యాఖ్యాయావితి ప్రాప్నోతి. అనుపసర్గే హి కో విధీయతే ఇతి. మూలవిభుజాదిత్వాత్కో భవిష్యతి (మహాభాష్యము, ౧-౪-౨-3).

ఇట్టి వనేకములు. ఇంకను బాణిని యను శాసించినభాష వేఱు, సూత్రములు వ్రాసినభాష వేఱు అనువా రుందురా?

ఇదిగాక యీపట్టున 'అపాణినీయము' లని వీ రుదాహరించిన సూత్రప్రయోగము లన్నియుఁ బాణినీయ సాధ్యము లని శివదత్తాదులు సాధించినవియే. మహాభాష్యమున 'నిత్యప్రహసితః', 'నిత్యప్రజల్పితః' అనువానిని ప్రదర్శించి నిత్యశబ్దమునకు బహుళార్థకత్వ

ము నిరూపింపఁబడినది. పైశబ్దములలోని నిత్యశబ్దము అనవరతము – అవిరతము అను నర్థమునఁ బ్రయోగింపఁబడినది కాదు. ఎడతెగక – అనఁగా నొక్కక్షణ మేని యాఁగక యెప్పుడును నవ్వువాఁడు లోకమున నుండుటయే యసంభవము. కావున నీ ప్రయోగముల లోని నిత్యశబ్దము బహుళార్థకము–అనఁగా 'ఎక్కువగా నవ్వువాఁడు' అను నర్థమును బోధింపఁజాలినది. ఇట్లే 'ఙమో హ్రస్వా దచి ఙము ణ్నిత్యమ్' అను సూత్రములోని నిత్యగ్రహణము గూడ బహుళార్థకము— అనఁగా, చాలవఱకీసూత్రము స్వలక్ష్యములయందుఁ బ్రవర్తింపవలసినదియే. కాని కొన్ని లక్ష్యములయం దీసూత్రము ప్రవర్తింపకపోయినను దోషము లేదని భావము. పాణిని యీయాశయమును మనకు సూచించుటకే పైసూత్రములలో ఙముడాగమ మొనర్పక 'ఇకో యణచి' 'సనాద్యంతా ధాతవః' 'సుప్తిఙంతం పదమ్' అని ప్రయోగించెను. 'శప్శ్యనోర్నిత్యమ్' అను సూత్రములోని నిత్యగ్రహణముకూడ నిట్టిదే యనుచుఁ దాను రచించిన పాతాళవిజయకావ్యములో 'అపశ్యతీ వత్సమి వేందుబింబమ్' ఇత్యాదులఁ బ్రయోగించినాఁడు. మహాభాష్యమునుబట్టి యీసూత్రములకు శివదత్తాదులే యిట్లు వ్యాఖ్యానించిరి : 'సిద్ధే శబ్దార్థసంబంధే' అను వార్తికవ్యాఖ్యానసందర్భమునఁ గల మహాభాష్యమును జక్కఁగాఁ జదువుకొనిన నీయర్థ మంతయుఁ దేటతెల్లముగాఁ బాఠకలోకమునకు విశదపడును. ఇట్లీసూత్రప్రయోగములును నీ రపాణినీయము లనుట కంగీకరింపకున్నవి.

చింతామణివిషయపరిశోధనమున నపాణినీయము లని పేర్కొనఁబడిన పైపదునొకండు ప్రయోగములును 'పాణినీయము కావ్యభాషానుశాసకము కాదను సిద్ధాంతసౌధమునకు మూలస్తంభములు. ఇవి యన్నియు నీవ్యాసమున నాప్రదర్శించినరీతిని పాణినీయములే యైనవి గనుక శ్రీశాస్త్రిగారి సిద్ధాంతసౌధము మూలస్తంభములు లేని సౌధమువలె నిరాధార మైనది.



# జాను తెనుఁగు

= శ్రీ నేలటూరు వెంకటరమణయ్య =

"శివకవులు పలువురు జానుఁదెనుఁగును బ్రశంసించియున్నారు" అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు చెప్పియున్నారు.[1] కాని లెక్కించి చూడఁగా నీ మాటను వాడినవా రిరువురే కానవచ్చుచున్నారు. వీరియందు మొదటివాఁడు నన్నెచోడుఁడు; రెండవవాఁడు లింగాయతకవి పాల్కురికి సోమనాథుఁడు. శివకవుల వైఖరిని ప్రభాకర శాస్త్రిలవారు ఇట్లువివరించియున్నారు: "వీరశైవులలోఁ గవీశ్వరులగువారు శివునిమీఁదను, దద్భక్తులమీఁదను దక్క నితరులగు భవులమీఁద నెప్పుడును గృతులఁ జెప్పెడివారు కారు. కావున వారికి శివకవు లను పేరు గల్గెను. కర్ణాటాంధ్రగ్రంథములలో శివకవుల ప్రశంస కలదు. శివకవులు భవికవులను గర్హించిరి. కవితలోఁగూడ వారు వేఱుమతమువా రయిరి."[2] శివకవుల రీతి యిట్టిదే యైనచో నన్నెచోడుని శివకవుల కోటియందుఁ జేర్చుట సమంజసముగఁ గాన్పించదు. ఏలన, శివకవులవలె నితఁడు భవికవులను గర్హించలేదు. శివ, భవి భేదమునే ఇతఁ డెఱుఁగఁడు; శివకవులు ప్రశంసించని వాల్మీకి వ్యాసులను బ్రశంసించి యున్నాఁడు.[3] తెనుఁగు కవీశ్వరుల నెన్నకపోవుట కప్పటికి తెనుఁగున గ్రంథములఁ జెప్పి పేర్కొనుటకుఁ దగిన కవి యెవ్వఁడును లేకపోవుటయే కారణము. కావున ప్రభాకర శాస్త్రిలవారిచే నిర్ణయింపఁబడిన శివకవికోటిలో నితఁడు చేరఁడు. అట్లనుటచే నితఁడు శైవుఁడు గాఁడని భావించరాదు. శివుఁడే పరదైవ మని యితని విశ్వాసము.[4] కాని యాకారణముచేఁ గవితాప్రపంచమున నితఁడు మతభేదమును బరిగణించలేదు. కావున "శివకవులు పలువు" రనుటకంటె "నాంధ్రకవులు కొంద" ఱనుట సరియని తలఁచెదను.

## నిర్వచనము

ఇఁక 'జానుఁదెనుఁ' గన నేమో విచారింతము. ప్రాచీను లెవ్వరును దీనియర్థ మును నిర్వచించలేదు. వాఙ్మయమునందలి ప్రయోగముల మూలమున దీని యర్థమును సాధించవలసియున్నది. కాని యిట్టి ప్రయోగము లెన్నియో లేవు. లభ్యమైన యాంధ్ర గ్రంథములలో మూఁడునాలుగు మాత్రమే కానవచ్చుచున్నవి. ఇం దొకటి నన్నెచోడుని కుమారసంభవములోనిది:

సరళముగాఁగ భావములు జానుఁదెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితివేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గాలఁగాఁ.

[కుమారసంభవము, ౧-౩౫]

1. బసవపురాణపీఠిక, పుట ౮౩. 2. అదే, పుట ౮౧. 3. కుమారసంభవము, ౧: ౧౭-౧౯. 4. అదే, ౧-౧౨.

ఇందు నన్నెచోడుఁడు దాను కావ్యమును జానుఁదెనుఁగున రచియించెద నని చెప్పెనే కాని యాజానుఁదెనుఁగుస్వభావ మిట్టి దని తెలియఁబఱచ లేదు.

మఱిమూఁడు ప్రయోగములు పాల్కురికిసోముని గ్రంథములం దగపడుచున్నవి :

ఉరుతరగద్యపద్యోక్తులకంటె – సరసమై పరగిన జానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ – గూర్చెద ద్విపదలఁ గోర్కెదైవాఱ.

[బసవపురాణము, పుట ౨౧]

అరూఢగద్యపద్యాదిప్రబంధ – పూరిత సంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబుఁగామి – జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు.

[పండితారాధ్యచరిత్ర, దీక్షాప్రకరణము, పుట ౧౫]

ఈ ద్విపదలవల్ల గద్యపద్యాదిప్రబంధసంస్కృతభూయిష్ఠము గానిది జానుఁదెనుఁ గని బోధపడుచున్నది. ఇంతేకాదు; వృషాధిపశతకమున జానుఁదెనుఁగుస్వరూప మిట్టి దని—

బలుపొడతోలు సీరయును బాపసరుల్ గిలుపారు కన్నువ
న్నెలతల సేసుకుత్తుకయు నిండిన వేలుపుటేఱు వల్లుపూ
సల గల ఱేని లెంకనని జానుఁదెనుంగున విన్నవించెదన్
వలపు మదిం దలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా.

అనుపద్యమున స్పష్టపఱచియున్నాఁడు. కావున పాల్కురికి సోముని మతమున జానుఁదెనుఁ గన అచ్చతెనుఁ గని తెలియవచ్చుచున్నది. పాల్కురికి సోముని వ్రాఁతను జూచియేకాఁబోలు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు ఇట్లు వ్రాసియున్నారు :

*"Palkuriki Somanadha has declared in the introduction to his works that he undertook to write in what is called Janu-Telugu and Dvipada metre, because the Sanskritic style adopted by the Champu writers could not easily be understood by the general masses."*[5]

శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలవారిది యచ్చతెనుఁ గని స్పష్టముగఁ జెప్పియున్నారు:

"తెనుఁగుదేశిలో వాడుకలో నున్న తెనుఁగుమాటలను జానుఁదెనుఁ గని వాడిరి. అదే యచ్చతెనుఁగు. జానుఁదెనుఁగున కుదాహరణముగా నీయఁబడిన సోమనాథుని పద్య మచ్చతెనుఁగుననే రచింపఁబడెను గదా." 6

సోమనాథుని వాక్యములు జానుఁదెనుఁ గన నచ్చతెనుఁ గను భ్రమను గలుగఁ జేయుచున్నను వాస్తవము విచారించఁగా జానుఁదెనుఁగునకు సరియైన యర్థ మది కాదని

5. *Navanadha Charitra, Eng. Intro. P. v.*

6. కుమారసంభవవిమర్శము, పుట ౧౬౭.

తోఁచుచున్నది. ఏలన, సోమనాథుని రచన లచ్చతెనుఁగుకబ్బములు గావు. ఇతరాంధ్ర కవులను బోలె నితఁడును సంస్కృతాంధ్ర మిశ్రభాషనే వాడియున్నాఁడు. తిక్కన సోమయాజి కవనమందుఁబోలె ఈతని కవనమందును సంస్కృత పదములకంటెఁ దెనుఁగు మాటలే యధికముగఁ గానవచ్చుచున్నవి. అంతమాత్రముననే ఇతని గ్రంథముల భాష యచ్చతెనుఁ గని చెప్పుట తగదుగదా! జానుఁదెనుఁ గచ్చతెనుఁగే యైనపక్షమున నితఁడు జానుఁదెనుఁగున గ్రంథములను రచించితి నని చెప్పినది పొల్లుమాట, దబ్బఱ యనుకొన వలసివచ్చును. కాని సోమనాథుఁడు దబ్బఱలాడె ననుట విశ్వసింపఁదగిన విషయము గాదు. మఱియు, "గద్యపద్యాది ప్రబంధపూరిత సంస్కృతభూయిష్ఠము గాని రచన జానుఁదెనుఁ"గని సోమనాథుఁడు నిర్వచించి చెప్పుచుండ, గద్యపద్యాత్మకమును, సంస్కృత భూయిష్ఠము నగు కుమారసంభవమును దాను జానుఁదెనుఁగున రచియించితి నని నన్నెచోడుఁడు దెల్పుచున్నాఁడు. దీనివల్ల వీ రిరువురును 'జానుఁదెనుఁగు' నొక్కవిధముగ నర్థము చేసికొనక భిన్నమార్గములను ద్రొక్కినట్లు తెల్లమగుచున్నది. ఒక్కమాట యర్థమును చేసుకొనుటయం దీ యిరువురును పరస్పర విరుద్ధమార్గములఁ ద్రొక్కుట చూడ జానుఁదెనుఁగున కీ రెండుమార్గములను సమన్వయపఱచెడి సామాన్యార్థ మేదో యుండ వలయు నని తోఁచుచున్నది. 'జానుఁదెనుఁగు' సమస్తపదము. జాను + తెనుఁగు అను రెండుమాటల కలయికవల్ల నది యేర్పడుచున్నది. దీనియందలి 'తెనుఁగు' భాషానామము; 'జాను' శబ్ద మా భాషా స్వభావమును దెలుపుచున్నది. కావున 'జాను' శబ్దార్థమును దెలిసికొనఁగలిగితిమేని 'జానుఁదెనుఁగు'యొక్క స్వభావము కొంతకుఁగొంత యేని బోధ కావచ్చును. 'జాను' శబ్దము దేశ్యశబ్ద మని సీతారామాచార్యులుగా రభిప్రాయపడిరి. ఇది జ్ఞానశబ్దభవ మనియు, 'జాణ'కుఁ దోఁబుట్టు వనియు నేను తలఁచెదను. దీనికి 'అందము', 'సౌందర్యము' అని యర్థము. 'జానుఁదెనుఁ' గనఁగా 'సొంపైన, లేక నుడికారముగల తెనుఁ' గని యన్వయము చేసుకొనవలయును. భాషాసౌందర్యమును, నుడికారమును కవులెల్ల నర్థించు గుణములే. తెనుఁగుకవులు జానుఁదెనుఁగును ప్రశంసించినట్లు కర్ణాటకులు 'జాణ్ణుడి'ని (జానుకన్నడము) బ్రశంసించియున్నారు. ఒక యుదాహరణము— జన్నఁడు అనంతనాథపురాణమునఁ దన కవితను బెంపొందించెడి గుణముల నిట్లు పేర్కొనియున్నాఁడు :

ఎనగనుకూలమక్కె గుణవమఱన జాణ్ణుడి పంపనింపు పొ
న్ననబగె నాగవమఱన బహుజ్ఞతె రన్నన కాంతి నాగచం
ద్రన రసభావ మగ్గళన వక్రితె నేమియదేసె పుష్పబా
ణన మృదుబంధ మీకవిగళొత్తె జినేంద్రపురాణకర్తృగళ్. [౧-౩౫]

కర్ణాట 'జాణ్ణుడి'యే 'జానుఁదెనుఁగు'నకు మాతృక యని తలఁచెదను. తెనుఁగునఁ గావ్యరచన లేనికాలమున నూతనాంధ్రకావ్యనిర్మాణమునకుఁ గడంగిన నన్నె

చోడుఁడు కర్ణాటవాఙ్మయమునుండి పెక్కువిషయములను గ్రహించినట్లు 'జాణ్ణుడి' ని గొని దానిని 'జానుఁదెనుఁగు'గ మార్చెననియు, నతని గ్రంథమునుండి పాల్కురికి సోముఁడు దీనిఁ గైకొనె ననియు తలఁచెదను. ఇది యెట్లున్నను జానుఁదెనుఁగనఁగా 'సొంపైన తెనుఁ' గనియే అర్థము చేసుకొనవలయును. ఈ'సొంపు'రూ పెట్టిదని నిర్ణయించ వలసివచ్చినప్పుడు అభిప్రాయభేదమున కెడము గల్గినది. నన్నెచోడుఁడు గద్యపద్యాత్మకమును, సంస్కృత భూయిష్ఠము నైన తెనుఁగే సొంపైనదని తలఁచెను; పాల్కురికి సోముఁడు ద్విపదరూపమును, సంస్కృతభూయిష్ఠము కాని తెనుఁగే సొంపైన దని యభిప్రాయపడెను. జానుఁదెనుఁగున కర్థమున నభిప్రాయభేదమున కెడము లేకపోయినను వస్తుస్వభావనిర్ణయసందర్భమున వ్యక్త్యభిరుచిభిన్నత్వమువలన నన్నెచోడ, పాల్కురికి సోమనాథులయం దభిప్రాయభేదము గానవచ్చుచున్నది.



# విద్య - అవిద్య



= శ్రీ బి. లక్ష్మీనారాయణరావు =

ఇతరజంతుసముదాయమునుండి మానవుని వేరుపరచునది యతని బుద్ధిబలము. ఈబుద్ధియే జ్ఞానసంపాదనకై మానవుని బురికొల్పు ప్రేరకశక్తి. కనుక మానవునకు దొలుతనుండియు జ్ఞానసంపాదనమునందాశ కలదు. మానవరచితమైన యసంఖ్యాకములగు శాస్త్రములన్నియు నీజిజ్ఞాసాఫలితములే యైయున్నవి. దేశకాలపరిస్థితుల మార్పుల ననుసరించి యితరజంతువులన్నియు తమ బాహ్యాంతఃప్రకృతులను మార్చుకొని జీవితమును సాగించుకొను శక్తిని గలిగియున్నవి. జీవితపరిణామచరిత్ర మీవిషయమును విపులముగ జర్చించి నిర్ధరించియున్నది. బాహ్యప్రకృతి కనుకూలముగా తమ ప్రకృతిని దిద్దుకొని, సాధ్యమైనంత సౌఖ్యముగా నీ భౌతికజీవితమును గడపుటయే మానవేతర ప్రాణుల యాశయము. ఆగతానాగతములగూర్చిన చర్చయు, అతీంద్రియవిషయములగూర్చిన మీమాంసయు వీటి జీవితమున కనుపయోగములు. వీటివలె మానవుడీ ప్రాపంచికజీవితముతోడనే తృప్తిపడియుండు స్వభావము కలవాడు కాడు.

భౌతికము, మానసికము నని మానవజీవితము రెండువిధములై యున్నది. జీవిత సౌఖ్యమునకు వలయు భౌతికపరికరము లన్నియు నున్నను మానవుడు సంతృప్తితో కాలము గడపజాలడు. ఈ జీవితయాత్రమాత్రమే యతని ధ్యేయము కాదు. జీవు డెవ్వడు, జీవునకును దేహమునకును గల సంబంధ మేమి, దేహాంతముతో జీవుడును నశించునా, నశింపనిచో నతని యుత్తరస్థితి యెట్టిది — అను నీ ప్రశ్నలు మానవుని దొలుతనుండియు గలచుచునే యున్నవి. ఈప్రశ్నలకు సమాధానములను దెలిసికొనవలె నను జిజ్ఞాసయు అప్పుడే పుట్టినది. బుద్ధిబలమందులకు దోడ్పడినది. ప్రపంచజీవితచరిత్రను, ప్రకృతిపరిణామమందలి వివిధావస్థలను, మానవప్రకృతితత్త్వమును ఆధారముగా జేసికొని, మానవుడు తన బుద్ధినుపయోగించి జీవితతత్త్వమునుగూర్చి యోచింపనారంభించినాడు. క్లిష్టమైన సమస్యలనుగూర్చి కొందఱు తదేకదీక్షతో, నిశ్చలసమాధిలో, తమలోదాము చర్చించుకొని తత్ఫలముగ కొన్ని సిద్ధాంతములను బ్రకటించినారు. ఈ జిజ్ఞాసువులమధ్య నెన్నియో చర్చలు, రాద్ధాంతములు జరిగినవి. కొన్ని సిద్ధాంతము లంగీకరింపబడినవి. జ్ఞానజ్యోతి వెలిగింపబడినది. ఈ వెలుతురనేకుల నాకర్షించినది. అనేకుల సంతతపరిశ్రమఫలితముగ, కాలాంతరమున, బూర్వసిద్ధాంతములపై వ్యాఖ్యలు, విమర్శలు బయలుదేరినవి; నూతనసిద్ధాంతములు పొడసూపినవి. మానవుని జ్ఞానభాండాగారము పెరుగజొచ్చినది. ఈ జ్ఞానమును బొందుటకు సాధనభూతమైనదియే విద్య.

## విద్య

'విద జ్ఞానే' అని జ్ఞానార్థకమైన 'విద్'ధాతువునుండి 'విద్యా' అను రూపము నిష్పన్నమైనది. ఇట్లు, జ్ఞానసాధనభూతమైనది విద్య యని యర్థమగుచున్నది. జ్ఞానము శాస్త్రలౌకికాది వ్యవహారజ్ఞాన మనియు, మోక్షసంపాదనోపయుక్తమైన పారమార్థికజ్ఞాన మనియు ద్వివిధము. రెంటను జ్ఞానపదముచేతనే వ్యవహరింపబడుచున్నవి. సామాన్యముగా శాస్త్రజ్ఞానము లేకయే పారమార్థికజ్ఞానమును బడయుట కష్టము. కనుక శాస్త్రలౌకికాదిజ్ఞానము పారమార్థికజ్ఞానమును బొందుటకు సహాయకారి యగుచున్నది.

"అంగాని వేదా శ్చత్వారః
మీమాంసా న్యాయవిస్తరః,

"పురాణం ధర్మశాస్త్రంచ
విద్యా హ్యేతా శ్చతుర్దశ."

అనగా, నాల్గు వేదములు, ఆఱు వేదాంగములు, పురాణములు, న్యాయశాస్త్రము, పూర్వోత్తరమీమాంసలు, ధర్మశాస్త్రము అని విద్యలు పదునాలుగు. వీనితో నాల్గుపవేదములను జేర్చగా విద్యలు పదునెనిమిది యని కొందఱి మతము.

## వే ద ము

"విదంతి ధర్మాధర్మౌ యతః" అను వ్యుత్పత్తి ననుసరించి వేదశబ్దము నిష్పన్నమైనది. అనగా కార్యాకార్యవివేకమును గలిగించునది యని యర్థమగుచున్నది.

"ప్రత్యక్షే ణానుమిత్యావా
యస్తూపాయో న బుధ్యతే,
ఏతం విదంతి వేదేన
తస్మాత్ వేదస్య వేదతా."

"కర్మబ్రహ్మోభయ ప్రతిపాదకం అపౌరుషేయం ప్రమాణవాక్యం వేదః".

"అస్య మహతో భూతస్య నిశ్వసిత మేతత్ య దృగ్వేదో యజుర్వేద స్సామవేదో ఽథర్వవేదః".

ఇత్యాది ప్రమాణవాక్యముల ననుసరించి వేదము అపౌరుషేయ మనియు, పరోక్షజ్ఞానసాధనభూత మనియు, యజ్ఞాదికర్మానుష్ఠానవిధిబోధక మనియు తెలియవచ్చుచున్నది. సామాన్యముగా వేదసముదాయమున కంతయు యజుర్వేద మనియే వ్యవహారము.

"ఏక ఆసీ ద్యజుర్వేదః
తం చతుర్థా వ్యకల్పయత్,
చాతుర్హోత్ర మభూత్ తస్మిన్
తేన యజ్ఞ మథాకరోత్"

"స ఋఙ్మయః సామమయః
సర్వాత్మా స యజుర్మయః,
ఋగ్యజుస్సామసారాత్మా
స ఏ వాత్మా శరీరిణాం"

"వేదాహి యజ్ఞార్థ మభిప్రవృత్తాః"

అని వేద మపౌరుషేయ మనియు, అనాది యనియు, ఈశ్వరస్వరూప మనియు చెప్పబడియున్నది. ఇంకను — "అనంతా వై వేదాః"అను శ్రుతివలన అనంత మనియు వ్యవహరింపబడు వేదము మొట్టమొదట సముదాయరూపమున నుండి, యజుర్వేద మనియే వ్యవహరింపబడుచుండెను.

## వేదవిభాగము - వ్యాసులు

ఇట్టి వేదమును విష్ణువు ఋగ్యజుస్సామాథర్వము లని నాల్గుప్రకారములుగా విభాగించె ననియు, ఈప్రకారమున విభాగముచేసిన కారణముననే అతనికి 'వ్యాస', లేక 'వేదవ్యాస' అను బిరుదు వ్యవహారమున వచ్చెననియు "ద్వాపరే ద్వాపరే విష్ణుః వ్యాసరూపీ జనార్దనః"అను ప్రమాణవాక్యము తెలుపుచున్నది.

'వ్యాస' అనునది యొక బిరుదవాచకమే కాని నామవాచకము కాదు. ఈ వ్యాసులు ముప్పదిమంది, ఒక్కొక్క కల్పమును బ్రహ్మ కొక్కొక్క పగ లని చెప్పబడియున్నది. ఒక్క కల్పకాలములో దేవలోకమున పదునలువు రింద్రులును, భూలోకమున పదునలువురు మనువులును రాజ్యము చేసి నివృత్తి జెందుదురు. కృత త్రేతా ద్వాపర కలియుగము లొక్కపర్యాయము తిరిగినచో నొక మహాయుగ మగును. ఇట్టి మహాయుగములు డెబ్బదియొక్కపర్యాయములు జరిగినచో నొక మన్వంతర మగును. ఇట్టి మన్వంతరములు పదునాల్గు చేరి యొక కల్ప మనిపించుకొనును. ఇట్టి ప్రతి కల్పమందును జరుగు ద్వాపరయుగములలో విష్ణువు వ్యాసరూపమున నవతరించి వేదములను విభాగము చేయునని చెప్పబడియున్నది. ఇప్పుడు జరుగుచుండు శ్వేతవరాహకల్పమున, ఇంతకుముందే గడచిన ద్వాపరయుగమున పరాశరపుత్రు డగు కృష్ణద్వైపాయనుడు వేదవిభాగము చేసిన కారణమున వేదవ్యాసు డను పేరతనికి జెల్లుచున్నది.

ఈ ప్రకారము విభాగముచేసిన వేదములలో ఋగ్వేదమును పైలునికిని, యజుర్వేదమును వైశంపాయనునకును, సామవేదమును జైమినికిని, అథర్వణవేదమును సుమంతునకును వ్యాసు డుపదేశించి లోక

మున ప్రచారము చేయించె నని విష్ణుపురాణమున జెప్పబడియున్నది.

"బ్రహ్మణా చోదితో వ్యాసః
వేదాన్ వ్యస్తుం ప్రచక్రమే,
అథ శిష్యాన్ స జగ్రాహ
చతురో వేదపారగాన్.

ఋగ్వేదగ్రాహకం పైలం
జగ్రాహ సుమహామతిః,
వైశంపాయననామానం
యజుర్వేదస్య చాగ్రహీత్.

జైమినిం సామవేదస్య
తథైవాథర్వవేదవిత్
సుమంతు స్తస్య శిష్యోఽభూత్
వేదవ్యాసస్య ధీమతః"

ఈ వేదసముదాయమునకు శ్రుతి యనియు, ఆమ్నాయ మనియు, నిగమమనియు వేరువేరు వ్యవహారములు గలవు (శ్రూయతే గురుపరంపరయా ఇతి శ్రుతిః, ఆమ్నాయతే ఇత్యామ్నాయః).

## వేదాధ్యయనము

ఈవేదమును ఉదాత్తానుదాత్త స్వరితయుక్తముగా గురువుచెప్పినట్లు శిష్యు డుచ్చరించవలెను. గురూపదేశము లేక ఉచ్చరించినచో స్వరవ్యత్యాసమువలన ననేకానర్థములు సంభవించును. "అగ్నిమీడే" ఇత్యాది స్థలములలో అగ్నిశబ్దమునకు బదులుగా 'వహ్ని' మొదలైన శబ్దములను ప్రయోగించినచో నాపాతతః చూచువారికి అర్థవ్యత్యాసముకాని, ఛందోవ్యత్యాసముకాని తోచకపోయినను దానికి వేదత్వమే లేకపోవును.

"మంత్రో హీనః స్వరతో వర్ణతో వా
మిథ్యాప్రయుక్తో న తమర్థ మాహ,
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్."

అను వాక్యానుసారముగా వర్ణ వ్యత్యాసము మాత్రమేకాక, స్వరమునను వ్యత్యాసము రాకూడదు. స్వరము లేక కేవలము దండాకారముగా నుచ్చరించిన దానికి వేదత్వము సిద్ధింపదు. కనుక వర్ణవ్యత్యాసము లేక, స్వరభంగము కలుగక, గురు వుచ్చరించిన రీతిగనే ఉచ్చరించిన మంత్రములకుమాత్రమే వేదత్వము సిద్ధించుచున్నది.

ఇట్లు శ్రుతి, ఆమ్నాయ శబ్దము లెంత గంభీరమైన గూఢార్థమును దెలుపుచున్నదియు, అట్టి శబ్దముల వలన బోధింపబడు వేదముయొక్క మహిమ యెట్టిదనియు దీనివలన నూహించవచ్చును.

## త్రయీవిభాగము

ఈ పైజెప్పిన నాల్గువేదములలోను ఋగ్వేద మంత్రములవలన దేవతల నాహ్వానించి, యజుర్వేద మంత్రములవలన ఆహుతినొసగి, సామమంత్రములవలన వారిని పొగడుట యజ్ఞాదులలో సంప్రదాయమై యుండుటచే నీ మూడువేదములుమాత్రమే 'త్రయీ' శబ్దముచే వ్యవహరింపబడుచున్నవి.

"ఆధ్వర్యవం యజుర్భిస్తు
ఋగ్భిః హౌత్రం తథా మునిః,
ఔద్గాత్రం సామభి శ్చక్రే
బ్రహ్మత్వం చాప్యథర్వభిః."

అను వాక్యమువలన, యజ్ఞములలో ఋగ్వేద మంత్రమును బఠించువానికి 'హోతృ' అనియు, తత్కర్తవ్యమునకు 'హౌత్ర' మనియు, యజుర్వేద మంత్రపాఠకునకు 'అధ్వర్యు' డనియు, నతని కర్తవ్యమునకు 'ఆధ్వర్యవ' మనియు, అట్లే సామ మంత్రములను గానముచేయువానికి 'ఉద్గాతృ' అనియు, నతని కర్తవ్యమునకు 'ఔద్గాత్ర' మనియు వ్యవహారము. ఈ రీతిగా పైమూడువేదములకుమాత్రమే యజ్ఞోపయోగిత్వము సిద్ధమైనది. నాల్గవదియైన అథర్వణవేదము ప్రత్యక్షముగా యజ్ఞములలో ననుపయుక్తముగా గనుపించినను, శాంతిక, పౌష్టిక, ఆభిచారిక, వశీకరణాదులలో విశేషముగా నుపకరించుచున్నది. యజ్ఞమున న్యూనాతిరిక్తములను సరిపరచు ప్రాయశ్చిత్తాదివిధానము లన్నియు అథర్వణబోధికములే. ఆ కారణమున నిదియు యజ్ఞోపయుక్తమే. "బ్రహ్మత్వం చాప్యథర్వభిః" అని యజ్ఞాదులలో

న్యూనాతిరేకములను సరిపరచి కర్మసాద్గుణ్యమును సంపాదించుశక్తి బ్రహ్మయం దుండు కారణమున అథర్వణవేదమునకును యజ్ఞోపయుక్తత్వము గలదు.

## వేదభాగములు - వేదశాఖలు

ఒక్కొక్క వేదమునను సంహిత, బ్రాహ్మణము, ఉపనిషత్తు అనియు, కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండ అనియు భాగములు గలవు. నిత్యనైమిత్తిక కామ్యకర్మములను, శాంతిక పౌష్టికాదులను నెరవేర్చుటకు అవశ్యకములైన మంత్రభాగము కర్మకాండ. భగవంతుని జేరుటకు వలయు ధ్యానవిధానమును జూపునది ఉపాసనాకాండ. ముక్తిని బొందుటకు సాధకమైనది జ్ఞానకాండ.

ఇక, వేదములయందు శాఖ లేర్పడినవి. ఋగ్వేదమున పది, శుక్లయజుర్వేదమున పందొమ్మిది, కృష్ణయజుర్వేదమున ముప్పదిరెండు, సామవేదమున పదునాలు, అథర్వణవేదమున ముప్పదియొక్కటి - ఇట్లన్నియు జేరి నూటయెనిమిదిశాఖ లేర్పడినవి. ప్రతి శాఖకును సారభూతమైన ఉపనిషత్తుల సంఖ్యయు నూటయెనిమిది యైనది.

## ఉపనిషత్తులు

" ఉప - ని - షీదతి అను పరమాత్మ " అను వ్యుత్పత్తివలన ఉపనిషత్తు లను పదము నిష్పన్నమైనది. వీటియందు పరమాత్మతత్త్వము, దానిని తెలియు సాధనములు, విధానములు మున్నగునవి వర్ణితములైయున్నవి. వీటిలో సామాన్యముగ మోక్షాపేక్ష గలవానికి మాండూక్యోపనిషత్తొకటియే చాలును. అక్కడికిని జ్ఞానము సిద్ధము కానిచో ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యక అను దశోపనిషత్తులను బఠించవలెను. తత్పఠనమువలన జ్ఞానము సంపాదించి ఆ జ్ఞానమును స్థిరపరచుకొనుటకై జిజ్ఞాసువులు ముప్పదిరెండుపనిషత్తులను, జీవన్ముక్తులు కాగోరువారు అష్టోత్తరశతోపనిషత్తులను అర్థవిచారము జేసి యనుభవమును బడసెదరు.

## వేదాంగములు

ఈవేదములు సామాన్యముగా అర్థమగుట కష్టమగుటచే, వేదార్థబోధనమునకై శిక్ష, వ్యాకరణ, నిరుక్త, ఛందస్, కల్ప, జ్యోతిష అను నా అంగములు నేర్పడినవి. అంగశబ్ద మూపచారికమాత్రము కాదు. మనుష్యునకు ముక్కు, కన్ను, కాలు మొదలైన అంగము లెట్లావశ్యకములో, ఏ అంగము లేకున్నను రూపవైకల్య మెట్లు సంభవించునో అట్లే వేదపురుషున కంగభూతములైన యీవేదాంగములలో ఏ ఒక్క అంగము వికలమైనను యథార్థముగా వేదార్థము బోధితము కాదు.

**శిక్ష :**

"శిక్షా శిక్ష్యతే సమ్యక్ వర్ణోచ్చారణలక్షణమ్" అని శిక్ష వర్ణముల నుచ్చరించవలసిన పద్ధతిని, తల్లక్షణమును బోధించుశాస్త్రము. ఒక్కొక్క వేదమునకును వేరువేరు శిక్షాగ్రంథములు రచింపబడినవి. యాజ్ఞవల్క్య పాణిన్యాచార్యులును, నారద పింగళ శౌనకాదులును శిక్షాగ్రంథాదులను రచించిరి. ఈశాస్త్రి మైదుఖండములుగా విభజింపబడినది. శిక్షనుగూర్చి "సర్వవేదోపయోగీ సర్వసాధారణీ" యనియు, "ఏకశ్శబ్ద స్సమ్యక్ప్రయుక్తః స్వర్గే లోకే కామధుగ్భవతి" యనియు చెప్పబడియుండుటచే శిక్షాధ్యయన మత్యావశ్యకమైనది. "వేదానాం నాసికా శిక్షా" యని వేదపురుషునకు శిక్ష నాసికాస్థానాపన్నమైనది.

**వ్యాకరణము :**

"వ్యాక్రియంతే శబ్దాః అనేన" అను వ్యుత్పత్తి నుండి వ్యాకరణశబ్దము నిష్పన్నమైనది. ప్రకృతి ప్రత్యయ వివేచనపూర్వకముగా లౌకిక, వైదిక- ఉభయపదసాధుత్వజ్ఞానమును, తద్ద్వారా సుశబ్ద ప్రయోగమును వ్యాకరణమువలని ప్రయోజనము. పాణినిమహర్షి శంకరునిగూర్చి తపస్సుచేసి, 'అ ఇ ఉ ణ్' ఇత్యాది పదునాల్గు సూత్రములను బడసి, వానిమూలమున అష్టాధ్యాయీసూత్రపాఠమును రచించెను. దానిపై కాత్యాయనమహర్షి యావశ్యకమైన స్థలములలో వార్తికములను జేర్చెను. పిమ్మట

పైసూత్రములకును, వార్తికములకును వ్యాఖ్యానరూపమున పతంజలిమహర్షి మహాభాష్యమును రచించెను.

"త్రికమేతత్ త్రిముని వ్యాకరణం వేదాంగమాహేశ్వరమ్." ఈమువ్వురను వ్యాకరణమునకు ఋషిత్రయమని పిలువబడుచున్నారు. "యథోత్తరం మునీనాం ప్రామాణ్యం" అని వీరికి వరుసగా ప్రామాణ్యప్రాధాన్యములు గలవు. ఈపాణినీయవ్యాకరణమే వేదాంగ వ్యాకరణము.

"ఇంద్రశ్చంద్రః కాశకృత్స్నా ఽపి
శలీ శాకటాయనః,
పాణిన్యమరజైనేంద్రాః
జయంత్యష్టాఽఽదిశాబ్దికాః"

అని యెనిమిదిమంది ప్రాచీనవైయాకరణులు గలరని చెప్పబడియున్నది. ఐనను, పాణినిదప్ప తక్కిన యేడుగురును లౌకికప్రయోగములనుమాత్రమే యుదాహరణములుగా బెట్టుకొని గ్రంథములను రచియించి యున్నారేకాని, పాణినివలె స్వరవైదికప్రక్రియ నెవరును వివరించనులేదు, ప్రస్తావించనులేదు. కనుక పాణినీయ మొక్కటియే వేదాంగవ్యాకరణమని పిలువబడుచున్నది. "ముఖం వ్యాకరణం స్మృతమ్" అని వేదపురుషునకు వ్యాకరణము ముఖస్థానాపన్నమై యున్నది.

ఈరీతిగా శిక్షవలన వర్ణోచ్చారణలక్షణమును, వ్యాకరణమువలన పదసాధుత్వజ్ఞానమును గలుగు ననియే వేదాంగములలో వీనిని మొదట నిర్దేశించి యున్నారు.

## నిరుక్తము :

ఇట్లు సాధుశబ్దజ్ఞానానంతర మర్థజ్ఞాన మావశ్యకము గనుక 'నిరుక్తము' మూడవదిగా బేర్కొనబడినది. వైదికమంత్రములయం దుండు క్లిష్టపదములకు నర్థము దెలుపుటకు యాస్కాచార్యుడు పదమూడధ్యాయములు గల నిరుక్తగ్రంథమును రచించెను. అతర్వాత దుర్గాచార్యుడు మొదలైనవారీనిరుక్తముపై భాష్యములను రచించిరి. వేదాంగములయందు నిరుక్తము శ్రోత్రస్థానాపన్నమైనది. "నిరుక్తం శ్రోత్ర ముచ్యతే". పదసముదాయమును నామ, ఆఖ్యాత, నిపాత, ఉపసర్గ అని నాల్గువిధములుగా దెలిపి వైదికమంత్రములకును, వైదికపదములకును సరియైన యర్థ మీగ్రంథమున వివరింపబడినది. వాక్యార్థజ్ఞానమునకు పదార్థజ్ఞాన మావశ్యకము. అర్థము తెలియనిచో ననుష్ఠాన మశక్యము. కనుక నిరుక్త మావశ్యకమైనది. ఈనిరుక్తమందే నిఘంట్వాత్మకమైన ఐదధ్యాయముల గ్రంథము యాస్కునిచేతనే రచింపబడినది. అమరసింహాదుల నిఘంటువులుకూడ వీనియందే అంతర్భావమును బడయుచున్నవి.

## ఛందస్సు :

మాత్రావర్ణగణాదుల లక్షణబోధకమైన శాస్త్రము ఛందస్సు. ఋఙ్మంత్రము లన్నియు ఛందోబద్ధములై యుండుటవలన వేదమున ఛందోజ్ఞాన మావశ్యకమైనది. పింగళనాగముని 'ధీశ్రీస్త్రీమ్' ఇత్యాది యెనిమిదిఅధ్యాయములు గల 'ఛందోవిచితి'అను గ్రంథమును రచించెను మొదటి మూడధ్యాయములందును గాయత్రీ, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతీ, పంక్తి, త్రిష్టుప్, జగతీ అను నేడు ఛందస్సులను అవాంతరభేదములతోగూడ వివరించి, పిమ్మట "అథ లౌకికమ్" అని యారంభించి, ఐదధ్యాయములందు పురాణేతిహాసములయం దుపయుక్తములైన లౌకికచ్ఛందస్సులను ప్రసంగవశాత్తు నిరూపించియున్నాడు. ఈ అష్టాధ్యాయాత్మక సూత్రసముదాయమును కాళిదాసాదులు సోదాహరణముగా వివరించియున్నారు. 'శ్రుతబోధ' మను ఛందోగ్రంథము కాళిదాసరచితమని ప్రతీతి కలదు. ఈప్రకారముగా నిర్ణీతమైన ఛందస్సులలో ఒక్కొక్క పాదమున నిరువదియారక్షరములవరకును గల పద్యసముదాయమునకు మాత్రమే ఛందోనిర్బంధములు గలవు. తక్కినవి దండకాది పదములచే వ్యవహృతములు.

## కల్పసూత్రములు :

వైదికమంత్రముల నేయేసందర్భములం దనుష్ఠానరూపమున వినియోగించవలెను- అను విషయమును బోధించుటకు కల్పసూత్రములు రచింపబడినవి. కల్పమనగా వైదికప్రయోగవిధిప్రతిపాదకశాస్త్రము. ఈ

శాస్త్రమున హౌత్ర, ఆధ్వర్యవ, ఔద్గాత్ర అను ప్రయోగభేదముల ననుసరించి కల్పసూత్రములందును భేదములు గలవు. ఆశ్వలాయన, సాంఖ్యాయన మొదలైనవారు హోతృప్రయోగప్రతిపాదకములైన సూత్రములను, బోధాయన, కాత్యాయన, ఆపస్తంబ మున్నగువారు ఆధ్వర్యవప్రతిపాదకసూత్రములను, లాట్యాయన, ద్రాహ్యాయణాదులు ఔద్గాత్రప్రయోగప్రతిపాదకములైన సూత్రములను రచించిరి.

జ్యోతిషము :

ఇక వేదబోధితములైన యాగాదులకు సరియైన కాలమును, గ్రహసంచారాదులను, గ్రహణ,పర్వకాల, సంక్రాంతి, యుగాదికాలభేదములను బోధించు శాస్త్రము జ్యోతిషము. ఇట్టి వేదాంగజ్యోతిషమును ఆదిత్యగర్గాదులు రచించిరి. యుగమన్వంతరకల్పాదుల వ్యవస్థాభేదములు దీని లౌకికప్రయోజనము.

## ఉపాంగములు-పురాణములు

ఈ అంగములుకాక, పురాణములు, స్మృతులు (ధర్మశాస్త్రములు), న్యాయశాస్త్రము, మీమాంస అని నాలుగు ఉపాంగములు గలవు. "పురా అనంతీతి పురాణాని"అను వాక్యార్థము ననుసరించి పురాణములు వేదములకంటెను ప్రాచీనములని యర్థము. వేదముల నుచ్చరించుటకు బూర్వము బ్రహ్మముఖమునుండి వెలువడిన వగు కారణమున వీనికి పురాణము లని వ్యవహారము గలిగినది. మత్స్య, మార్కండేయ, భవిష్య, భాగవత, బ్రహ్మవైవర్త, బ్రహ్మోత్తర, బ్రహ్మాండ, విష్ణు, వాయు, వామన, వరాహ, అగ్ని, నారద, పద్మ, కూర్మ, లింగ, స్కాంద, గరుడ అని పురాణములు పదునెనిమిది. "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్." అని వేదబోధితమైన యర్థమునే విపులముగను, కథారూపమునను వేదాధికారరహితులైనవారికి దెలుపుటకై పురాణములు రచింపబడినవి. "అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీసుతః" అని యీ పురాణము లన్నిటికిని వ్యాసుడు కర్త యని ప్రతీతి గలదు. కాని అతని కర్తృత్వ మన్ని పురాణములకును సంభవింపదు. విష్ణుపురాణమును వ్యాసుని తండ్రియైన పరాశరుడు చెప్పినట్లును, మార్కండేయపురాణమును మార్కండేయముని చెప్పినట్లును, కూర్మపురాణమును కూర్మరూపియైన భగవంతుడు చెప్పినట్లును, అగ్నిపురాణమును అగ్ని కుమారస్వామికి విద్యోపదేశరూపమున బోధించినట్లును, ఇట్లే యితర పురాణముల విషయమునను జెప్పబడియుండుటచే "కర్తా సత్యవతీసుతః" అను వాక్యమందలి 'కర్తృ'పదమునకు ప్రచారకు డని మాత్రమే అర్థము చేయవలసియున్నది. వేదములలో చెప్పబడియుండు విషయము లీ పురాణములలో కథాసందర్భముల ననుసరించి వివరింపబడియుండుటచే నీ పురాణములు వేదాభ్యాసము చేయనివారి కెంతయు నుపయుక్తములై యున్నవి.

## స్మృతులు

శ్రుతిబోధితములైన వర్ణాశ్రమాచారాదుల స్వరూపమును బోధించు శాస్త్రమునకు స్మృతి యని పేరు. దీనియందు వ్యవహారకాండ, ఆచారకాండ, ప్రాయశ్చిత్తకాండ అని మూడు భాగములు గలవు. మను, యాజ్ఞవల్క్య, విష్ణు, యమ, అంగిరస్, వసిష్ఠ,దక్ష, సంవర్త, శాతాతప, పరాశర, గౌతమ, శంఖలిఖిత, హారీత, ఆపస్తంబ, ఉశనస్, వ్యాస, కాత్యాయన, బృహస్పతి, నారద, పైఠీనస మొదలైనవారిచే నీ స్మృతులు రచియింపబడినవి. యాజ్ఞవల్క్యస్మృతియే పరివర్తనమును బొంది యిప్పటి రాజకీయమున హిందూ ధర్మశాస్త్ర (Hindu Law) మని వ్యవహారమునం దున్నది. వ్యాసప్రణీతమైన భారతమును, వాల్మీకిరచితమైనరామాయణమును, కపిలప్రణీతమైన సాంఖ్యశాస్త్రమును స్మృతులుగనే పరిగణింపబడి వానియందే అంతర్భూతమగుచున్నవి.

"యద్వై మను రవదత్ తద్ భేషజం" అను శ్రుతిప్రమాణము ననుసరించియు,

"వేదార్థోపనిబద్ధత్వాత్
ప్రాధాన్యం హి మనోః స్మృతమ్,
మన్వర్థ విపరీతా తు
యా స్మృతిః సా న శస్యతే."

అను ప్రమాణము ననుసరించియే యీస్మృతులన్నిటియందును మనుస్మృతి కెక్కువ ప్రామాణ్యము గలదు.

"కృతే తు మానవా ధర్మాః
త్రేతాయాం గౌతమాః స్మృతాః,
ద్వాపరే శాంఖలిఖితాః
కలౌ పారాశరాః స్మృతాః"

ఇట్లు కృతయుగమున మనుధర్మశాస్త్రమునకును, త్రేతాయుగమున గౌతమస్మృతికిని, ద్వాపరయుగమున శంఖలిఖితస్మృతికిని, కలియుగమున పరాశరస్మృతికిని ప్రాధాన్య మియ్యబడినది.

"దేశగ్రామకులాని స్యుః
భోగభాంజి కృతాదిషు,
కలౌ తు కేవలం కర్తా
ఫలభుక్ పుణ్యపాపయోః"

అనగా, కృతయుగమునం దెవ్వడైన పుణ్యపాపములను జేసినచో నాఫల మాదేశమువారి కందఱికిని ననుభావ్య మగుచుండెను. త్రేతాయుగమునం దొకని పుణ్యపాపముల ఫల మాగ్రామమువారికిని, ద్వాపరయుగమున నాకులమువారికిని మాత్రము జెందుచుండెనని స్మృతులు నుడువుచున్నవి. కలియుగమునం దొకని పుణ్యపాపములు వాడే యనుభవింపవలసియుండును. దీనినిబట్టి మానవగా యుగయుగమునకును మనుష్యుని జ్ఞానశక్తిసామర్థ్యములు క్షీణించుచుండె ననియు, దాని ననుసరించి ధర్మమును క్షీణించుచుండె ననియు దెలియుచున్నది. అట్టిచో కృతయుగమున పాపమునకు విధింపబడిన దండనాదులు తక్కిన యుగములలో విధింపవలనుపడదు. కనుకనే ఋషులు వేరువేరు యుగములకు వేరువేరు స్మృతులను ప్రామాణ్యముగా నిర్ధరించియున్నారు.

## న్యాయశాస్త్రము

వస్తుతత్త్వజ్ఞాన ప్రయోజకమైనది న్యాయశాస్త్రము. ఐదధ్యాయములు గల యీ న్యాయశాస్త్రము గౌతమప్రణీతమైనది. కణాదమహర్షికలన రచియింపబడిన వైశేషికశాస్త్రము దీనియందే అంతర్భావము నొందుచున్నది. ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ అను నాఱు భావపదార్థములను, అభావ మను నేడవపదార్థమును సాధర్మ్య వైధర్మ్యములవలన దెలిసికొనుట న్యాయశాస్త్రప్రయోజనము. ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాంత, అవయవ, తర్క, నిర్ణయ, వాద, జల్ప, వితండా, హేత్వాభాస, ఛల, నిగ్రహ, స్థాన- అను పదునాఱుపదార్థములను ఉద్దేశ, లక్షణ, పరీక్షాదులచే తెలిసికొనుట వైశేషికశాస్త్రప్రయోజనము. ఈ రెంటికిని నిదియే భేదము.

## మీమాంసాశాస్త్రము

ఇక మీమాంసాశాస్త్రమున కర్మమీమాంస, జ్ఞానమీమాంస అని రెండు భాగములు గలవు. కర్మవిచారబోధకమైనదానికి కర్మమీమాంస, లేక పూర్వమీమాంస యనియు, జ్ఞానవిచారబోధకమైన శాస్త్రమునకు జ్ఞానమీమాంస, బ్రహ్మమీమాంస, ఉత్తరమీమాంస, లేక శారీరకమీమాంస యనియు పేర్లు. కర్మమీమాంసయందు పండ్రెండధ్యాయము లున్నవి. దీనికి జైమినిమహర్షి కర్త. యజ్ఞాములయందు కర్మప్రాధాన్యమును బోధించునప్పుడు సామాన్య, విశేష, అతిదేశాదులవలన పౌర్వాపర్యప్రాధాన్యాదులను, ఉపసర్జనభావాదులను నిర్ణయము చేయునది కర్మమీమాంస. సంకర్షణకాండకూడ జైమినిప్రణీతమే. ఇది యుపాసనారూపమైన కర్మమునే బోధించుకారణమున కర్మమీమాంసయందే అంతర్భావమును బొందుచున్నది.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని యారంభించి "అనావృత్తి శ్శబ్దాత్ అనావృత్తి శ్శబ్దాత్" అనువరకును గల నాల్గధ్యాయములు గలది జ్ఞానమీమాంస. జీవబ్రహ్మముల యేకత్వసాక్షాత్కారమునకు గారణభూతమైన శ్రవణ మనన్నాది లభ్యమగు జ్ఞాన ముత్తరమీమాంసకు ఫలము. సమస్తవేదాంత వాక్యములకును సాక్షాత్తుగనో, లేక పరంపరవల్లనో జీవాభిన్నుడైన పరబ్రహ్మమును బోధించుటయందే తాత్పర్యము అను విషయము మొదటి యధ్యాయమున బోధింపబడినది. ఈ ప్రకారముగా వేదాంతవాక్యముల కన్నిటికిని పరబ్రహ్మమందే సమన్వయము సిద్ధమైనవెనుక, అనేకవిధములైన తర్కాదుల

వలన పూర్వపక్షముల గల్పించుకొని, ఆ పూర్వపక్షములకు సమాధానములను జెప్పుట రెండవ యధ్యాయమున వర్ణితము. మూడవ యధ్యాయమున బ్రహ్మసాక్షాత్కారమున కావశ్యకములైన సాధనములు నిరూపింపబడినవి. నాల్గవ యధ్యాయమున సగుణోపాసన, నిర్గుణోపాసన చేయువారికి ఫలవిశేషనిర్ణయము చేయబడినది. ఇదియే సర్వశాస్త్రసారభూతమైనది. మిగత శాస్త్రము లన్నియు దీనికి అంగభూతములైనవి. మోక్షాపేక్ష గలవా రెల్లరును దీనినే యాశ్రయించవలసియున్నది.

## ఉపవేదములు

ఇక నాలుగువేదములకును నాలు గుపవేదములు గలవు. ఋగ్వేదమున కాయుర్వేదమును, యజుర్వేదమునకు ధనుర్వేదమును, సామవేదమునకు గాంధర్వమును, అథర్వవేదమున కర్థశాస్త్రమును నుపవేదములుగా బరిగణింపబడినవి.

పురుషార్థసిద్ధికి జేయు ప్రయత్నము లన్నియు మానవుని యారోగ్యముపై నాధారపడియుండుటచే, నా యారోగ్యరక్షణకు వలయు విషయ మాయుర్వేదమున విపులముగ వివరింపబడినది.

క్షత్రియోచిత మగు ధనుర్వేదమున నస్త్రశస్త్రాదుల భేదములును, చతురంగబలలక్షణము, దీక్ష, శకునము ఇత్యాదులును, అస్త్రగ్రహణవిధానము, మంత్రదేవతలను సిద్ధిచేసికొనుట — యిట్టి విషయములన్నియు వర్ణితములై యున్నవి. బ్రహ్మమొదలు విశ్వామిత్రుని వరకును నీధనుర్వేదమునకు మహర్షులుగా జెప్పబడియున్నారు. ఈ ధనుర్వేదముకూడ ధర్మసంరక్షణమే ప్రయోజనముగా గలది.

దేవతారాధన మూలమున నిర్వికల్పసమాధిని బొందుట గాంధర్వవేదప్రయోజనము. ఈ గాంధర్వశాస్త్రమును భరతాచార్యుని మొదలుగా ననేకులు నానాప్రకారముగా విస్తరించియున్నారు.

అథర్వవేదమున కుపవేదమగు నర్థశాస్త్రమున నీతిశాస్త్రము, అశ్వగజశాస్త్రములు, సూపకారశాస్త్రము, చతుష్షష్టికళాశాస్త్రమును జేరియున్నవి. కామందక, శుక్ర, విదుర, బృహస్పతి, కళింగాదులు నీతిశాస్త్రమునకు గర్తలు. శాలిహోత్రు డశ్వశాస్త్రమును, పాలకాప్యముని హస్త్యాయుర్వేద మను గజశాస్త్రమును రచించిరి. నలభీములచే సూపకారశాస్త్రము రచితమని ప్రతీతి గలదు. ఇక చతుష్షష్టికళాశాస్త్రమున శిల్ప, నౌకానిర్మాణ, రత్నపరీక్ష, కావ్యవాచన, కావ్యరచన, మాలారచన, గంధయోజన, చతుర్విధవాద్యనిర్మాణ, కుక్కుటయుద్ధ, ఇంద్రజాల, రంగనిర్మాణ — ఇత్యాదులన్నియు జేరియున్నవి. అనేకులు మహర్షు లీకళాశాస్త్రములకు ప్రణేతలు.

## విద్యావిభాగము

ఇట్లు, పైన వివరింపబడిన వేదశాస్త్రసముదాయమున కంతటికిని విద్య యను పదము స్థూలముగా రూఢియం దున్నది. కాని మన పూర్వ లీసముదాయమును విద్య యని, అవిద్య యని రెండుగా విభజించియున్నారు. విద్యకు పరవిద్య యనియు, అవిద్యకపరవిద్య యనియుగూడ వ్యవహారము గలదు.

"ద్వే విద్యే వేదితవ్యే ఇతిహస్మయద్ బ్రహ్మవిదో వదంతి పరాచ ఇవాపరాచ. తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషం ఇతి". "అథ పరా యయా త దక్షర మధిగమ్యతే"

అని వేదవేదాంగాదులనన్నిటినిగూడ అవిద్యగా గణించి, ఉపనిషత్తులయందు బోధింపబడిన బ్రహ్మవిద్యనుమాత్రమే విద్య యనియు, పరవిద్య యనియు బ్రహ్మవేత్తలు నిశ్చయించియున్నారు.

"విద్యాం చావిద్యాం చ
య స్తద్వేదోభయగ్ం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా
విద్యయాఽమృతమశ్నుతే."

అవిద్యాసహాయమున నకాల మృత్యువును జయించి బ్రహ్మవిద్యామూలమున నక్షరమగు జన్మరాహిత్యమును బొందుటయే మన పూర్వుల జీవిత ధ్యేయమైయుండినది. పుణ్యమూలకముగా సంపాదించిన స్వర్గాదిలోకములుకూడ శాశ్వతములు గావనియు,

పుణ్యముతో నవియు నశించు ననియు, పిమ్మట జీవి పునర్జన్మము బొందవలెననియు మన శాస్త్రసిద్ధాంతము:

"తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే
ఏవ మేవాఽముత్ర పుణ్యాకృతో లోకః క్షీయతే"

"నసహ పునరావర్తతే"

"బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి"

ఇట్టి ప్రాపంచిక విషయముల యొక్కయు, స్వర్గాదిలోకముల యొక్కయు అస్థిరత్వమును దెలిసికొనిన మన పూర్వులు జన్మరాహిత్యమున కుపకరించు బ్రహ్మవిద్యనుమాత్రమే విద్యగా బరిగణించియున్నారు.

---

# చేయూత



= శ్రీ శివశంకరశాస్త్రి =

ప్రియా, నాడు కిర్మీరిత
పృథులరత్నకంబళమున
ప్రభాపుంజరంజితముగ
పండుకొంటి చతుశ్శాల.

శబలితోపధానమ్ముల
స్థగిత మైన శిరమునందు
జాలువారదొడగె మధు
స్వప్నచిత్రపటశ్రేణి.

మధుర మైన ఘట్టములో
మహీతలము జేర బుద్ధి
హఠాత్సంభవముగ ప్రియా,
అక్షియుగము తెరపువడియె.

నిండిపోయె నాచూపులు
నిర్జరాంగనావిదగ్ధ
విభ్రమమున తావకీన
విగ్రహంపుద్యుతులు ప్రియా!

పంచమ స్వరమ్ములోన
పలుకరించి నన్ను ప్రియా,
ఆరగింప ఫలరసమ్ము
లరుగుదేరు డంటి వపుడు.

నీయానతి నందుకొనియు
నేను మాంద్యవశత ప్రియా,
క్షిప్రముగా లేవలేక
చేతుల నందిచ్చినాను.

నమిత వగుచు సలీలముగ
నాదక్షిణపాణి బట్టి
ఊత యొసగినావు నాకు
ఉత్థానమునందు ప్రియా!

నీపాణిస్పర్శచేత
నిలు వెల్లను రోమాంచిత
మగుచునుండ లేచినాడ
హర్షపరవశాత్ముడనై!

నాటిమాట యెట్లు లున్న,
నా కీనిముసమ్మునుండి
జీవితమ్ము వరలును నీ
చేయూతనె ప్రాణప్రియ!

---



కథ:

# తన్మయత

= శ్రీ వేలూరి శివరామశాస్త్రి =

౧

"ఇంకను రాలేదేమి ?" అని రాజకుమారి ఇందుకీర్తి అనెను.

"ఇంత జాగేల ?" అని మహారాజాధిరాజు ఇందుకేసరి అనెను.

ఈ చఱుకులతో భటు లందఱును వెలికిఁ బరుగిడి చూచి వచ్చి "ఇదుగో వచ్చా రిదుగో వచ్చా" రని మనవి చేసిరి.

కోమటిపెద్దయు, కోటీశ్వరుఁడును, వృద్ధుఁడు నగు విజయమాలియు, నతని కుమారుఁడు మలయమాలియు వడివడిగా సింహాసనముకడకు వచ్చిరి. విజయమాలి తూలిపడి దానిని సాష్టాంగదండప్రణామముగా పరిణమింపఁ జేసెను. మలయమాలి రాజకుమారికి కనులప్పగించి నిలువఁబడిపోయెను.

రాజ్యలక్ష్మి, వీరలక్ష్మి అను దాసికలవలన మలయమాలి ఇందుకీర్తిసౌందర్యమును పలుమాఱులు వినియుండెను. "చూడనపుడు చెవులే దొడ్డవి" అని యతఁ డనుకొనెను.

కొందఱు భటులు కొన్ని పెట్టెలు తెచ్చి విజయమాలికనుసన్నలచే సింహాసనముముం దుంచి ప్రక్కల నిలువఁబడిరి.

ఇందుకేసరి కోమటిపెద్దను చూపులచే గారవించి "సముద్రయానము సంతోషకరమాయెనా?" అని అడిగెను.

"దేవరవారి దర్శనమువలె" నని విజయమాలి ప్రత్యుత్తరించి, రాజకుమారిని రెప్పవాల్పక చూచుచున్న కుమారునిఁ జూచి, "నాయనా ! ఆ పెట్టెలో... అల్లదిగో... ఆ పెట్టెలో..."

మలయమాలి ఉలికిపడి తండ్రిని జూచెను. విజయమాలి "ఆ పెట్టెలోని ఆణిముత్తెములు తీసి యిమ్ము" అని యనెను.

మలయమాలి పెట్టె తెఱచి అందలి యాణిముత్తెములఁ దీసి యిందుకీర్తికడకుఁ బోఁబోయెను.

"ఆఁగు మాఁగుము. నీ చేతులు మలినముగా నున్న" వని విజయమాలి తా నా ముత్తెములఁ దీసికొని రాజసన్నిధికిఁ జని "మహారాజా, ఇవి శుక్తిపేశికలు; మఱి యివి కావేరిలోని ఆణిముత్తెములు. ఇవి దేవరకు కానుక" అని యనెను.

"ఇవి బుద్ధభగవానునకే తగిన" వని ఇందుకీర్తి యనెను.

"తల్లీ! నా గర్భమున నీవే జనించితివి, కావేరీగర్భమున నివియే జనించినవి" అని యిందుకేసరి యనెను.

"రాజకుమారికంతశుక్తికిఁగాక మఱి దేని కివి తగును?" అని అనఁబోయి మలయమాలి వెంటనే నిగ్రహించుకొనెను.

"వీని కేమిగాని ముందు బుద్ధదేవుని జూపుము" అని ఇందుకీర్తి యనెను.

"జరాజీర్ణమగు నా యీ దేహము భగవానుని మోయ నోఁచుకొనలేదు. నాయనా! చేతులు దులుపుకొని నీవే చెప్పి చేయించిన బుద్ధదేవుని పదిలముగాఁ దీసి నీవే దేవరవారికడ నుంపుము" అని విజయమాలి యనెను.

మలయమాలి సంతసించి, బుద్ధుని పైకిఁ దీసి సింహాసనముముం దుంచి, తెర తొలఁగించి యిందుకీర్తిని జూచుచు నిలువఁబడెను. మలయమాలి లోఁగడఁ దాను జూచివచ్చిన సముద్రము లవణరాశి యనియు, యిందుకీర్తి లావణ్యరాశి యనియు ననుకొనెను.

ఇందుకేసరియు, ఇందుకీర్తియు వడివడిగా గద్దె దిగి బుద్ధునకు మ్రోఁకరించి లేచిరి.

"ఇది యేమి రాయి?" అని యిందుకీర్తి యడిగెను.

"సింహళపు పాలరాయి" అని మలయమాలి అనెను.

"మేలుమేలు. ఇట్టి విగ్రహము చెప్పి చేయించి తెచ్చినందులకు నీయభిజ్ఞతను కొనియాడ కూరకుండఁజాలను" అని మలయమాలిని ప్రశంసించి యిందుకీర్తిని జూచి "నా భావన కిది ప్రతిబింబము. ఈ దేవుని వేణువనమునఁ బ్రతిష్ఠింతము" అని యిందుకేసరి యనెను.

"ఆ ప్రదేశమే సార్వజనికము. ఇంతియు కాక అది మలయమాలివనమున కెట్టెదురు." అని యిందుకీర్తి యనెను.

"వేణువనము మా కానుకొనియుండుటచే మేమును ధన్యులము" అని మలయమాలి యనెను.

ఇటు లనుచుండఁగా చరాలున నటకు వినయజ్యోతి విజయంచేసెను. ఎల్లరు నతనికిఁ బ్రణమిల్లిరి. అతఁ డా ప్రతిమను రెప్పవాల్పక చూచి "బుద్ధుఁడే యిచట నవతరించె" ననెను.

"ఈ యవతారమునకుఁ దగిన తావు?" అని యిందుకేసరి అనెను.

"వేణువనము."

ఈ యేకవాక్యత కందఱ మోములును వికసించెను.

“తమ సెల వగుచో శిల్పుల రావించి విహార మొనరించు యత్నము నాది” అని వినయజ్యోతి యనెను.

“నిర్మాణ మెంత కాలములో నగును?” అని యిందుకీర్తి యడిగెను.

“అయిదారేండ్లలో” అని వినయజ్యోతి పలికెను.

“తా మిఁక ఆ ప్రయత్నమున నుండుఁ” డని యిందుకేసరి యనెను.

దివాణపు మొగసాలలో పదునాఱు గంటలు మ్రోఁగెను. ఎల్లవారల మోములందును సంతసము మోసులెత్తఁగా మలయమాలిమోమున విచారము తాండవించెను.

“జీవకళ యుట్టిపడుచున్నటు లీ విగ్రహమును జేయించినందులకు మలయమాలి శిల్పజ్ఞుఁడు. ఈ కళాభిజ్ఞున కీహారము పురస్కార మగుఁగాక” అని యిందుకీర్తి తన హార మొకటి తీసి యిచ్చి, “మలయమాలీ! నీ కౌశల్యము మా విహారనిర్మాణమునకుఁ గూడఁ దోడ్పడుఁగాక. మఱి మాతో నక్కఱ యున్నపు డెల్లపుడు మీకు మాప్రాసాదము ముక్తద్వార మగుఁగాక” అని యిందుకీర్తి అనెను.

“తమ రసికత కితఁ డధమర్ణుఁ” డని మలయమాలి అనెను.

ఇందుకీర్తియు, ఇందుకేసరియు వినయజ్యోతిని భిక్షుకు లోనికిఁ గొంపోయిరి. మలయమాలిచూపుల కొనలు ఇందుకీర్తి దువ్వలువతుదలఁ గంటకిత మొనరించి విధురములై పోయెను.

“నాయనా! పద” అని విజయమాలి అనెను.

“నీవు నడవవయ్యా” అని మలయమాలి తండ్రివెనుక తడఁబడుచు వెనుకఁ జూచుచు నడవఁదొడఁగెను.

౨

దుకాణమున మలయమాలి పచ్చల తివాచిమీఁద దిండు నానుకొని కూరుచుండెను. సిద్ధుఁ డను భటుఁడు త్రాసు లోనగు పరికరములను దుడిచి లోపలి గదులనుండి ఆయాయీ వస్తువులఁ దెచ్చి సెట్టిముందుఁ బెట్టుచుండెను.

“ఎక్కడి రాజకుమారి, ఎక్కడి మలయమాలి? అది మంగళముహూర్తము.” అని మలయమాలి లోలోపల ననుకొనుచు, ఆ రంగము నంతయు మనోనయనమునఁ దిలకించుచుండెను.

బేరగాండ్రు వచ్చుచుఁ బోవుచు నుండిరి. అందఱకును వెలలుచెప్పు మలయమాలి యిపుడు తన మానసమున నెలకొనిన మన్మథాపణమున ఇందుకీర్తివెల తెలిసికొను చుండెను.

విశ్వబ్రాహ్మణుఁ డొకఁడు వచ్చి మలయమాలిని జూచుచునే యతని పోలెము గని పట్టి యచట నిలువఁబడెను. ‘కూరుచుండుఁ’ డని సిద్ధుఁడు మరియాదచేయఁగా నతఁడు- కూర్చుండి - “సెట్టిగారూ! చిన్నంవెల ఎలావుంది?”అని యడిగెను.

మలయమాలి ఉలికిపడి చూచెను. బేరగాఁడు మరల నడిగెను.

"ఏమిటీ ?"

"బంగారంవెల ఎలా వుంది బాబయ్యా?"

"మామూలే."

అపుడు బంగారువెల రెట్టికిరెట్టిగా నుండెను. విశ్వబ్రాహ్మణుఁడు మఱి బేరమాడక "నూరు చిన్నా లిప్పించండి" అని అడిగెను.

మలయమాలి మేలిమి నీసి ఒఱపిడిరాత గీచి చూచి "సింహాసనమునుండి లేచినపుడిందుకీర్తి యిటులనే మెఱసిపోయె"నని యనుకొని దాని బేరగానిముం దుంచి ఆచి చూచుచుండెను.

"తూఁచి యివ్వండి."

ఈమాట వినియు చూపు మరల్చుకొనఁజాలకున్న మలయమాలి బేరగాని మందలింపు విని విసువుతో త్రాసెత్తి తూఁపఁదొడఁగెను. "ఇటు లెంత బంగారము వైచినను ఇందుకీర్తితోఁ దులతూఁగునా?" అని తలఁచుచు మలయమాలి బంగారుకణికల నూరక త్రాసులోఁ గురిపించుచుండెను. నేలఁ దాఁకుచున్న యాబంగారము "న న్నింతగా వ్యయింపవల"దని ప్రాణాచారము పడుచున్నటులుండెను. మలయమాలి యామేలిమిని నీఱుకాయలటులు తూఁచి బేరగానిముందు పడవైచెను. బేరగాఁ డామేలిమిని మూటగట్టుకొని వడివడిగా రూకలు లెక్కించి కుప్పవోసి పరువిడెను. మలయమాలి యాకుప్పను జూచి "ఇటు లెంత కుప్పవోసినను ఇందుకీర్తి యగునా?" అని అనుకొనుచుండెను.

ఇంతలో నింకొక బేరగాఁడు వచ్చి "హారతికర్పూరం ఉన్నదాండి?" అని అడిగెను. మలయమాలి తల యాఁపి "ఇందుకీర్తి నాకు దాపుగా వచ్చి మాటలాడినపుడు ఆరతికప్పురమేమి ? పచ్చకప్పురమే యామెను" అని యనుకొనెను.

"యాభై తులా లిప్పించండి"

మలయమాలితలలో పచ్చకప్పురమే యుండెను. కావున బేరగానిచేతిలో పచ్చకప్పురమే పడెను. ఆరతికప్పురపువెలయే మలయమాలిపెట్టెలోఁ బడెను.

ఇంతలో మఱియొకఁడు వడివడిగా వచ్చి "కస్తూరి ఉందాండి?" అని అడిగెను. మలయమాలిమానసము ఇందుకీర్తిశరీరసౌరభ మాఘ్రాణింపఁదొడఁగెను.

"అయ్యా, కస్తూరి-కస్తూరి?"

"ఆఁ?"

"కస్తూరి. ఆలస్యం చేయకండి బాబయ్యా. వినఁబడ్డదాండి?"

"ఆఁ. వినఁబడ్డది. రాజకుమారీహృదయసౌరభము నాఘ్రాణించునది, రాజకుమారీ వక్షువుల నాఘ్రాణింపఁజేయునది, రాజకుమారీముఖచంద్రులచేఁ గోరఁబడునది..." అని యిటు లాఁగక మలయమాలి చెప్పికొనుచుఁబోవుచుండఁగా బేరగాఁడు "సెట్టిగారూ! రోగి దర్భలమీఁదికి పోతున్నాఁడు. నారాయణస్మరణ కిది సమయం. తొందరగా కస్తూరి యివ్వండి" అనెను.

మలయమాలి తన ధోరణి నాఁపి ఇంత కస్తూరిఁ దీసి యిచ్చి "వెల యక్కఱలే" దని చెప్పి యతనిని బంపివైచెను.

దివాణపుదాసి వచ్చెడు వేళ యగుచుండెను. అతఁ డట్టెత్తి యాకసముదెసఁ జూచి "ఓరీ సిద్ధా, ఇంటికిఁ బోయి క్రొత్తగాఁ

దెచ్చిన మలయచందన మెత్తికొని రమ్ము" అని యాజ్ఞాపించెను.

ఆసందులో కొందఱు కొంటెబేరగాండ్రు వచ్చి కొన్ని వస్తువులఁ గొని ధన మొసఁగకయే మలయమాలిని మోసగించి వెడలిపోయిరి.

వీరలక్ష్మి సెలయేటివలె వచ్చి "సెట్టిగారూ! నాకు బజారులో చాలాపని వుంది. పెండ్లికొమార్తెగారి చీటీ ఇదుగో! ఈవస్తువులన్నీ కట్టించివుంచండి" అని ఒక చీటి మలయమాలిమీఁదఁ బడవైచి గబగబ వెడలిపోయెను.

మలయమాలి యాచీటిని కనుల కద్దుకొని యందలి ప్రతి అక్కరమును పరిశీలించెను. తరువాత దాని నతఁడు ముద్దులతో ముంచియెత్తెను. పిదప దాని నతఁ డెట్టెదుట నిడుకొని ఆలోచనలపాలాయెను.

వీరలక్ష్మి వచ్చి నివ్వెఱపడి "ఏమయ్యా, ఇంకా ఇల్లాగే కూకున్నావేం?" అని యనెను.

"ఈ చీటి వ్రాసిన దెవరు ?"

"కొత్తగా అడుగుతా వేమిటయ్యా? అమ్మాయిగారు మీకు తప్ప మరొకరికి స్వయంగా చీటీ వ్రాయరు. మలయమాలిగారంటే వారి కంత అభిమానం. వారి అభిమానం నిలుపుకోడానికయినా మీ అయ్యఅసలు నర కియ్యడేం ?"

"ఏమిటి ? ఈ సరకులు , చూడు." అని కొన్ని వస్తువులు వీరలక్ష్మిముందు పడవయిచి, మలయమాలి చీటిలోని వస్తువుల నన్నిటిని అనఁటియాకులలోను, నదాపనస యాకులలోను కట్టెను.

వీరలక్ష్మి వానిని దీసికొని నడచిపోవు సుగంధ్యాపణమువలె రాజవీథి నంతయు గుమగుమలాడించుచుఁ బోయెను.

అపుడు బేరగాండ్రు పలువురు రాఁదొడఁగిరి. మలయమాలి యిత్తడికిబదులు పుత్తడిని, గవ్వలకుబదులు రవ్వలను ఇచ్చి సిద్ధుఁడు రాకముందే దుకాణము మూసి యిలుదారిఁ బట్టెను.

3

మలయమాలి చేయించి తెచ్చిన బుద్ధవిగ్రహముచే రాజప్రాసాదమే విహారముగా మాఱెను. నాగరు లందఱును బుద్ధునిఁ జూచి మలయమాలికడకు వచ్చి యతనిని ప్రశంసచేయకుండఁ బోవుటలేదు. ఇట్టులు మలయమాలిమేడగూడ నొక క్షేత్రమాయెను. కాని వారి ప్రశంసలుమాత్రము ఆ ప్రతిమకువలెనే యతనికిని వినఁబడుటలేదు. మలయమాలి నగరమునందే విద్య నభ్యసించెను. అతని కన్ని దర్శనములందును సహాధ్యాయులు కలరు. అన్ని శిల్పములందును సహపాఠులు కలరు. "యోగికి వలయు నేకాగ్రతయు, జ్ఞానికి వలయు వివేకమును, దార్శనికునకు వలయు కుశాగ్రబుద్ధియు, కవికి వలయు ప్రతిభయు ఈ ధనపిశాచమున కేలరా ?" అని అనుకొననివాఁ డొకఁడేని వారిలో లేఁడు. చదువుకొనునపుడు ప్రక్కలఁ బదివేల డప్పులు మ్రోఁగినను అతఁడా మ్రోఁతయెడ బధిరుఁడు. ఎట్టెదుట సూర్యోదయమైనను అతఁ డంధుఁడు. అట్టి మలయమాలిని సహాధ్యాయులు, నుపాధ్యాయులును గొందఱు 'కాకి' యనియు, మఱి కొందఱు 'రాయి' యనియు నేఁటికి నుపహసించుచుఁ బ్రశంసించుచుఁ బోవుచుందురు.

నేఁ డతనిఁ జూడవచ్చిన సహాధ్యాయులలో కలశుఁ డను కాసీఁడును, మంథరకుఁ డను శిల్పియు నతనిఁ జూచి "నీవు తెచ్చిన బుద్ధుఁడు సర్వజ్ఞుఁ డయినచో నీవు కళాభిజ్ఞుఁడ" వని ప్రశంసించిరి. మంథరకుఁడు మలయమాలికి సహాధ్యేత యే కాక మిత్రుఁడు. ప్రకృత మితఁడు రాజశిల్పి. ఇట్టి యాతని ప్రశంసగూడ మలయమాలి చెవి నాటలేదు. కావున వీరందఱును మహాబధిర బిరుద మొకటికూడ మలయమాలికిఁ బ్రసాదించి నిర్గమించిరి.

మలయమాలి తన ఉపవనమునకుఁ జనెను. ఎట్టెదుటి వేణువనమును విలోకించెను. అచట పలువురు పనిబాగులవాండ్రు విహారమునకు పునాదులు తీయుచుండిరి. అతఁడు తోఁటమాలిని చూచి "ఓయీ, ఈ తీయఁబడుచున్న పునాదుల కెదురుగా మన తోఁటకర యంతయుఁ దీసివైచి యినుపకటకటా లెత్తింపుము." అని యాజ్ఞాపించి లోని కేగెను.

పలుతావులును, బలురంగులును గల పూవులు వనదేవతకు కచధార్యములై యంగరాగములై దువ్వలువలై యలంకారమును నిండారించెను. తుమ్మెదలు కొమ్మకొమ్మకుఁ దిరుగు త్రిమ్మరు లగుటయకాక గాయకు లయిపోయెను. మలయమాలియు నిటులు గాయకుఁ డయిపోయెను:

పచ్చనివారిలో మిగులఁ
 బచ్చని దంతయు నెమ్మనంబులన్
ముచ్చిలువారిలో మిగుల
 ముచ్చిలఁ గల్గిన దండకత్తెలం
దెచ్చగువారిలో మిగుల
 నెచ్చయినట్టిది నాదు డెందమున్
బిచ్చియొనర్చుచున్నయది
 పిన్నదదియ్యెడ నేడ నున్నదో ?

ఏటిరింత లెవరి యింగితమునో యాలలు వేయుచుండెను. మలయమాలియుఁ దన యింగితమును దెలుపుట కీలలు వేసెను. కోయిలలు కోకో యనెను. మలయమాలి చేతులు చాఁపి అత్తెత్తి చూచి ఆచ్చవడి నిట్టూర్చెను. నాలు గడుగులలో నతని కొక కాటుకపిట్ట కానిపించెను. దాని కతఁడు చేమోడ్చి కనులు మోడ్చెను. పిదప ఇందుకీర్తి వచ్చుచున్నటులు భావించి యిటులు పద్యమల్లెను:

నీవు వచ్చుచుండ నీముందు పదియాఱు
 వన్నె బంగరుడాలు పర్వులెత్తు
నీవు నిల్చినచోట నింగిపై నేలపై
 నెత్తావు లొలయు వెన్నెలలు కాయు
నీవు పోవుచువేని నీ వెన్క విశ్వంబు
 నీ చెంగు పట్టి నిన్ వెంబడించు
నీవు కన్నెత్తిన నివ్వెఱ నెల్లచు
 క్కలు మోఁకరించు నీ కాలిముందు
నీవు కూర్చుండు నెడలను నీదుక్రింద
 కాంతిచక్రంబు పీఠమై కానిపించు
నీవు పన్నుండు నెడలను నెవ్వెలుంగు
 పాప పూఁబాను పసను లావణ్యమూర్తి.

చంద్రుఁ డుదయించుచుండెను. అతఁడు దిగుడుబావికడ కరిగెను. దాని చుట్టును ఆకుఁ బచ్చని పొదరుటీరములు. వానిలో ఎలపులుఁగుల యెలుఁగులు. నీటిలో నంచలుఁగొంచలు. కనుసెవులకు తగిలిన–మిగిలిన వేడుక.

అంతలో సశబ్దమగు వేణువనము నిశ్శబ్దమాయెను. కర్మకరు లందఱును కాకులవలె నెగిరిపోయిరి. పిమ్మటఁ గొంతసేపటికి ప్రాంతమును దిలకింప రాజకుమారి 'వచ్చుచుం

డెను. వైశ్యకుమారుఁ డామెరాకను గ్రహించి పొంచిచూచి——

వనదేవతవె మేలిపసిమియాకుంబచ్చ
 పట్టుచీరను మేనఁ గట్టినపుడు
రాయంచవే యందెరవళితో నడుగుడు
 బెట్టి వేఁడుగను బెట్టినపుడు
వీణవే చెలులతో విరిదమ్మి నెత్తావి
 యనివాఱు దిరుగ మాటాడినపుడు
శారదపూర్ణిమాచంద్రమోబింబ
 వే యెట్టయెదుట మోమెత్తినపుడు
భాద్రపదమాసమున నమావాస్యవే త
మాలసమ్మిల్ల! వెనుకకు మరలినపుడు
హృదయదేవతవే యెట కేగినప్పు
డేమి చేసినయపు డేమి యెంచినపుడు.

అని పద్య మల్లి వెంటనే తనమీఁద నున్న సన్నని యుత్తరీయముఁ దీసి వేణువన ద్వారమునఁ బఱచి తా నావలి కేగి పరికించుచుండెను.

మునిముందు వచ్చిన యిందుకీర్తి యా వలువను జూచి చుట్టుప్రక్కలఁ జూచెనుగాని యామె కచట నెవరును గానరాలేదు. "అమ్మాయిగారంటే దేముడితో సమానం అని తలఁచుకుండేవా రెవరో పరచివుంటా" రని వీరలక్ష్మి అనెను.

"చూడవచ్చినవా రెవరో పారేసుకుని పోలేదుకంద?" అని రాజ్యలక్ష్మి ఆ యుత్తరీయమును దీసి దులిపి బుజముమీఁద వేసికొనఁబోయెను.

"ఇటు లిమ్ము" అని యిందుకీర్తి దానినిఁ దీసికొని వేణువనమును బ్రవేశించెను.

మలయమాలిహృదయము నృత్యమొనరించెను. తన యనురాగలతిక యిందుకీర్తి బుజములమీఁద బ్రాఁకిపోయె నని యతఁడనుకొనెను. తన ప్రేమయే యుత్తరీయమై యిందుకీర్తి నాచ్ఛాదించె నని యతఁడు మురిసెను. ఉత్తరీయమే మూఁకదూతి యాయె నని యతఁడు సాగసెను. పునరుక్తులకుఁగాని, సంభావనలకుఁగాని విసువు లేని కుతూహలముచే నతని హృదయము గారచేయఁబడెను.

రాజ్యలక్ష్మియు, వీరలక్ష్మియు వెనుదిరిగి చూచిరి. ఇందుకీర్తి వెనుకఁబడియుండెను. చలువ వెన్నెల వలువచేఁ గప్పఁబడి దవ్వులనుండి వచ్చుచున్న యిందుకీర్తి మలయమాలి కొక రహస్యదేవతవలెఁ గానిపించెను. ఆలోచనము దెలుపు పాదవిక్షేపములతో నామె దారితలకు వచ్చెను.

ఇందుకీర్తిబుజములమీఁద తన యుత్తరీయము మలయమాలికిఁ జక్కఁగాఁ గానిపించెను. ఇందుకీర్తి యచట మఱొకమా అంతటఁ గలయఁగాంచెను గాని వృథా.

ఇందుకీర్తి ముందు నడవఁగా దాసికలు వెనుక నడచిపోయిరి. ఇందుకీర్తిమూఁపుల మీఁద తానే పోవుచున్నటులు మలయమాలి తలపోసెను.

౪

"సిద్ధా, ద్రవ్యముల నన్నిఁటిని సిద్ధపఱచితివా?"

"నా పేరే సిద్ధప్ప కాదాండీ?"

"అటులైనా? ఫేనక మున్నదా?"

"ఆఁ"

"దంతరాగము?"

"ఆఁ"

"వసనాంగరాగము?"

"ఆఁ"

"అలక్తకము ?"

"ఆఁ."

"అంజనము ?"

"ఆఁ."

అపు డచటికి వీరలక్ష్మి ఉసురుసీరువలె వచ్చి "పెండ్లికొమార్తెగారిప్పుడు ఓలలాడ డానికి ఏటికి దయచేస్తున్నారు. గబగబా ఈ సరకులు కట్టండి." అని మలయమాలిమీఁద ఒక చీటి పడవైచి "కోమటివాడలో పని వుంది; ఇపుడే వస్తి" అని రెండడుగులు వైచెను.

"ఉండు ముండుము"

"మళ్లీ వస్తినిగదయ్యా, ఏ మంత తొందర?" అని వీరలక్ష్మి మాట వినిపించుకొనక అంతర్ధాన మాయెను.

మలయమాలి కొంతసే పన్యమనస్కుఁడై కూర్చుండి పిదపఁ జీటి తీసి చదివికొని 'సిద్ధా' అనెను.

"ఆఁ"

"వెనుకటివి కాక స్నానోద్వర్తనచూర్ణము, దీపవర్తికలు, శిహ్లాకము, శైలజముకూడ పొట్లములు కట్టుము"

సిద్ధుఁడు వాని నన్నిఁటిని చక్కని పంఘటాకులలో అందముగాఁ గట్టుచుండఁగా మలయమాలి మఱొక ప్రపంచము కట్టుచుం డెను. ఇంతలోఁ దనకు క్రొత్తమేడ కట్టిన పనివారలలో పెద్ద ఒక పెద్ద బహుమతికొఱకు వచ్చి మలయమాలికి నమస్కరించెను.

మలయమాలిమానస మపుడు ఇందు కీర్తిని పూలతో పూజింప నాలోచించుచుండెను. కావున నతఁడు "మంజరీ, నీవు పూఁదోఁట కేగి పూగుత్తుల నన్నిటిని గోసి కొని రమ్ము" అనెను.

"అయ్యా, నేను మంజరిని గాను. తమ మేడ గట్టినవాఁడను"

మలయమాలి కనులఁ దెఱచి చూచి "ఆఁహాఁ. ఓరి సిద్ధా, నీ వేగి వెంటనే పూలఁ గొనిరమ్ము" అనెను.

సిద్ధుఁడు నిర్గమించెను.

మలయమాలి యాపనివాని యాశ సంపూర్ణముగా తీర్చి యతనినిఁ బంపివైచెను.

అంత వీరలక్ష్మి వచ్చి "ఏమండీ సెట్టిగారూ, సుగంధాలు కట్టివుంచ మంటే ఇంత పరాకా?" అనెను.

"నాపరాకును నీ వీమాత్రము సవరింపఁ జాలవా?"

"ఎల్లానండీ"

"నీవిటనుండి సూటిగా ఏటికే వెళ్లునది"

"అమ్మో! బుద్ధఘట్టానికి నడిచిపోయేదా? నాకు నాలుగుకాళ్లున్నాయనుకున్నారా?"

ఈ సంభాషణలో రాజకుమారి బుద్ధఘట్టమునకు పోవు ననుసంగతి తేలిపోయెను. మలయమాలి మఱి మాటాడక సిద్ధుఁడు కట్టియుంచిన పొట్లము లన్నియు వీరలక్ష్మి ముందు పడవయిచెను.

"కట్టేనా యీమ్మూటలు?" అని వీరలక్ష్మి వాని నందుకొని లేడివలెఁ బరువెత్తెను. మలయమాలి అంగడి మూసివైచెను.

ఈరెండకుఁ జాఁపిన ఘోడవుమెడల జక్కావ లుపసంహరించుకొనెను. వృక్షములు

సూర్యోపాసనమునుండి లేచెను. మెఱుఁగెక్కిన సూర్యకిరణ ప్రసారముచే నది యంతయు దర్పణసహస్రఖచితమై స్ఫటిక భూమివలెఁ గనుపట్టెను. నేలయు, సింగియు పచ్చియలనెపమునను, కాంతులనెపమునను ఆనందమును చిమ్మెను. రాజప్రాసాదమునుండి సుగంధప్రవాహ మొకటి నదీ ప్రవాహమువలెనును బ్రవహించెను. జనప్రవాహముచే నదీప్రవాహ మినుమడించెను. మంద మధ్య వేగములచేఁ బ్రసరించు నదీ తరంగములు సంకీర్తనముచే నామంత్రితుఁడైన వరుణుని చేతుల ననుకరించి మాలిన్యమును క్షాళన మొనరించుచుండెనో యన నొప్పెను.

అపు డిందుకీర్తి దాసీనిరపేక్షముగా నది లోనికి దిగి బుద్ధుని స్తోత్రము చేయుచు ఓలలాడఁదొడఁగెను. దాసీజన మెల్లయు మాయాదేవి నుతకలాడించుచు ప్రవాహముదిగువ స్నాన మొనరింప మొదలిడెను. ఖేచరులకు వారి దర్శనము తీర్థము, స్వార్థము నాయెను.

మునిఁగి లేచునపుడెల్ల దేవతలు పుష్పవృష్టి కురిపించిరో యన ఇందుకీర్తిమస్తకము పద్మములను, పాటలములను, మల్లియలను, మొల్లలను, వకుళములను, వంజుళములను వింతగా పై కెత్తుచుండెను. పై నున్న మోచేతివంపు మలుపు దిరిగి పుష్పప్రవాహ మొకటి సూటిగా తనమీఁదికే వచ్చుటా మెకక్కజము కలిగించుచుండెను. ఆమె స్నానము ముగించువఱకును పూవు లామె తల నలంకరించుచు నేయుండెను. ఆమె దానికి కారణ మాలోచించుచు నేయుండెను. దాసీజనము గాన మొనరించు బుద్ధుని యోలపాటలు జలజంతువుల కహింసావ్రతము నేర్పెను. నదీతీర మెల్లయు వేదికాలంకృతమై వేదికలన్నియు బుద్ధాలంకృతములాయెను. సార్వజనికమైన ధ్యాననిద్ర యొకటి వ్యాపించెను. సూర్యుఁ డాయుపాసికల వేనలిచెమ్మ నేకాక బ్రహ్మరంధ్రములఁ బట్టిన చెమ్మనుగూడఁ దుడిచివైచెను.

సూర్యుఁ డపుడు తల వంపకుండ నదీదర్పణమున తన ప్రతిబింబముల నన్నిఁటిని జూచుకొనెను. వాయువు రాణివాసముల నెత్తావిచే బూరటిల్లి విశ్రాంతి గొనెను. మయూరములు మధ్యాహ్నసూర్యునకు నీనములను, ఎత్తుగీతులను పాడెను. స్నాతాయాతమైన జనప్రవాహము రాజవీథి కంతయు నశాంతిచే శాంతి కలిగించి ప్రాసాదాభిముఖముగా నడచెను.

ఆయెడ మలయమాలి తన మేడ యెక్కుచు—

నీటను బుట్టినట్టి నళి
   నీదళలోచన లక్ష్మివోలు నీ
వేట మునింగి లేచుతఱి
   నిచ్చిన యీ యభిషేకవారితో
పాటు మహోనురాగపరి
   పాటికిరీటముతైన యీ హరిత్
పాటల నీలగౌరసిత
   పాండరపుష్పము లేడవే చెలీ.

అని కవన మల్లెను.

౫

అన్నపానముల మఱచి మేడమీఁదఁ గూర్చుండి మలయమాలి చంద్రు నందుకొనఁ గోరెను. ఆ చంద్రుఁ డెంత దవ్వుల నున్న నేమి ? వెన్నెల తనమీఁదఁ బడుచునే యుండెను. కిరణములు తనను దాఁకుచునే యుండెను. వానిని బట్టి లాగినఁ జాలు.

మలయమాలికి తన మేడమీఁద గాలి లేదు. ఉన్నను అది గాలి కాదు. దానఁ జైతన్యము లేదు. ఇందుకీర్తిగాలి యతనికిఁ గావలయును. అది యేడ దొరకును ? ఆమె ప్రాసాదమునకుఁ బోవలెను. బలే.

మలయమాలి యొకసారి యాకసము దెసఁ జూచెను. చంద్రునిపై కాఱుమబ్బు. దిగంతరాళ మంతయుఁ గాటుకకొండ. ఈ యవరోధము రాజావరోధమునకు మార్గ భిక్ష యిడునా ?

మలయమాలి రాజమార్గము పరికించెను. చూపు చొరలేదు. దిగ్గజము లన్నియుఁ గలిసి ఘూత్కరించినటులు సుడిగాలి వీవఁదొడఁగెను. మిన్ను విఱిగినటులు మేఘము లఱచెను. మహానటుని ప్రళయతాండవమునకుఁ జోటుచేయఁ బ్రమథులు జలిపించు కొరడాలవలె మెఱుఁగుఁ దీఁగలు దిగంతముల ముందు నాట్య మొనరించెను. కాలరాత్రి కాలఁ ద్రొక్కుట వలనఁ బడిన కంతలనుండి జలప్రవాహము దొణదొణ క్రిందఁ బడుచున్నదో యన మేఘములు కుంభవర్షము కురియఁదొడఁగెను. వాయుదేవుఁడు భూగోళమును నొక్కివైచునో యనునటులు తూర్పు పడమర గాడ్పులు ఒండొండఁ గొట్టుకొనెను. ఇట్టి భీకర సమయమున మలయమాలి పిల్లివలె మేడ దిగి రాజప్రాసాదముదెస నడువఁదొడఁగెను.

విజయమాలి యిపుడు తన కుమారుని వేయికనులతో కనిపట్టుచునే యుండెను. కావున మలయమాలిని ఇరువురు భటులు భూతములవలె వెంబడింపఁదొడఁగిరి.

మలయమాలిని గాలి వెనుకకుఁ బడఁద్రోయలేదు ; భటులను వెనుకముందులకుఁ గొట్టెను. ఉఱుము లతని మెఱపింపలేదు ; భటులను బావురు మనిపించెను. మెఱుపు లతని మిరుమిట్లు గొలుపలేదు; భటుల కన్నులఁ జిల్లు లొనరించెను. వర్ష మతనిని బ్రధర్షింపలేదు; భటుల మేనులమీఁద బాఁడ లొనరించెను. మలయమాలిమానసమున ఇందుకీర్తిప్రాసాద మొకటియే యుండెను. అతఁడపుడు దాని ప్రాకారము దటిసెను.

"అరేరే ! పిట్ట తప్పించుకోపోయింది." అని ఒక భటుఁ డితరుని చెవిలో నూఁదెను.

"లేదు లే, దదుగో ఆ పాకారంమీఁద."

"ఆఁఆఁ, చూడు చూడు, పిట్ట మాయ మౌతూంది."

భటు లిరువురును క్రింద మీఁదఁ బడుచు లేచుచు కొంతదూరము వెనుకకు వచ్చి యచట నిలువఁబడి యాచిచూచుచుండిరి గాని కన్ను పొడుచుకొనినను లక్ష్యము కానవచ్చుట లేదు. సాహసమునకు సంతసించి మబ్బులు మలయమాలిని జూడ దివియ యెత్తెనో యన నపుడు తళుక్కున మెఱుపులు మెఱసెను.

"ఒరే, మేడచివర చూడు."

"ఆఁ. ఆఁ. పిట్ట మేడమీఁద వాలింది."

"సరేకాని ఈ పిల్లోడికి పిచ్చెత్తలేదు కంద ?"

"మదపిచ్చి."

"ఔరా. మన మిపు డేం చేదాం ?"

"పోయి ముసలోడికి చెబుదాం."

మలయమాలి ఆమేడమీఁది మూఁడవ అంతస్తుచుట్టును ప్రదక్షిణము చేసెను. ఒక తలుపుగాని, ఒక గవాక్షముగాని లోపల

నున్న వారిని మోసగించలేదు. అతఁడు వ్యర్థమైనను పలుమాఱులు తెఱవఁ బ్రయత్నించెను. సింహద్వారమునకును, గవాక్షములకును చెవు లంటించి చూచెను. అతఁడు తన హృదయస్పందము నే వినఁగలిగెను. అతఁ డొక నిమేష మాలోచించెను. చరాలున నొక మెఱుపు మెఱసెను. కడపలకు రంగువైవ గుట్టపోసిన జేగురుకణిక లతని కంటఁ బడెను. అతఁ డొక కణిక దీసికొని, ద్వారోపాంతమున గారచే పాలుగాఱు గోడమీఁద—

మిన్నులం జూడఁబోవు నీ మేడ యెక్కి
రతిపతిని దేశమున ననురక్తుఁ డొకఁడు
దానిచుట్టు నతండు ప్రదక్షిణంబు
చేసికొనుచుండ రవి కేల యీను చెలియ ?

అని వ్రాయు సాహసమునకుఁ బూనుకొనెను.

ఇంటికడ విజయమాలి భటులు తెచ్చిన వార్త విని అనుక్షణమును పిడుగులకుఁ దలయొగ్గి వాకిటఁ దిరుగాడుచుండఁగా మెల మెల్లఁగా మబ్బులు మాయఁజొచ్చెను. అతఁడు తుపానునఁ బడి కొట్టుకొనిపోవుటకు సిద్ధపడియుండఁగా వాయువర్షములు చెట్టాపట్టాలు పట్టుకొని వెళ్ళిపోయెను. ఆ రాత్రి యంతయు నేమియు జరుగనటులు తూరుపురేకలు కానిపించెను. పొనపొన మలయమాలి కనఁబడుడు సంతసించి విజయమాలి వడివడిగా లోని కేగెను. మలయమాలి వలపుసురమ్మాయి 'రాచుకొనిన కను లెఱ్ఱవాఱ వచ్చి వచ్చి తనమేడ యెక్కెను.

రాజప్రాసాదమున పిల్లనఁగ్రోవిపాట నగారామ్రోఁతతోఁ గలిసి పత్తనమునంతయు మేలుకొలిపి మరల నిద్రాభిముఖ మొనరించుచుండెను. ఘోషములందలి ఆవులయు, లేగలయు ప్రశ్నప్రతివచనములు విశ్వప్రేమను వెల్లడించెను.

ఇందుకీర్తి మేడలోనుండి మైత్రేయుని పాటలు వినవచ్చెను. మేడముంగలి పిట్టగోడలపై దివియలు వెలిఁగెను. పలపలని చీఁకటి విఱియుటతో పాటు తలతల మను వెలుఁగు తెర దిగంతరముల ప్రేలాడెను.

మాయాదేవి కుమారుని ఓలలాడించు పాట ప్రారంభమాయెను. ఇందుకీర్తి స్నానానులిప్తయై బుద్ధునకు జోలపాడి మేడ యెక్కి సింహద్వారమునుం దాఁగిపోయెను. “ ఏమి ట్రీవ్రాఁత ? ”

ఆమె దాపునకుఁ జని చదివికొనెను. “ ఎవరు ? ఎంత సాహసము ! మలయమాలి! మలయమాలి! ”

“ ఈ ప్రాకార మెటులు దాఁటెను ? ఈ చుక్కలమేడ యెటు లెక్కెను ? ‘ రతిపతిని దేశమున ’నా ? ఔనౌను. ప్రేమయను నిచ్చెన పురుషోత్తముని మహోన్నతమగు మేడనే యెక్కింపఁగలుగునపుడు క్షుద్రమగు నీమేడ నెక్కింపఁగలుగు టొక లెక్కా? విశ్వప్రేమచే బుద్ధభగవానుఁడు కత్తులబోను నుండి కదలిపోలేదా ? సెబాసు మలయమాలీ ! నీవు ప్రేమ నెఱిఁగికొంటివి. నేనే యీవల నుంటిని” అని యిందుకీర్తి ఆ పద్యమును తుడిచివయిచెను.

పిదప ఇందుకీర్తి బుద్ధునిముంగలికిఁ జని మోఁకరిల్లెను. ఆమె లేచి కూర్చుండి ధ్యానసముద్రమున మునిఁగెను.

అటుపిమ్మట ఇందుకీర్తి ఒక దాసిచే మంథరకునిఁ బిలిపించి, ప్రసంగవశమున మలయమాలికిని, అతనికిని గల మైత్రి

నెఱిఁగి "మహాశయా, సమయము వచ్చినపుడు నీమిత్రునకు నాప్రతికృతి యొకటి బహూకరింప మఱవకుము" అని యాదేశించెను.

అరణ్యమునఁ బడి మంథరకుఁడు "తమ సెలవు" అని నీళ్లు నమిలి సెలవుతీసికొనెను.

౬

మలయమాలి కిందుకీర్తిమీఁది రక్తిచే జగతిమీఁద విరక్తి కలిగెను. అతని మానసమున ఇందుకీర్తి బలసినకొలఁది ఆతని శరీరము చిక్కఁదొడఁగెను. అతఁ డిందుకీర్తిని లోపలఁ బెనుచుటచేఁ గాఁబోలు నతని శరీరమిందుపాండర మాయెను. అతని శరీరము శుష్కించినకొలఁదియు నతని కాంతి దుర్నిరీక్ష మాయెను. అతఁడు స్నానానులేపనముల మఱచెను. అతని కన్నపానములమీఁద అరుచి కలిగెను. అతఁ డంగడిని విడనాడెను. పరిజనము సేవగించెను. మంచ మెక్కెను.

కొడుకునఁ బాడమిన యీయొడుదొడుకునకు తలిదండ్రులు తాఱుమా రయిరి.

"ధన్వంతరి నయినను సరే తీసికొనివచ్చి అడిగిన సొమ్మొసఁగి కొడుకుగుర కౌషధ మిప్పింపుఁ" డని తల్లి యనెను.

"ఈవ్యాధి మన్మథునకు లొంగునది కాని ధన్వంతరికి లొంగ"దనియు, "తగిన సంబంధము త్వరలో విచారింపు"మనియు తండ్రి యనెను.

తల్లి తెల్లఁబోయి చూచెను.

తండ్రి నిట్టూర్చెను.

తమతోఁ దులతూఁగఁగల చక్కని సంబంధ మొకటి తల్లి యేఱుకొనివచ్చెను. కొడు కావియ్యపు నెయ్యమును వయ్యమొనరించెను. తల్లి అందగత్తెల వెదకఁ బంపెను. కొడుకు లోలోపల కుమిలిపోఁజొచ్చెను.

విజయమాలి కోటికి పడగయెత్తినను కొల్లాయగుడ్డతోనే కాలము గడపెను. అతనికి మహారాజాధిరాజు అధమర్ణుఁ డైనను అతని ఇల్లు రాజప్రాసాదముకడ వినయము నేర్చికొనియేయుండెను.

మలయమాలిమానస మాకాశమున విహరింపఁదొడఁగినదాది అతఁడు కూడ నాకాశ మెక్కవలసివచ్చెను. కావున నతని మేడ రాజకుమారిమేడతోపాటు త్రిభూమముగా మాఱెను.

"పై కెగురకుము, పై కెగురకు" మని తండ్రి యాదేశింపఁగా "రెక్క లుంటకు ఫలమేమి?"అని కుమారుఁడు బదులాడెను.

మలయమాలి చంద్రుని జూడఁగా అతని మేడ చుక్కలఁ జూచెను.

మలయమాలి మంచమెక్కిన దిపు డా చుక్కలమేడలో. విజయమాలి రోఁజుకొనుచు మేడమెట్లెక్కెను. "ముదిమిలో మేడ యెక్కుటాక శిక్ష"అని అనుకొనుచు అతఁడు మూఁడవ అంతస్తును జేరెను.

తలుపు బిడాయించియుండెను. 'అయ్యా' యని పిలిచెను. 'అయ్యాలేదు, కొయ్యాలేదు.'

విజయమాలి కుమారుని నిరుత్తరతచే శిక్షను పూర్తిచేసికొని, బీగము మంద్రగబ్బవలె మొలనుండి వ్రేలాడ నంగడికి బయలుదేరెను. అతని కొంటెబాఁపఁ డెదురాయెను. అతఁడు వెనుకకు వచ్చి ఆచమించి కఱ్ఱ పొడుచుకొనుచు వీథిలోని కేగి అంగడి తెఱచెను. అంగడి తెఱవఁగనే భేరగాండ్రీఁగలవలె మూఁగిరి. వారు మలయమాలి నపే

క్షించుకొనియుండఁగా వారికి లోపలఁ గనఁబడినవాఁడు విజయమాలి, పెద్దపులి.

“రండు, దయచేయుఁ డిదిగో తివాచి” యని విజయమాలి మరియాద చేయుచుండఁగనే బేరగాండ్రు పిట్టలవలె పాఱిపోయిరి.

పిదప విజయమాలి అంగడిలోని పెట్టెలన్నియుఁ దెఱచిచూచెను. అతని ధైర్యముతోపా టవి వట్టుపోయెను. తరువాత తాటాకులకవిలె తెఱచెను. ఒక పద్దేనియు దాన లేకుండెను.

మలయమాలి పద్దు వ్రాయమాలి తా నిచ్చిన సంచకరము లన్నియు మఱచెను. దాన నష్టము కలుగు సరకెల్లయుఁ బుచ్చికొనక తప్పకపోయెను. లాభము వచ్చు సరకు రాకపోయెను. ఇటులు దండుగబేర మంతయు నతనిపాలాయెను.

విజయమాలి నోరు మూసికొనుటతోపా టంగడి మూసివేయఁ దలఁచికొనియు తేనికి వెఱచి సిద్ధు నంగడిమీఁదఁ గూరుచుండఁ బెట్టి తన సుగంధభాండాగారాధ్యక్షత మాత్రము నిలుపుకొనెను.

అటుపిమ్మట విజయమాలి సరాసరి వెలయాండ్ర వాడలోనికిఁ జనెను. బాల్యసఖి మధురవాణి యెదురువచ్చి “మాకు నేఁడు తిరునాళ్లు”అని అతనిని లోనికిఁ గొంపోయెను.

“ఆఁ. మా పని తిరునాళ్లుగానేయున్నది. కంచిగరుడసేవ మా మొగములనే వ్రేలుచున్నది.”

“ఇప్పుడు మీ కేమి హాని వచ్చింది?”

“ఆఁ. అటు లడుగుము. ధనహాని, మానహాని, ప్రాణహాని—ఈ మూఁడును ఒకేసారి వచ్చి కూర్చున్నవి.”

“అలా గయితే మాయింట్లో మకాం పెట్టండి. మా వీథి కొచ్చి నలభైయేండ్లు దాఁటింది.”

“మన వాడలో ఇప్పుడు అందములో నందఱ తలదన్నినదియు, చదువుకొన్నదియు నగు ప్రౌఢ యొకతె యున్నదా?”

“ఈ ముసలి దిపుడు పనికి రాదు కాఁబోలు?”

“నీ నా మాట లగునెడల నేను మాత్రము ముదుసలిని కానా?”

“ముప్ఫైయేండ్లకే ఆఁడది ముసలి. మగవాఁడికి ముసలితన మేమిటి? నిన్న కాక మొన్న అబ్బిసెట్టి డెబ్భైయోయేట కన్నెరికం పెట్టలేదా?”

“ఆ కన్నెరికము పెట్టిన దబ్బిసెట్టి కాదు. ఒకటి—అబ్బిసెట్టి డబ్బు; రెండు—అబ్బిసెట్టి జబ్బు.”

ఈ చివరమాట విని మధురవాణి విజయమాలిదవడమీఁద చిటకరించి కోటీశ్వరుడికూఁడా ఇన్నాళ్లకట్టి జబ్బు ప్రవేశించిందా?” అనెను. విజయమాలి మఱి యీ ఊఁకదంపులకు సైఁపలేక మధురవాణి చెవిలో తన కుమారుని సంగతి యంతయు సంగ్రహముగాఁ దెలిపెను. మధురవాణి మొగము సుద్దయాయెను. విజయమాలి తల వాల్చి కూర్చుండెను.

కొంతసేపటికి మధురవాణి “బేజారుపడకండి. మా వాడలో ఇప్పుడు మనీష అని ఒకత్తె వుంది. దాన్ని చూస్తే భీష్ముఁడయినా పెళ్లాడాలి” అనెను.

“మా భీష్ముఁడు?”

"మీా భీష్ముఁడు రాజకుమారిని కాల దంతాఁడు."

"బిగ్గఱగా అనకు, బిగ్గఱగా అనకు. గోడలకు చెవు లుండును. సరికాని, దాని నీరాత్రి పంపఁగలవా?"

"ఇప్పుడే పంపఁగలనుగాని దానికి తగిన డబ్బు —"

"డబ్బు కేమి? నీ వెంత వెలపెట్టిన నంత వెల యిచ్చెదను."

"సెట్టి యిప్పు డల్లాగే అంటాఁడు. చివరకు ఉప్పుగల్లు పెట్టి పంపిస్తాఁడు."

"అది లేనిదే రుచియే రాదు కదా?"

"ఓహో! చింత విరిగినా చేవ విరగ లేదు. సరేకాని, నీవు కుబేరుఁడవు; అది రంభ. ఇహ నలకూబరుడి అదృష్టం చూచుకోండి."

విజయమాలి తమలము పుచ్చుకొని గృహాభిముఖుఁ డాయెను.

౭

దైవముపేరు చెప్పి తల్లి ఆరేయి తొలి జామున మలయమాలిని మహానసములోనికిఁ దీసికొనివచ్చెను. ఆ సందులో మనీష మేడ యెక్కెను.

"అన్నరసముకన్న ఆదరణరసము మే" లని అతనితల్లి యెఱుఁగును. కావున నామె కొడుకుమనసున కుల్లాసము కలుగు వ్యాపారములయెడల జాగ్రతి వహించెను. ఆయెడ విజయమాలి ఆ పరిసరములనే పరిహరించెను.

మలయమాలి ఆకు నాకి పాలు మూచూచి పండ్లు చేఁబూని తల్లికడ సెలవు గైకొనెను. తల్లి అందులకే సంతసించెను.

విజయమాలియానచే మలయమాలి మేడ యంతయు సుపరిష్కృతమై స్నాతధౌతుఁడైన సత్పురుషునివలె నుండెను. అతని గది దేవతలకుఁగూడ కాలిడ జంకు కలిగించెను. అతని పాన్పు వెన్నెల నేకి నేయఁబడినటు లొప్పెను. ఒకమూల పాలరాతి ప్రమిదెలో రత్నదీపము వెలుఁగుచుండెను.

మలయమాలి ఒకొక తలుపే మూసికొనుచు పైభాగమునకుఁ జేరి యిందుకీర్తి మేడకు సూటిగా నిలిచి చూచెను. భావన యను ఐంద్రజాలికుఁడు అతని యెదుట ఇందుకీర్తిని నిలిపెను. అతఁ డామెకు స్వాగత మొసఁగెను.

ఇందుకీర్తిమేడలో దివ్వె వెలిఁగెను. మలయమాలినయనభ్రమరము దాని చుట్టును చాంద్రాయణ మొనరించెను.

వెలుఁ గాఱెను. అతఁ డచటనే అటులనే నిలువఁబడిపోయెను. అతని మానసము తన్మయ మగుచుండఁది అతని శరీరము పులకలచే కంటకితమై క్రమక్రమముగా నిట్రాడువోలె నిట్టనిలుచుండెను. అపు డతని హృదయరంగమున ఇందుకీర్తియు, మలయమాలియు చూపుల కందని పరువులతో బ్రహ్మాండముచివర కేగి నిలువఁబడిరి. ఇందుకీర్తి అవ్యక్తములోనికి దుమికెను. మలయమాలికి కాలు జాఱెను. అతఁడు కుప్పున నేలఁ గూలెను.

ఈ నవ్యప్రపంచానుభవము మనీష కిదియే మొదలు. కాఁక మిగిలి నేలఁ గూలిన లాతూవిగ్రహమువలె నున్న మలయమాలి

ముంగలికి వచ్చి యామె నిలువఁబడెను. ఆమె జడప్రాయమయిన యాశరీరమునఁ బ్రేమసమాధిని గనులారఁ గాంచెను. భయభక్తులచేఁ, బ్రాసకంపములచే, ననురాగనిర్వేదములచే శబలితమైన మనీష కపుడు పరిచర్యయే చేయవలయునో, ప్రేమాంజలియే యెత్తవలయునో యేమియుఁ దోఁపలేదు. చూపులో లీనమై యామెయు, ఆమెలో లీనమై చూపును ఆవిగ్రహముముందు మఱియొక విగ్రహమై ఏకాంతమయిన యా మేడను దేవళ మొనరించెను.

రాచనగరిలో నడిరేయినగారా మ్రోఁగెను. పారావారి హెచ్చరికలు దిగంతములఁ బ్రతిధ్వనించెను. నిశాదేవి తలవెండ్రుకలాఱఁబెట్టుకొనినటులు, వేయులతో నేలఁ బాతుకొనిపోయినటులు చీఁకటులు దట్టమాయెను.

మలయమాలి కొంచెము కదలెను. మనీష గదిలోనికి వచ్చి చాటున నిలువఁబడి చూచుచుండెను. మలయమాలి కనులు దెఱచి 'ఇందుకీర్తి' యని పిలిచెను. మనీష కీర్త్యాప్రేమము లొక్కపెట్టునఁ బై కుబికెను. "ఎక్కడఁ జూచినను ఇందుకీర్తియే" యని యనుకొనుచు మలయమాలి పానుపుకడకు వచ్చెను.

"ఆహా! వలచినచో ఈ ప్రేమమయునే వలవవలయును" అని యనుకొనుచు మనీష తలుపుచాటునుండి రెండడుగులు ముందులకు వైచి నిలువఁబడెను.

మలయమాలి చూచి "ఓహో యిందూ! నీహృదయ మిసుమంత ప్రఫుల్లమయినచో రెక్కలు కట్టుకొని నేనే నీమేడమీఁద వ్రాలెడివాఁడనుగదా" అనుచు చేతులు చాఁపి రెండడుగులు ముందులకు వైచి ఆచి చూచి స్తబ్ధుఁడయిపోయెను. మనీష తొట్రుపడెను.

"ఓ యమ్మా! నీ విందుకీర్తి కక్కవా, లేక చెల్లెలవా? ఆమె నిన్నిటకుఁ బంపెనా? అగునెడల నీ విపు డిచటి కెటులు రాఁగలిగితివి?"

"వలచి వచ్చిన కసుమాల వెలయాలికిటకు వచ్చుటకు దారియే లేకపోయెనా?"

"నన్నా వలచితివి?"

మనీష తల వాల్చి యూరకుండెను.

మలయమాలి యొకసారి ఆమెను కలయఁ గాంచెను. ఆమెలావణ్య మతనిలోని యిందుకీర్తిని ప్రజ్వలింపఁజేసెను. అతని కిందకీర్తినుండియే స్త్రీత్వమును, లావణ్యమును ఉత్పన్నమాయెను. అతని కిపు డిందుకీర్తికిని, మిగిలిన స్త్రీలోకమునకును గల తేడాలు విశదముగా గోచరించెను. అతనిముం దెవతయు నిందుకీర్తి కాదు. ఒక సూర్యగోళమునుండి తేజఃకణములు వెలువడుచున్న చందముగా ఒక యిందుకీర్తినుండి సౌందర్యకణములు వెలువడుచున్నవి.

మలయమాలి యిటు లనెను: "ఓయమ్మా! నీ సౌందర్యమునకు నేను వైతాళికుఁడను. నీ విందుకీర్తికి కుడియెడమగా నుండుటచే విశేషించి గౌరవభాజనమవు. నీవు నాకుఁ జెల్లెల వగుచో నెంత బాగుండి యుండును? ఐనను మిగిలిపోయినది లేదు. నీకు ధనము కావలయునేని రేపే నీయిల్లు బంగార మగును. నీ విట నన్నొంటరిగా విడిచి వెళ్లుము."

"నాకు ధన మేల? వలపునకును, ముదుపునకును అత్తాకోడలివరస. నేను నిన్ను ప్రాణములతో వలచితిని. నేను నిన్నుఁ జూచికొనుచు నీముంగలఁ బడియుందును."

"వలదు వలదు. నన్నుఁ జూచుచుఁ గూర్చుండుట పున్నెమా, పురుషార్థమా? దైవముముందు గూర్చుందుము. అది పున్నెము, పురుషార్థము. ఈ బొమ్మకడ నేమి కలదు, మట్టియే!"

"పరుల కుపదేశించునెడల నీకన్న నే నేడాకు లెక్కువ చదివితిని. నేను నీపాదము లంటి చెప్పుచున్నాను - నిన్ను నే వలచితిని"

మలయమాలి ఒక వెర్రినవ్వు నవ్వి వడి వడిగా మెట్లు దిగి వెళ్లిపోయెను.

ప్రక్కగదిలో పొంచియున్న విజయమాలి మనీషకడకు వచ్చి "వెఱపింపఁబోయి వెఱచినచందము చేసితివే" అనెను.

అతనిమాట వినిపించుకొనక మనీష—"భూమిచివర నున్నను సరే మలయమాలిని నేను వలతును." అని మేడదిగి వెడలి పోయెను.

"అయ్యవారిని జేయఁబోవ కోఁతియైనటు లున్నదే! వహ్వా! ఒక పిచ్చికి తోడు రెండవ పిచ్చి."అని విజయమాలి ఏమియుఁ దోఁపక మేడ దిగివచ్చి వాకిట నిలువఁబడియుండఁగా కొంతసేపటికి భటులు వచ్చి "మలయమాలి తోఁటలో సుఖముగా ఉన్నాఁ" డని చెప్పి పోయిరి. విజయమాలి అంత నొక నిట్టూరుపు విడిచెను.

[సశేషము]



# రెండు గీతాలు

= శ్రీ 'సంపత్' =

### 1. అపశ్రుతి

ప్రతిముమూర్షు హృదయంలో
బాధావిష పరిసర్పిత
హతజీవిత నైరాశ్యం!

ప్రతియువక స్వప్నంలో
ఆశామృతపరిచుంబిత
నవజీవన వైవశ్యం!

ప్రతిముమూర్షు హృదయంలో
అధిగతశోషణ సంధ్యా
ప్రశమిత జీవతరంగం!

ప్రతియువక స్వప్నంలో
మధునాశబలితసంధ్యా
కుసుమిత జీవితరంగం!

### 2. మహోత్పాతము

అది
ఎపుడో, ఎవరో కవితకు
కావించిన పైశాచిక
భూమిక—

ఇది
ఇపుడే, ఎవరో పాడిన
గర్జించిన మేఘాంతర
చూళిక.

అది
ఎపుడో, ఎవరో పాడిన
నక్తంచర రక్తారుణ
గీతిక—

ఇది
ఇపుడే, ఎవరో చూచిన
నరబలికై శివమెత్తిన
కాళిక.



# ఆధునిక భౌతికశాస్త్రము-భారతదేశము

●

= శ్రీ ఎ. వి. యస్. రామారావు =

ప్రాచీనభారతదేశము నాగరికతకు నివాసమనియు, ప్రాచీనభారతీయులు చిత్రము, శిల్పము, నాట్యము మున్నగు కళలందేకాక వైద్య, విజ్ఞాన, గణిత, వృక్ష, జంతు, జ్యోతిషశాస్త్రములయందుకూడ పరిపూర్ణపాండిత్యమును సంపాదించి యున్నతస్థాన మాక్రమించిరనియు నేటి పాశ్చాత్య పండితులే యొప్పుకొనుచున్నారు. ఆనాటి మన విజ్ఞానము మన ఆచారవ్యవహారములలోను, నిత్యకృత్యములలోను ఇమిడియుండి, మన దైనికజీవనమును, వైజ్ఞానికపంథాను నడుపుచుండెడిది. దేవాలయశిఖరమున త్రిశూలములను నాటుట, వీణామృదంగవాద్యనిర్మాణమందు వారి శక్తి, సంగీతశాస్త్రమందలి వారి ఉన్నత భావములు, నీడను, నక్షత్రములను బట్టి కాలమును కట్టుటలో వారి నేర్పు—ఇవి గమనించినచో ప్రాచీన భారతీయులవిజ్ఞానశాస్త్రపారంగతత్వము విశదమగును.

"అట్టి మనకు ఈ ఆధునికశాస్త్రప్రపంచములో స్థానమెక్కడ?" అని భారతాభ్యుదయమును కోరు ప్రతిభారతీయుడును తలచకపోడు.

ప్రాచీనకాలమందు శాస్త్రప్రపంచములో మన స్థానమెంత యున్నతమైనను, నేడు ఆధునిక శాస్త్రసాధములో మన స్థానము క్రింది యంతస్తులోనని చెప్పకతప్పదు. ఈస్థానము మన మాక్రమించుటకు అనేక కారణము లున్నవి. అందు మొదటిది భారతీయులకు ఆధునికవైజ్ఞానికతృష్ణ కొంచెము ఆలస్యముగా గలుగుట. విజ్ఞానప్రపంచమందు ముందంజ వేయుచున్న పాశ్చాత్యదేశములవారియందు ఈవైజ్ఞానికతృష్ణ ౧౭-వ శతాబ్దమునందే జనించినది. అందుచేతనే వారు ౧౬౫౭-వ సం. లోనే Academy del leimento, ౧౬౬౦-వ సం లో రాయల్ సొసైటీ ఆఫ్ లండన్ (Royal Society of London), ౧౬౬౬-వ సం.లో రాయల్ అకాడెమీ ఆఫ్ సైన్సెస్ ఆఫ్ పారిస్ (Royal Academy of Sciences of Paris) మొదలగు విజ్ఞానపరిషత్తులను సృష్టించుకొని, ధీశాలులగు విజ్ఞానవేత్త లందఱను అక్కడ కలిసికొని, సంప్రదించి తమతమ పరిశోధనలు నెరవేర్చుచుండిరి. కాని మన భారతదేశములో నీతృష్ణ ౧౯-వ శతాబ్దపు చివరిరోజులలో గాని కలుగలేదు. భారతవిజ్ఞానమహాసభ (Indian Science Congress) ౧౯౧౪-వ సం. లో మాత్రమే సృష్టింపబడెను. ఇండియన్ అకాడెమీ ఆఫ్ సైన్సెస్, ఇండియన్ నేషనల్ అకాడెమీ ఆఫ్ సైన్సెస్ మున్నగు ఇతరసంస్థలు కొద్దిసంవత్సరముల క్రిందటనే విజృంభించినవి. కాని ఈవిజ్ఞానపరిషత్తులకు పాశ్చాత్యవిజ్ఞానపరిషత్తులవలె పుష్కలధనసాహాయ్యము లేకపోవుచున్నది. నేటి వైజ్ఞానిక పరిశోధనలన్నియు కేవలము ప్రయోగములమీదనే ఆధారపడియున్నవి. ఈప్రయోగములను కొనసాగించుటకు చాలధన మవసరము. అందుచే ప్రభుత్వపు పోషణ ముఖ్యము. అది మొదట లభించలేదు. లభించుటకు చాలకాలము పట్టినది. నేడది లభించుచున్నను మిక్కిలి యసంతృప్తికరముగా నున్నది. ఈలోటును ధనవంతులెవరైనను తీర్చవచ్చును. కాని వారు, అమెరికా దేశములోవలెగాక, ముందుకు వచ్చి ధనసహాయము చేయుటకు వెనుకాడుచున్నారు. మూడవ కారణము మన విశ్వవిద్యాలయములలో విద్య పాశ్చాత్య

విశ్వవిద్యాలయములలోవలెగాక, పరభాషయగు ఇంగ్లీషులో నేర్పబడుచుండుట. దీనివలన విద్యార్థికి అనవసరముగా కాలము వ్యయమగుటయేకాక, పరభాషయందు పరిపూర్ణత్వము లేక 'ఏదో చదివి' పరియగు అంశములను గ్రహింపజాలకపోవుటయేకాక, తన సహజధీశక్తిని కూడ పోగొట్టుకొనుచున్నాడు. మరియొక కారణము–భారతీయులకు విజ్ఞానములోకన్న కళలందు మక్కువ యెక్కువ. కాని రామన్ మహాశయుడు నుడివినట్లు అన్నిటికన్నను ముఖ్యమైనది భారతీయులు 'పాశ్చాత్యులకన్న మనము తక్కువ' యను నిశ్చితాభిప్రాయమును (Inferiority complex) కలిగియుండుట. ఈ దురభిప్రాయము పోతేనే తప్ప మనము విజ్ఞానపథములో ముందంజ వేయలేము. కాని ఈ దురభిప్రాయము పోవుటకు స్వతంత్రవాతావరణము ముఖ్యము. కాబట్టి ఏనాడు భారతదేశ ప్రదాస్యశృంఖలములు తెగి, ఏనాడు భారతదేశమున స్వతంత్రవాతావరణము యథేచ్ఛగా వీచునో, ఆనాటివరకును విజ్ఞాన ప్రపంచములో పాశ్చాత్యవిజ్ఞానవేత్తలను భారతీయ శాస్త్రపండితులు ఢీకొనజాలరు.

## ప్రఫుల్ల, జగదీశచంద్రులు

భారతదేశమున ఆధునికవిజ్ఞానములో మొదటి అధ్యాయము ప్రఫుల్ల,జగదీశచంద్రులు కేంబ్రిడ్జి, ఎడిన్‌బరో విశ్వవిద్యాలయములకు గతశతాబ్దపు ఆఖరుదినములలో వెళ్లుటతో ప్రారంభించిన దని చెప్పవచ్చును. ఈమహనీయులు ఆ విశ్వవిద్యాలయములయందు వైజ్ఞానికవిషయములను నేర్చుకొని వచ్చి తొలుదొలుత కలకత్తావిశ్వవిద్యాలయమునందు పరిశోధనాగారములను (Research Institutes) నిర్మించి, అనేకమంది యువకులను వైజ్ఞానికులుగా తయారుచేసిరి. తత్ఫలితముగా గత ముప్పది సంవత్సరములనుంచి ప్రతి భారత విశ్వవిద్యాలయమునందును ఆదర్శప్రాయమైన పరిశోధనాగారములు వెలువడుచుండుటయే కాక, ప్రపంచవిఖ్యాతిని బడసిన విజ్ఞానవేత్తలు బయలుదేరి మహత్తరమైనపరిశోధనలు భారతదేశమున నుద్భవించుచున్నవి.

ఆధునిక భౌతికశాస్త్రమహావృక్షమును భారతదేశములో నాటిన మనీషి ఆచార్య జగదీశచంద్రు డని పైన తెల్పితిని. కాని, ఈవృక్షము పెరిగి పెద్ద దవక ముందే సహజ వృక్షజాల సౌందర్యముచే నాకర్షింపబడి, జగదీశచంద్రుడు తన జీవితశేషమును వృక్షశాస్త్రములో గడపినాడు. జగదీశచంద్రునకు ప్రయోగనిర్వహణమందు గల నేర్పరితనము మరి యే శాస్త్రజ్ఞునకును గానరాదు. విద్యుత్తరంగములను గూర్చి జగదీశచంద్రుడు చేసిన పరిశోధనలు భారతీయులనేకాక, పాశ్చాత్య విజ్ఞానవేత్తలను సైతము ఆశ్చర్య నిమగ్నులను చేసినవి. పాశ్చాత్య వైజ్ఞానికులకు గల సౌకర్యములు, పరికరములు తన కేమియు లేకపోయినను, నిరుత్సాహపడక, జగదీశచంద్రుడు కొన్ని నెలలు కష్టపడి, అక్కడి వడ్రంగి సహాయముతో తనకు కావలసిన పరికరములను తయారుచేసికొన్నాడు. తన అత్యద్భుత మేధాసంపత్తిచే Electric Vibrator అను పరికరమును తయారుచేసి, దానివలన హ్రస్వతమ తరంగములను సృష్టించి, వాటి ధర్మములను తనచేతనే నిర్మితమగు Steel spring coherer అను మరియొక సాధనముచే పరీక్షించుటతో జగదీశచంద్రుని అత్యద్భుత పరిశోధనానైపుణ్యము మాత్రమే కాక కాలగర్భములో దాగియున్న భారతీయ ధీశక్తి కూడ ప్రపంచమునకు వెల్లడి అయ్యెను. 'వైర్లెసు ప్రపంచము'లో మునిగితేలుచున్న 'మార్కొనీ' శాస్త్రజ్ఞునికన్న ముందే ఈతడు కలకత్తాసభలో, సొంత పరికరాలతో, కొన్ని అడుగులదూరము తంతులు లేకుండ వార్తలు పంపగలిగెను. తత్ఫలితముగా లార్డు కెల్విన్ మున్నగు నాంగ్లేయ శాస్త్రజ్ఞులును, నిస్తంత్రీకరణము (Wireless) లోనే పరిశోధనలు సాగించుచున్న ఫ్రెంచి ఇటాలియన్ శాస్త్రవేత్తలును జగదీశచంద్రుని అభినందించుచు సందేశములను పంపిరి. పాశ్చాత్య విశ్వవిద్యాలయములవారు ఆయనకు గౌరవబిరుదము లిచ్చి, వాటిని స్వీకరించుటకు తమ దేశములకు ఆహ్వానించిరి. ఈ విధముగా జగదీశచంద్రుని యశస్సు దిగంతముల వ్యాపింప, ఆయన పశ్చిమ దిగ్విజయయాత్ర చేసి, శిథిల మైపోయిన భారతవిజ్ఞాన మందిరమును పైకి లేవనెత్తెను. ఇంతటిలో జగదీశ

చంద్రుడు భౌతికశాస్త్రమును విడిచి తన జీవితశేషమును వృక్షశాస్త్ర పరిశోధనలందు గడపెను. వృక్షశాస్త్రమున ఆయన పరిశోధనలు ఇంతకన్నను మిక్కిలి శ్లాఘాపాత్రము లైనవి.

### రామన్ మహాశయుడు

జగదీశ చంద్రుడు నాటిన భౌతికశాస్త్ర మహావృక్షమును పెంచి పెద్దదిగా చేయుచున్నవాడు వైజ్ఞానికశ్రేష్ఠుడు రామన్‌మహాశయుడు. రామన్ మహాశయుని తొలుదొలుత శ్రావ్యమైన ఫిడేలునాద మాకర్షించెను. ఫిడేలుతీగలపై కమానువేసి రాసినపుడు కలుగు శబ్దస్వభావమును పరీక్షించుచు, మొదట కమాను వేసి తీగపై రాసినపుడు కలుగు స్వరమునకును, వెనకకు లాగునపుడు కలుగు స్వరమునకును తేడా యుండు ననియు, ఇట్టి తేడా కలుగకుండ ఇంపగు స్వరము (Harmonious sound) కలుగుటకు మనము కమానును వెనుకకు లాగునపుడు కొంచెము మనిమి లాగవలయు ననియు, ఈ అనుకుట ఎల్లప్పుడును ఒకేవిధముగా నుండక మారుచుండు ననియు కనుగొనినాడు. తరువాత రామన్‌మహాశయుడు బెనర్జీ శాస్త్రజ్ఞునితో గలసి పియానో (Accoustics of the Piano forte)వాద్యవిశేషమునుగూర్చి చేసిన పరిశోధనలు తత్త్వమయమై యిదివరలో హెల్మ్సహోల్ట్జ్ (Helmsholtz) పండితుడు ప్రకటించిన ఫలితములను సవరించుటయే కాక, అవన్నప్రాయములై, శబ్దశాస్త్రమందలి పరిశోధనలకు నూతన పంథా నొకదానిని చూపించినవి. అటుపైన ఈయన భారతీయ వాద్యవిశేషములగు వీణ, తంబుర, మృదంగములందు కలుగు శబ్దమును పరిశీలించి, పాశ్చాత్య తీగవాద్యములు ఆమోదించు హెల్మ్సహోల్ట్జ్ సిద్ధాంతమును భారతీయ తీగవాద్యములు అనుసరింపవని తెల్పెను. దీనికి కారణము తంబురయందలి పీటయు, వీణయందలి మెట్ల పైభాగమును పాశ్చాత్యవాద్యములయందలి మెట్లవలె కోసుగా నుండక, బల్లపరుపుగా, వంకరగా నుండుటయే యని ఆయన తెలిపెను. మరియు, మృదంగము ఇచ్చు సుఖమునకు దానియందమర్చిన వేరువేరు త్రాళ్ల బిగింపు ప్రభావ మని ఆయన వాకుచ్చెను. ఇంతేకాకుండా సెంటు పాల్సుచర్చి, విక్టోరియా మ్యూజియము మొదలగు ఎత్తయిన భవనములందు కలుగు ప్రతిధ్వనులను ఆయన పరీక్షించి కారణములు తెల్పెను.

కాని రామన్ మహాశయుని కీర్తి నలుదిక్కుల వ్యాపించుటకు కారణము ఆయన తేజస్సులో కాంతి పరిక్షేపణ (Scattering of light) ను గురించి చేసిన పరిశోధనల ప్రభావమే.

కాంతిపరిక్షేపణమునుగురించి మొదట తెలిసికొనినవాడు రాలేపండితుడు. తేజఃకిరణము ప్రకాశ పారదర్శకయానము (Transparent Medium) గుండా పోవునపుడు, ఆమార్గమున అతిసూక్ష్మమైన నలుసులున్న, ఆనలుసులచే నీ తేజఃకిరణము పరిక్షేపింపబడి, ముఖ్యకిరణమార్గముననే కాక, దాని ప్రక్క ఉపకిరణముల మార్గములయందుకూడ ప్రవహించును. ఈసూక్ష్మమైన నలుసులు తరంగ దైర్ఘ్యప్రమాణమునే కలిగి యున్నతరి, పరిక్షేపణ చెందిన కిరణముల స్పష్టత తేజఃకిరణతరంగ దైర్ఘ్యముపై నాధారపడి, తరంగ దైర్ఘ్యము హ్రస్వమైనకొలది కిరణముయొక్క స్పష్టత హెచ్చగుచున్నది. అందుచేతనే గాలిలోని కంటికగపడని దుమ్మునలుసులచేగాని, గాలిలో నున్న వాయువులందలి అణువులచేగాని సూర్యతేజస్సు పరిక్షేపింపబడినపుడు హ్రస్వతమ తరంగదీర్ఘతగల నీలికిరణములే ఎక్కువ పరిక్షేపింపబడి, నీలిరంగే స్పష్టముగా నగపడుటచే, ఆకాశము నీలిరంగుగా నున్నదని రాలేపండితుడు తెల్పెను.

ఈ 'కాంతి పరిక్షేపణము' భౌతిక శాస్త్రజ్ఞులను నూతన పరిశోధనమార్గముల వెంబడి తోడ్కొని పోయెను. అందొక పంథాను బోయి, సమగ్రమైన పరిశోధనలు చేసినవారు రామన్ మహాశయుడును, ఆయనశిష్యులును. వీరు వివిధ పారదర్శక* పదార్థములగుండా ఏకవర్ణకిరణపుంజమును బంపి, పరిక్షేపణచెందిన తేజస్సునకును, పరిక్షేపణము చెందించు వివిధ పదార్థముల పరమాణువులకును గల సంబంధమును నిర్ధరించుటకు అనేకములగు ప్రయోగములను చేసి, సిద్ధాంతీకరించుటయే కాక, చైతన్యస్థితిలోనున్న ద్రవపదార్థములందలి అణువులు సైతము తేజస్సును ఏవిధముగా

పరిక్షేపించునో కనుగొనిరి. ఈ పరిశోధనలు సాగించుచు, అంతకుముందు రాలేపండితుడు సముద్రముయొక్క నీలము ఆకాశపునీలము ప్రతిఫలించుటచే కలిగినదని, మరికొందరితరశాస్త్రజ్ఞులు సముద్ర జలములోనున్న నలకలు కాంతిని పరిక్షేపించుటచే సముద్రమునకు 'నీలము' కలుగుచున్నదని తెలిపినదానిని త్రోసిపుచ్చి, శుద్ధసముద్రజలముయొక్క అణువులు నీటజొచ్చు తేజస్సును పరిక్షేపించుటచేతనే సముద్రమునకు నీలవర్ణము కలుగుచున్నదని రామన్‌మహాశయుడు వాక్రుచ్చెను. అంతేకాక ఒక సూక్ష్మప్రయోగముచే ఆయన తన పరిశోధనాలయమున శుద్ధజలముగుండా తేజఃకిరణపుంజమును బంపి, సముద్రముయొక్క నీలమును అందు చూపించెను.

## 'రామన్ పరిక్షేపణము'

## (Raman Scattering)

తటాకమందలి నీటియుపరితలము ఒకే మట్టముగానుండి, తటాకమంతయు ఒకేలోతు కలిగియున్నదనిపించును. కాని నీటిలో దిగినచో దాని నిజమగు లోతు తెలిసి, అందలి మెరకపల్లములు తెలియును. అట్లే ఏవిషయమైనను పైకి పరిపూర్ణముగా నగపడినను, పరిశీలనశక్తితో చూచినగాని అందలి లోటుపాట్లు కనుపించవు. శాస్త్రజ్ఞుని విమర్శనదృష్టితో పరిశీలించినచో దానికి కారణములుకూడ గోచరించును. రామన్‌మహాశయుడు కాంతిపరిక్షేపణయందు తీవ్రపరిశోధనలు సాగించుచు ప్రతిప్రయోగమును శాస్త్రజ్ఞుని విమర్శనదృష్టితో పరీక్షించుచుండ, కొన్ని స్వచ్ఛమైన ద్రవపదార్థములగుండా ప్రవహించి, పరిక్షేపణ చెందిన కాంతియందు ఒక లోపము కనుపించెను. వెంటనే రామన్ మహాశయుడు దానినిగుర్తించి తీవ్రముగా తన యప్రతిమానమైన ధీశక్తితో నాలోచించి, ఈలోపమునకును, ఆవేశమును కలుగజేయు కిరణతరంగ దైర్ఘ్యమునకును నేదో యాశ్చర్యకరమైన సంబంధ ముండితీరవలె ననియు, తరంగదైర్ఘ్యము మారియుండవలె ననియు నూహించెను. వెంటనే ఆయన ఏకవర్ణ కిరణమును ప్రకాశపారదర్శక పదార్థముగుండా పంపి, పరిక్షేపణ చెందిన కాంతియొక్క తరంగదీర్ఘతను ఆదికిరణ తరంగదీర్ఘతతో వర్ణపట్టికామాపకము(Spectrometer)తో పోల్చి, ఆదికిరణ తరంగదీర్ఘతకన్న పరిక్షేపణ చెందిన తరంగదీర్ఘత హెచ్చినదని కనుగొనెను. మరియు ఈ పరిక్షేపణచెందిన తరంగదీర్ఘత ఆదికిరణ తరంగదీర్ఘతకన్న ఎల్లప్పుడును హెచ్చుటయే కాక, కొన్నివేళల తగ్గుటకూడ కలదనియు, ఈ హెచ్చుతగ్గులు అన్నిపదార్థములందును స్థిరముగా నుండక వస్తువుయొక్క అణువులపై నాధారపడియుండు ననియు పరిశోధించి ౧౯౨౮వ సంవత్సరమున కనుగొనెను. దీనినే రామన్‌సిద్ధాంతము(Raman effect) అందురు.

ఈ సిద్ధాంతము పదార్థములయొక్క అణువులపై నాధారపడియుండుటచే దీని సహాయమున కంటికగోచరమైన పదార్థమందలి అణువుల వృత్తాంతమును కనుగొనగలము. ఈపరిశోధనలను నలుముఖముల కొనసాగించి, రామన్ సిద్ధాంతముయొక్క సత్యమును వివిధపదార్థములందును పరిశీలించినవారిలో ముఖ్యులు ఆనాడు రామన్‌మహాశయుని శిష్యులై నేడు ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు ఆచార్యపదవుల నధిష్ఠించియున్న రామకృష్ణభగవంతులును, కలకత్తా విశ్వవిద్యాలయపు ఆచార్యుడు కృష్ణన్ మున్నగువారును. ఆచార్యులు భగవంతం, రామకృష్ణరావులు రామన్ సిద్ధాంతముయొక్క సత్యమును స్ఫటికములందేకాక ద్రవవాయుపదార్థములందుసైతము పరిశీలించుటకు తమ ధీశక్తిచే వివిధపరికరములను సృష్టించి, రామన్ సిద్ధాంతమునందలి సత్యమును విస్తరింపజేసిరి. ఈసిద్ధాంతము నుపయోగించి, పరిశోధనలు భారతదేశమందేకాక పాశ్చాత్యదేశములందుసైతము విరివిగా సాగుచున్నవి. ఈ సిద్ధాంతమునుగూర్చి సమగ్రమగు పుస్తకము లేని లోటు నిన్నమొన్నటివరకు నుండెడిది. ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిచే ప్రేరేపితుడై ఆచార్యుడు భగవంతము 'కాంతిపరిక్షేపణ' అను నొక ప్రమాణ ఉద్గ్రంథమును రచించి, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారిచే గౌరవింపబడుటయేకాక, పాశ్చాత్యశాస్త్రజ్ఞులయొక్కయు, పాశ్చాత్య విజ్ఞానసంచికలయొక్కయు మన్ననలకును, నుతులకునుకూడ పాత్రుడయ్యెను.

ఈ సిద్ధాంతముతోను, ఈ పరిశోధనలతోను రామన్ మహాశయుని ధీశక్తి ప్రపంచమునకు వెల్లడియయ్యెను. ఈ సిద్ధాంతముతో రామన్‌మహాశయుని నామము ఆచంద్రతారార్కముగా శాస్త్రప్రపంచములో నిలిచిపోగలదు. ఈ సిద్ధాంతముయొక్క గొప్పతనమును గుర్తించి, ఖండఖండాంతరములవారు గౌరవసువృష్టిని కురిపించిరి. భారతప్రభుత్వమువారు 'సర్' బిరుదము నిచ్చి గౌరవించిరి. పారిస్ విశ్వవిద్యాలయమువారు 'ప్రేమియో మేటుసీ మెడలు' నొసగి బహూకరించిరి. జర్మనీలోని ఫ్రీబర్గు విశ్వకళాపరిషత్తువారు 'డాక్టర్ ఆఫ్ నేచురల్ ఫిలాసఫీ' పట్టము నిచ్చి సన్మానించిరి. ౧౯౨౪ లోనే తమ సంఘపు సభ్యునిగా చేర్చుకొని గౌరవించిన లండన్ రాయల్ సొసైటీవారు 'హ్యూస్ పతకము' నిచ్చి ఆదరించిరి. అమెరికావారు ఈమధ్యనే 'ఫ్రాంక్లిన్ మెడలు' నిచ్చి సత్కరించిరి. భారత విశ్వవిద్యాలయములవారేకాక పాశ్చాత్య విశ్వవిద్యాలయములవారుకూడ తమ విశ్వకళాపరిషత్తులకు ఆహ్వానించి, ఆ దేశములందు సంచారమొనర్చినపుడు గౌరవపట్టముల నిచ్చి, మిక్కిలి గౌరవించిరి. తరువాత ౧౯౩౦-వ సంవత్సరములో ప్రపంచమందలి శాస్త్రజ్ఞులందరును కలిసి, రామన్‌సిద్ధాంతము ఉన్నతోన్నతమైన పరిశోధన యని నిర్ధారణచేసి, శాస్త్రప్రపంచములో నత్యున్నతగౌరవమగు 'నోబెల్ బహుమానము'ను బహూకరించి, రామన్‌మహాశయునే కాక భారతదేశమునుకూడ గౌరవించిరి. అట్టితరి రామన్ సిద్ధాంతముయొక్క ఉత్కృష్టతయెంతయో గమనింపుడు! ఇట్టి మహత్తరసిద్ధాంతమును రామన్‌మహాశయుడు భారతదేశపు సరిహద్దులను దాటి వెళ్లకుండగనే పరిశోధించగలిగెనన్న, పాశ్చాత్యదేశములకు వెళ్లకుండగనే భారత విశ్వవిద్యాలయములయందే పరిశోధన సాగించి, శాస్త్రప్రపంచమున ఎట్టి విప్లవములు కలిగించవచ్చునో యూహింపుడు!

## స్ఫటికపరమాణుసంచలనము

## (Crystal Dynamics)

ప్రస్తుతము రామన్‌మహాశయుడు స్ఫటికపరమాణుసంచలనమును గూర్చి పరిశోధనలు సాగించుచున్నాడు. కాంతిపరిక్షేపణలో అతని పరిశోధనలు ఎంత ఉత్కృష్టమైనవో ఈ పరిశోధనలుకూడ అంతే ఉత్కృష్టమైనవే!

స్ఫటికములు పరమాణువులచే కూర్చబడినవనియు, అవి క్షేత్రాకారములుగా (Geometrical shape) నుండు ననియు అందరకును తెలిసిన విషయమే. అట్టి స్ఫటికములందలి పరమాణువులు సైతము క్రమమైన క్షేత్రగణితస్థానములం దుండవలె నని భౌతిక శాస్త్రజ్ఞు లూహించి, పరిశోధనలు సాగించి, X కిరణములవల్ల అవి క్షేత్రగణిత స్థానములలోనే స్థిరముగా నున్నవని కనుగొనిరి. కాని నిజముగా నాలోచించినచో ఈ పరమాణువులు తమ స్థానములందు కేవలము స్తబ్ధముగా నుండక, సర్వకాలసర్వావస్థలయందును ఊగులాడుచు (Vibrate) చైతన్యస్థితిలో నున్నవని శాస్త్రజ్ఞులు పరిశోధించి తెలిసికొన్నారు. వెంటనే ఈ పరమాణువులు ఏవిధముగా నూగులాడుచున్న వని తీవ్రవిమర్శన బయలుదేరినది. సుప్రసిద్ధ విజ్ఞానవేత్తలగు డెబై, బార్న్లు స్ఫటికములో పరమాణుస్థానములను లెక్కగొనక, స్ఫటికములోని పరమాణువుల కదలికవల్ల ఎలాస్టిక్ కిరణముల వంటి కిరణములు ఏర్పడుచున్నవని తెలిపిరి. కాని వారి సిద్ధాంతములకును, ప్రయోగఫలితములకును చాల వ్యత్యాస మగుపడుచున్నది. ఈవిషయమై రామన్ మహాశయుడు తీవ్రముగ నాలోచించి, X కిరణములవల్ల బెంగుళూరుశాస్త్రపరిశోధనాలయమున మహత్తరపరిశోధనలు చేసి, డెబై, బార్న్ల సిద్ధాంతములు సత్యేతరము లని రుజువుచేసెను. మరియు ఒక సైన్యము కదలవలసివచ్చిన, ఆ సైన్యములోని సైనికులు ఎవరి యిష్టము వచ్చినట్లు వారు విచ్చలవిడిగా సంచరించక, ఒకరి నొకరు అనుసరించుచు, స్థిరముగా నున్నపుడు ప్రక్క నున్నవానికిని, మరియొకనికిని ఎంత దూరమున్నదో ఆదూరమునే స్థిరముగా నుంచుకొనుచు, ఏవిధముగా, జాగ్రత్తగా, ఏకీభావముతో సంచరించెదరో ఆవిధముగనే స్ఫటికములోని పరమాణువులు సైతము ఒకదాని నొకటి అనుసరించి ఏకీభావముతో సంచరించుచున్న వనియు, చైతన్యస్థితిలో నున్నపుడు

వాటి సంబంధము స్థిరముగా నుండియున్న ఏవిధముగా నుండునో ఆవిధముగనే యున్నదనియు రామన్ మహాశయుడు నుడువుచున్నాడు. ఈ స్ఫటికములందలి అణుసంచలనమునుగూర్చి ఆంధ్రవిశ్వకళాపరిషత్తుపరిశోధనాగారములయందు ప్రొఫెసరు భగవంతము తన సహాధ్యాయులతో కలసి తీవ్రతర పరిశోధనలు చేయుచున్నాడు. వీ రిందువిషయమై గణితశాస్త్రమువలన కనుగొనిన సిద్ధాంతములు X కిరణములు, వర్ణపట్టికామాపకము,ఘనములతారతమ్యోష్ణత ప్రయోగఫలితములు కనుగుణముగా నుండుటచే రామన్ మహాశయుని సిద్ధాంతములే సత్యమునకు సన్నిహితము లని తోచుచున్నది. ఈవిషయమై నేడు "లండన్, చికాగో, బెంగుళూరులమధ్య తీవ్రతర వాగ్యుద్ధము జరుగుచున్న" దని రామన్ మహాశయుడే నుడివినాడు. * అనతికాలములో సుప్రసిద్ధశాస్త్రజ్ఞులే ఫలితములను నిర్ణయించగలరు.

## మేఘనాథ్ సహా

తరువాత అలహాబాదు విశ్వవిద్యాలయములో ఆచార్యపదవి నధిష్ఠించియున్న మేఘనాథ్ సహా యొక్క పరిశోధనలు తెలిసికొనవలసియున్నది. ఈ మహనీయుడు మహత్తరమైన 'Saha Ionisation Theory'-అను నొక సిద్ధాంతమును కనుగొని, నక్షత్రములయొక్కయు, సూర్యునియొక్కయు వర్ణపట్టికలలో (Spectrum) కలుగు విచిత్రసంఘటనలకు సమాధాన మీయగలిగెను. సహాసిద్ధాంతము సూర్యగోళములో నుండియు, సూర్యునియొక్క వర్ణపటములో నెందుచేత కొన్ని మూలపదార్థములకు సంబంధించిన వర్ణపటరేఖ లగపడుట లేదో వాటికి కారణములు తెల్పుటయేకాక, కనపడని కొన్ని మూలపదార్థముల వర్ణపటరేఖలు Sun-spots యొక్క వర్ణపటములను పరీక్షించుటచేతను, మరికొన్ని Faculae యొక్క వర్ణపటమును పరీక్షించుటచేతను కనిపించునని సరిగా జోస్యము చెప్పెను. ఈ సిద్ధాంతము నుపయోగించి మనము చాలదూరములో నున్న నక్షత్రముల యుష్ణోగ్రతను కనుగొనగలము. అందుచే నీ సిద్ధాంతము ఖగోళశాస్త్రకారునకు చేతిలో దీపికగా నున్నది. ఈసిద్ధాంతమును ప్రకటించినతరువాత బ్రిటిషు శాస్త్రజ్ఞులు దీని గొప్పతనమును కనుగొని, ఆచార్య మేఘనాథుని యొక్క అత్యద్భుత మేధాసంపత్తిని గుర్తించి, ఆయనను తమ రాయల్ సొసైటీకి ఏకగ్రీవముగా సభ్యునిగా నెన్నుకొని గౌరవించిరి. ఆచార్యసహా 'ఉష్ణము', 'ఆధునిక భౌతికశాస్త్రము' అను రెండు ప్రమాణశాస్త్రగ్రంథములను రచించి భారతీయులవే కాక పాశ్చాత్యులయొక్కయు మన్ననలను బడసెను. ఈ మహనీయుని ధీశక్తి కనుగుణముగా కలకత్తావిశ్వవిద్యాలయమువారు తమచే నిర్మింపబడబోవు 'Cyclotron Apparatus కు వీరిని డైరెక్టరుగా చేసి, గౌరవింపబోవుచున్నారు.

వర్ణపట్టిక (Spectroscopic) పరిశోధనలు మేఘనాథునికి తోడు బెంగుళూరులో ప్రొఫెసరు వెంకటేశాచార్యులు సహాధ్యాయులతో కలసి సాగించుచున్నారు. ఆచార్యులు నారాయణ, రంగధామరావుల వర్ణపట్టికపరిశోధనలతో విజయనగరము మహారాజావారి కళాశాల ప్రపంచమునకు వెల్లడిఅయినది. తరువాత ఆచార్య రంగధామరావు యూరపుఖండపర్యటన చేసి, అచ్చటి ఆదర్శప్రాయమైన వర్ణపట్టికపరిశోధనాగారములు పరిశీలించి,నూతనానుభవముతో, అత్యద్భుత మేధాసంపత్తితో, అధికోత్సాహముతో నేడు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు పరిశోధనాగారములయందు మహత్తర పరిశోధనలు సాగించుచున్నారు. ఈనాడు 'అణువులవర్ణపట్టిక పరిశోధన'లందు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు పరిశోధకులదే అగ్రతాంబూలము! సీసము, ఆర్సెనికం, సెలీనియమ్, టెల్లూరియమ్, బ్రొమిన్, అయొడిన్ మొదలయిన వివిధపదార్థముల 'పరమాణువుల వర్ణపట్టికలు' (Atomic spectra) వివిధపరిస్థితులయందు తయారుచేసి, పరిశీలించినది ఆచార్య రంగధామరావుగారి పరిశోధనాగారములందే! ఈ వర్ణపట్టిక పరిశోధనలు అనేకవిధములుగా డాక్టరు నారాయణ ఆధిపత్యముక్రింద కొడైకెనాలులోను,

---

*"There is a sort of triangular battle going on between London, Chicago and Bangalore". Sir C. V. Raman.

తదితర శాస్త్రజ్ఞుల ఆధిపత్యముక్రింద అలీఘుర్, కలకత్తా, లక్నో మొదలగు ప్రదేశములలోను కూడ విరివిగా జరుగుచున్న వని విజ్ఞానసంచికలను చూచినచో తేటతెల్ల మగును.

భారతదేశములో తేజస్సును గూర్చి చేసిన వివిధ పరిశోధనలకు తోడు అయస్కాంతీకరణమును గూర్చికూడ వివిధ పరిశోధనాగారములయందు ముఖ్యమైన పరిశోధనలు సాగుచున్నవి. కలకత్తా విశ్వవిద్యాలయమున నున్న ప్రకు రామన్, కృష్ణన్ మహాశయులు ఉభయులును కలసి అయస్కాంతీకరణమునందు వివిధ పరిశోధనలు చేసిరి. తరువాత కృష్ణన్ తన సహచరులతో గలసి స్ఫటికములయందలి అయస్కాంత లక్షణములను పరిశీలించెను. ప్రొఫెసర్ కృష్ణన్ తన పరిశోధనల ద్వారా స్ఫటికాకారమును పూర్తిగా గుర్తించి, ఏ స్ఫటికమందైనను ఏ అణువు ఏస్థానమం దున్నదో కనుగొనగలిగెను. ఈపరిశోధనల ఫలితముగనే ఆయనకు రాయల్ సొసైటీసభ్యతాభాగ్య మబ్బినది.

అయస్కాంతీకరణములో ఆచార్యకృష్ణయే కాక మరికొంతమంది శాస్త్రజ్ఞులుకూడ పరిశోధనలు సాగించుచున్నారు. ఆచార్యుడు డి. యమ్. బోస్ తన విద్యార్థులతో కలసి Para - magnetic పదార్థముల యొక్క అయస్కాంతలక్షణములను పరిశీలించి, Bose's Theory of Para - magnetism of Elements అను మహత్తర సిద్ధాంతమును సృష్టించెను. లాహోరువిశ్వకళాపరిషత్తులో నున్న ఆచార్య భాట్నగర్ క్రొత్తక్రొత్త పరికరములను నిర్మించుకొని, పదార్థముల అయస్కాంతలక్షణములను పరీక్షించుచున్నాడు. తదితరపరిశోధనాగారములలోకూడ అయస్కాంతీకరణములో పరిశోధనలు విరివిగా జరుగుచున్నవి.

తరువాత నేటి భౌతికశాస్త్రప్రపంచములో అత్యున్నతస్థాన మాక్రమించిన కాస్మిక్ కిరణములను (Cosmic rays) గురించి భారతదేములో నేపరిశోధనలు జరుగుచున్నవో కనుగొనవలెను. అందులకు ముఖ్యముగా కాస్మిక్ కిరణము లన్న నేమో తెలిసికొనవలెను.

దుమ్ము, నీటియావిరి లేని గాలి అవిద్యుద్వాహక మని శాస్త్రజ్ఞులు సిద్ధాంతములవల్ల కనుగొనిరి. కాని, శాస్త్రప్రయోగములవల్ల అట్టి గాలికూడ కొంచెము విద్యుద్వాహక మని తెలియవచ్చెను. అందుచే శాస్త్రజ్ఞులు తమ కదివరకు తెలియని క్రొత్త కిరణప్రసారము (Radiation) గాలిలో నున్నదని యూహించి, తమ శాస్త్రప్రయోగములను ముందుకు సాగించిరి. హెస్ అను శాస్త్రజ్ఞుడు పై అంతస్తు (layer) లో నున్న గాలియొక్క విద్యుద్వాహకశక్తిని కనుగొనుటకు నూతన పరికరములను సృష్టించి, వాని సహాయమున గాలియొక్క విద్యుద్వాహకశక్తి కొంత ఎత్తుకు వెళ్లు వరకు క్రమముగా తగ్గుననియు, అక్కడనుండి మరీ పై కెగిరినకొలది అది క్రమముగా హెచ్చుననియు కనుగొనెను. అందుచే అతీత ప్రదేశములనుండి (Distant spice) ఒక విధమైన కిరణప్రసారము వచ్చుచున్నదనియు, అది అవిద్యుద్వాహకమగు గాలిలో నుండి ప్రవహించి ఆగాలిని విద్యుద్వాహకముగా చేయుచున్నదనియు నాతడూహించెను. నాటినుండి ఆ కిరణ ప్రసారమునుగూర్చి పరిశోధన అభివృద్ధిచెందుచున్నది. ఈ అతీతప్రదేశములనుండి వచ్చుచున్న కిరణప్రసారమునే కాస్మిక్ కిరణ ప్రసార మనియు, ఈ కిరణములను కాస్మిక్ కిరణము లనియు అనుచున్నారు. కాని ఈ కాస్మిక్ కిరణములు తేజఃకిరణముల వంటి కిరణములు ఎంతమాత్రమును కావు. అవి ఒక విధమైన విద్యుత్కణములు. అందు చాల కణములు ధనవిద్యుత్కణములే! అవి అతీతప్రదేశములనుండి మనకడకు వచ్చుచున్నవి. కాని అవి ఏ ప్రదేశములనుండి వచ్చుచున్నవో నిశ్చయముగా శాస్త్రజ్ఞులు చెప్పజాలకున్నారు. ఈ కిరణములనుగూర్చి వివిధప్రదేశములయందు వివిధశాస్త్రజ్ఞులు పరిశోధనలుచేసి, ఒక ప్రదేశమునుండి వచ్చు కిరణములకును, మరియొక ప్రదేశమునుండి వచ్చు కిరణములకును చాల వ్యత్యాస ముండుననియు, భూమధ్యరేఖాప్రాంతమునుండి వచ్చు కిరణములు తదితర ప్రదేశములనుండి వచ్చు కిరణములకన్న - ముఖ్యముగా ధ్రువప్రాంతములనుండి వచ్చు కిరణములకన్న గట్టిగా (Hardest) నుండుననియు కనుగొనిరి. ఆ కాస్మిక్ కిరణములు గాలిలోని అణువు

లను, పరమాణువులను తాకి, చిత్రవిచిత్ర సంఘటనలను కలుగజేయుచున్నవి. ఈ సంఘటనలు భూమి నుండి పైకి వెడలినకొలది మారుచుండును. కాన ఈ కాస్మిక్ కిరణములను పరిశోధించుటకు తగిన స్థలము భూమిపైన ౨౦ మైళ్ల దూరములో. అందుచే వీటినిగురించి తెలిసికొనుటకు ఆకాశముమీదికి ఒకానొకవిధమైన వాయువిమానముల (Balloons)ను పంపుదురు. వీటియందు వాటంతట అవే కొలచే యంత్రములు (Automatic recording instruments) అమర్చబడియుండును. ఆయంత్రములు గీసిన గీతల ద్వారా గాలియొక్క గుణములను కనుగొందురు. ఈ పరిశోధనలవల్లనే శాస్త్రజ్ఞులు పాజిట్రాన్ (Postron), మెసాన్ (Meson) మొదలగు క్రొత్త విద్యుత్కణములు ఉన్నవని తెలిసికొనగలిగినారు. మరియు పదార్థమును కిరణప్రసారములోనికిని, కిరణప్రసారమును పదార్థములోనికిని మార్చగలమని కనుగొన్నారు.

## డా. హోమీ జె. భాభా

ఈ కాస్మిక్ కిరణములనుగూర్చి పరిశోధనలు చేసిన భారతీయులలో ముఖ్యుడు డాక్టరు హోమీ జె. భాభా. డాక్టరు భాభా జర్మనుపరిశోధనాగారములలో పరిశోధనలు చేసి, ముఖ్యమైన **Bhabha Heiller casscade theory** అనుదానిని సిద్ధాంతీకరించెను. నేడీయన బెంగుళూరు శాస్త్రపరిశోధనాలయమున తన పరిశోధనలను ముందుకు సాగనిచ్చుచున్నాడు. ఈ కాస్మిక్ కిరణపరిశోధనలవల్ల శాస్త్రజ్ఞులు మెసాన్ అను క్రొత్తకణమును కనుగొనిరని మనము పైన తెలిసికొన్నాము. ఈ మెసాన్ కణమునుగూర్చియు, తేజఃకణమునుగూర్చియు భిన్నాభిప్రాయములున్నవని డా. భాభా నుడువుచున్నాడు. డాక్టరు భాభా మెసాన్ కణము విద్యుత్తుచే ఆవహింపబడిన కణమనియు, తేజఃకణము విద్యుద్రహితకణమనియు కనుగొనినాడు. మరియు నేటివరకును శాస్త్రజ్ఞులు కనుగొనని క్రొత్త కణములు సృష్టిలో నుండవలెననియు, అందు ముఖ్యముగా ఋణవిద్యుత్తును కలిగిన ప్రోటాను (Proton)—రెట్టింపు విద్యుదావేశమును కలిగిన ప్రోటాను సృష్టిలో నుండితీరవలెననియు ఆయనజోస్యము చెప్పుచున్నాడు. డాక్టరు భాభాయొక్క పరిశోధనల యుత్కృష్టతను గమనించి, లండన్ రాయల్ సొసైటీవారు గత మార్చి నెలలో ఈయనను తమ సొసైటీసభ్యునిగా నెన్నుకొని గౌరవించిరి. దీనినిబట్టి "డాక్టరు భాభాయొక్క పరిశోధనలు భారతీయ విజ్ఞానమునకు క్రొత్తమెరుగు పెట్టుచున్న" వని రామన్ మహాశయుడు నుడువుటలో నేమియు నతిశయోక్తి కాన్పించుటలేదు.

పై పరిశోధకులకు తోడు బోస్ - అయిన్‌స్టయిన్ స్టాటిస్టిక్సు (**Bose's statistics of Photons**)ను సిద్ధాంతీకరించిన ఎస్. ఎన్. బోస్ పండితు నెరుగని భౌతికశాస్త్రజ్ఞుడుండడు. ఆంధ్ర విశ్వవిద్యాలయములోనున్న డాక్టరు నరేంద్రనాథ్, బెంగుళూరులోని వెంకటేశ్వరన్, మరి యితర పరిశోధనాగారములలో పరిశోధనలు సాగించు రామదాసు, భార్గవ, ఘోష్, డాక్టరు బిదాని మున్నగు శాస్త్రజ్ఞుల పరిశోధనలును చరిత్రాత్మకమైనవే. దినదినప్రవర్ధమానమై ఝరీవేగముతో పరుగిడుచున్న భారతీయ వైజ్ఞానికపరిశోధనలను గూర్చి వ్రాయుటకు కొన్నివేల పుటలైనను సరిపోవు. స్థలలోపముచే వాటిని గూర్చి నుడువుటకు సైతము వీలు లేకపోయినది. భారతవిజ్ఞానసంచికలను పరిశీలించినచో, అందు భారతశాస్త్రజ్ఞుల నామములు కన్నులకు మిరుమిట్లుగొలుపుచు ప్రకాశించుచుండును.

పైవిషయములను గమనించినచో భారతదేశములో ఆధునికవిజ్ఞానము ఏవిధముగా దినదినాభివృద్ధి గాంచుచున్నదో, ఉరకలువేయుచు ఏవిధముగా ముందుకు సాగుచున్నదో తేటతెల్లమగును. భారతదేశములో పరిశోధనాగారములు నిర్మింపబడి, పరిశోధనలు గత ముప్పది సంవత్సరములకాలమునుండి మాత్రమే సాగింపబడుచున్నను, పరిశోధకులు ఎన్ని అవాంతరములను దాటవలసి వచ్చుచున్నను ఫలితములుమాత్రము చాల ఆశాజనకములుగా నున్నవి. ఈ ముప్పదిసంవత్సరముల స్వల్పకాలములోనే మహోత్కృష్టమైన పరిశోధనలను గావించి, ఆధునికవిజ్ఞానము పాశ్చాత్యుల సొత్తను మూఢాభిప్రాయమును భారతీయవిజ్ఞాన

వేత్తలు పారద్రోలగలిగిరి. భారతీయులు ఊహా ప్రపంచములో ఉయ్యాల లూగుచు, కావ్యకన్యతో కాలక్షేపము చేయుచు, ఆధ్యాత్మికచింతలో మునిగిపోవుదురే కాని, ప్రపంచమును శాస్త్రదృష్టితో చూడలేరను పాశ్చాత్యుల నిశ్చితాభిప్రాయమును పటాపంచలు చేయగలుగుటయే కాక సరియైన వాతావరణము కలిగియున్నచో, భారతీయులు తమ తలదన్నెదరను నిశ్చితాభిప్రాయమునకు భారతశాస్త్రవేత్తలు పాశ్చాత్యశాస్త్రపండితులను తీసుకొనిరాగలిగిరి. కాబట్టి నేటి ఘోరమైన రాజకీయదాస్యము నశించి, స్వతంత్ర భారతదేశములో పుష్కలధనముతో, ప్రశాంతిస్వేచ్ఛావాతావరణములో పరిశోధనలు సాగించినచో భారత వైజ్ఞానికులు పాశ్చాత్యవిజ్ఞానవేత్తలను తలదన్నుటయే కాక వారికి మార్గదర్శకులవుదురనువిషయము నిస్సంశయము, నిశ్చయము.

[ఈ వ్యాసరచనకు విజ్ఞానసంచికలయొక్కయు, Cultural Heritage of India అను ఉద్గ్రంథముయొక్కయు ఆధారము గైకొనబడెను. 'స్ఫటిక పరమాణు సంచలనము' శాస్త్రమహాశయుని ఉపన్యాసము వినినతరువాత వ్రాయబడెను.]

---

# గ జ దొం గ

= శ్రీ దేశరాజ్-వణుకూర్ =

పోకుము పోకు మెవ్వడవు పో యిలుసొచ్చి మెఱుంగకున్నటుల్
నాకనుముందె పోదు వవునా గజదొంగవు నీవ కృష్ణుడా
నీ కిది మంచిసేత యగునే మురళీధర దొంగవాడవై
వాకిళులందు గాలిడి ప్రవాదము వేయుట లాడువారిపై...

చీకటిలోన లీనమగు చెల్వము నల్లని సోగయూ సిగం
గేకికలాపవల్లి గమనింతమటన్నను గన్నుదప్పు; నీ
వేకువ వచ్చి దొంగిలునొ వెన్నలు రాతిరిమధ్య మెల్లనం
దోకొనిపోవునో యెలుకదుందుడుకుల్ గజదొంగయే యగుట్.

పోలికబట్టి పట్టుకొనబోవుదమన్న గరంబు రాదు, పో
గాలును రాదు; కాలిడిన గన్నులుకా వివి స్విన్నలౌను; మం
త్రాలను నేర్చి చోరుడయి రాడుకదా నవనీతచోరుడే
ఓ లలితాంగి! యీత డెవడో గజదొంగగనే కనంబడున్.

ఇచ్చట నోచెలీ నిలువు మేమను యిచ్చట నిల్వ మింత ఓ
నెచ్చెలి! దాని నచ్చటను నిల్వుమటంచును జెప్పి పొంచినం
గ్రచ్చనకాయుదుందుడుకుగానిని బట్టగవచ్చు బట్టి యీ
యెచ్చెములన్ని యేమిటికినో తనవల్లనె నేర్వవచ్చుబో.

దొంగ! యితండు దొంగ! మొలదుప్పటి బట్టితి బట్టుకొం డికం
దొంగతనంబు వేయజను దొంగకు గజ్జెలు గంకణంబులా!
బంగరుబొజ్జవాడు శిఖిబర్హశిఖండియ కాని వేరుకా
డంగనలార! తుంటరికదా మన నందసుతుండు కొంటెలన్.

సౌధములోని చల్లనగు చల్లను ద్రాగినవాడు రాధికా!
రాధిక! వెన్నదొంగ మన రాసుతుడే! యితడే, గిరుక్కునన్
వీధిబడిం బరుంగిడి గవీనివహంబున దూరి మెల్లగా
సాధువువోలె బోయెడి, హసా దహుకో గజదొంగ యచ్చటన్.

గజదొంగా! గజదొంగ!—దొంగయెవ్వనే?—కాదమ్మ: గోపాలుడీ
నిజమా గోపకు డింత దొంగయగు వానిం బట్టుకోలేమటే?
భజనం బేమియు నే నెఱింగిననెపో పట్టుంబడుం; జాల న
క్కజమమ్మా గజదొంగకుం భజన లేకంజాతులుం జేతురే?

గిన్నెలు ముంతలు న్నగలు క్రేపులు నిన్నియు మాని వెన్నలుం
జున్నులు సన్నచీరలకె చూచు మహామహు డిట్టి దొంగతో
నన్నుల మేమి సేతు మసహాయల మాతడు పూరుషుండు, మా
యౌన్నతి వల్లకానిపను లోయెలనాగ! యెవెవ్వి సేయునో?

కదల డిదేమి తూరుపుమొగమ్మున వేకువచుక్క కన్నెక్రొ
వ్వేదపయి క్రొత్తదాసనపు విచ్చిన రేకుల యర్కశోణిమల్

# గ జ దొం గ

చెదరిన నీ నిశాచరు డిసీ! పువ్వుదేనియ ద్రావు నల్లతు
మ్మెద కరుణోదయా స్తమయమేషవృషాదికప్రశ్న మేటికిన్ ?

రవికెను దొంగిలించి యిటు రంతున గంతిడి పోవ కిందురా
రవికెను దేవరా మనవిరా యొకమా రిటు చూడరా మనో
భవనవసుందరా భువనవల్లభ! దొంగవు కావు మంచివా
డవుగదరా యిదో పరుగిడంజన కిచ్చిన నన్ని యిచ్చెదన్.

నా కీకుండగ నీవ మై దొడిగి కాంతా వేషముం గొన్న పో
రా కృష్ణయ్య! యశోద వచ్చి కని నిన్ రావమ్మ యుం చిన్ని వే
ళాకోళమ్ములు పల్కి లేతమెడలో ద్రా డింక గట్టించు బ
చ్చాకుం బందిట మూడుకాళ్ల ముసలయ్యం గూరుచో బెట్టుచున్.

ఓ దేవా కొడువా యశోద యిడబోదో పాలునుం బెర్వు; నీ
వీదారిం గలగుండుపెట్టుటకు రానేలయ్య కోనారివే
కాదా క్రేపులు కట్లు త్రెంచుకొని యేకాళిందికే పోవునో
లేదే నెవ్వరి చేను మేసెడినో చాల్లే దొంగ వైనావులే.

అదిగో గంటల గిల్కుచప్పు డిటలే, యన్నయ్య నల్లావు బు
చ్చిది కాబోలును త్రాడు ద్రెంచుకొని చొచ్చెం జేనిలో, పాప యు
వ్వది; తా ప్రేమను బెంచుకొన్న దిది యాపైపెచ్చుగా నీవు చే
యు దురాచారము చాలురా యనద యెట్లోర్చుం గిశోరాకృతీ!

ఆనా డాపగలోన స్నానమును సేయం జెట్టుపై కోక లీ
వేనా యెత్తుకపోయి దాచి యది యేదీ నేను కాదంటి వా
నొనా యెక్కడి దొంగబుద్ధు లివి కృష్ణా నాథు లేమందు రం
దైన స్నిమదిలో దలంపవలదా ఆ ముచ్చటే నేడునా?

ఇదిగిదిగో యశోద పదవ్వే యిట నీకొడు కెంత వల్దు న
ల్వా దని వచించిన న్వినక పయ్యెద వీడడు వేగవేగ రా
గదె; యటు కంటివా యదుసఖా! జననీమణి యిందు వచ్చెడిన్
వెదకుచు పారిపో మఱలి వెన్నలు దొంగిలరాదు మెప్పుడున్.

## భారతి - చిత్రభాను భాద్రపదము

ఏరా కన్నుల నీరు గ్రుక్కుకొని నీ విట్లేడ్తు వీమాటకే
రేరాజు న్నిరసించు నెమ్మొగము శౌరీ వ్రాల్చినా వింకపై
లేరా యెన్నడుగూడ నిన్ననను లే వ్రీడాశ్రువుల్ నీముఖ
శ్రీరాజీవము గన్న సోనలయి రాలెం దప్పు సైరింపరా.

మఱదీ గోపకిశోర! చాలు నిక లెమ్మా! కాలిపట్టూడి యె
త్తరగు న్నేలను బోరలాపడిన నేయమ్మాయియు న్నాకు న
క్కఱలే దింతటి కుంటిపిల్ల డని తా గాదన్నచో నింక నె
వ్వారు బెండ్లాడరు చిట్టిబొజ్జకును బువ్వాచల్ల యెట్లబ్బురా ?

విసిగింపకుర కృష్ణ! వేణికాలంకృతప్రసవమాలిక కేల బైలదీసి
అలయింపకుర కృష్ణ! యామునావనపునర్విరహాగ్నిశిఖల గ్రొవ్వేడి ద్రోసి
కలగింపకుర కృష్ణ! కలవేణుమంజులామృతగీతమధురవాహినుల జిలికి
నవ్వింపకుర కృష్ణ! నఖకోరకాంచలావరణకాంచనవస్త్ర మురల నీడ్చి
మంచిదొంగవె లే సుదామాంశుభాంగి- యేడ్చుచున్నది నీచేత కిప్పటికిని
జీర జింపి వసారలో జిఱుతలేగ- దోలితట స్త్రీల సరసాలతో బనేమి ?



గౌడీయగోస్వాముల

# భక్తిభావరసవిచారము



=శ్రీ పూర్ణానంద=

అఖిల రసామృత మూర్తిః
ప్రసృమరరుచి రుద్ధ తారకాపాలిః,
కలితశ్యామో లలితో
రాధాప్రేయాన్ విధు ర్జయతి.
[భక్తిరసామృతసింధువు.]

౧

సేవార్థమున పఠితమైన 'భజ్' ధాతువు 'క్తి' ప్రత్యయముతో గూడగా 'భక్తి' శబ్దము నిష్పన్నమగుచున్నది. ఈశబ్దము ప్రాయికముగ ఈశ్వర ప్రేమాకారమును దాల్చిన మానసికవృత్తిని నిర్దేశింప శాస్త్రములు వ్యవహరించుచున్నవి. చిన్నలు పెద్దలపట్ల చూపు గౌరవమయభావపరముగకూడ ఈ పదము లోకమున ప్రయోగింపబడుచున్నది. శాస్త్రీయ మగు భక్తినే గౌడీయ గోస్వాములు సర్వోత్కృష్ట మగు పంచమ పురుషార్థముగ గ్రహించి, ప్రపంచించి యుండిరి. సాధ్యమైనంతవఱకు వారి భాషలోనే వారి ఆశయమును దెల్పుట ఈ వ్యాసోద్దేశ్యము.

ఈభక్తి సాధనభక్తి, ప్రేమభక్తి యని ద్వివిధము. వైధీ, రాగానుగభక్తులు సాధనభక్త్యంతర్గతములు. అపరా-పరా, గౌణీ-ముఖ్యము లను నామాంతరములుగూడ వీని కున్నవి.

"శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనమ్,
అర్చనం వందనం దాస్యం
సఖ్య మాత్మనివేదనమ్."

అని భాగవతకారుడు నిర్వచించిన సాధనభక్తియే - నవధాభక్తియే అభ్యాసఫలముగ 'రాగానుగ' యగును. ఇట బాహ్యక్రియాకలాపము నపేక్షింపకయే భగవల్లీలారసాస్వాదనము భక్తునకు లభించును. ఈ సాధనభక్తియొక్క మహత్ఫలమే ప్రేమభక్తి. మొదటిది ఉపాయము; రెండవది ఉపేయము.

ఈభక్తిని శ్రీ రూపగోస్వామిపాదు లిట్లు నిర్వచించియున్నారు :

"అన్యాభిలాషితాశూన్యం
జ్ఞానకర్మాద్యనావృతమ్,
ఆనుకూల్యేన కృష్ణాను
శీలనం భక్తి రుత్తమా." [భ. ర. సిం.]

భుక్తి, ముక్తి, యోగసిద్ధి, ఐశ్వర్యవాంఛ మొదలుగాగల ఇతరవాంఛల నభిలషింపక, సాధనభక్త్యంగములగు జ్ఞానకర్మాదుల సాయము నపేక్షింపక, త్రికరణములను శ్రీకృష్ణపర మొనర్చుటయే ఉత్తమభక్తి (ప్రేమభక్తి).

ఈ ప్రేమభక్తి లభించు క్రమ మియ్యది :

"ఆదౌ శ్రద్ధా తతః సాధు
సంగోఽథ భజనక్రియా,
తతోఽనర్థనివృత్తిః స్యా
త్తతో నిష్ఠా రుచి స్తతః,

అథాసక్తిస్తతో భావ
స్తతః ప్రేమోదయశ్చసః,
సాధకానా మయం ప్రేమ్ణః
ప్రాదుర్భావే భవే త్క్రమః" [భ. ర. సిం]

ప్రథమమున 'శ్రద్ధ' అవసరము. ఈశ్రద్ధ సాధుసంగమునకు గారణమగును. సాధుపురుషుల ఆచారవ్యవహారముల గాంచ, వారి ననుసరింప బుద్ధి పొడమును. ఫలితముగ భగవద్భజనాభ్యాస మలవడును. భజనవలన అనర్థములు తొలగిపోవ నిష్ఠ, రుచి, ఆసక్తులు క్రమముగ లభించును. ఆసక్తియే భావముగను, తదాశ్రయములగు రసములుగను పరిణతి నందును. సర్వరసముల సమాహారమే ప్రేమ యనబడు మహాభావము. 1

## ౨

భక్తిశాస్త్రమున దృఢప్రత్యయ ముండుటయే 'శ్రద్ధ'. ఇయ్యది శాస్త్రోక్త విషయాచరణ రూపమైన ప్రకాశము నందును. జిజ్ఞాస ఉదయించును. ఈశ్రద్ధయే గురుచరణముల నాశ్రయింపజేయు, తద్ద్వారమున సాధుసంగము లభించును.

సాధుసంగమఫలముగ భజనాసక్తి కలుగును. ఈభజన అనిష్ఠితము, నిష్ఠితము అని ద్వివిధము. అనిష్ఠితమగు-ఆసక్తి 'ఉత్సాహమయి', 'ఘనతరల', 'వ్యూఢవికల్ప', 'విషయసంగర', 'నియమాక్షమ', 'తరంగరంగిణి' అని షడ్విధము.

శాస్త్రాధ్యయనమును ఆరంభించిన బాలుడు ప్రాథమిక దశలో లోకశ్లాఘ్యమాన మగు పాండిత్యమును బొంద నుత్సాహమును జూపును. ఇట్టి భావమే "నేను నలుగురిచేతను భక్తుడ నని అనిపించుకొనవలెను" అనురీతిగ భక్తునకుగూడ కలుగును. దీనిని ఉత్సాహమయమగు అనిష్ఠిత భజనాసక్తి యందురు. ఆరంభించిన శ్రవణాది భక్త్యంగములను ఒకొక్కప్పుడు నిర్వహించుట, మఱియొకప్పుడు రసానుభూతి కొఱవడ నిర్వహింపకుండుట అను స్థితియే ఘనతరల. సోమరితనము వచ్చి పట్టుదలను తగ్గించుటయే ముఖ్యకారణ మగును. "భార్యాపుత్రాదులనుగూడ భక్తుల నొనర్చి గృహముననే యుండి భగవత్సేవ నొనర్తునా? లేక, బృందావనాదిపుణ్యప్రదేశముల కరిగి ఏకాంతసాధన నొనర్తునా? దారపుత్రాదులను త్యజింపవలసిన ఇప్పుడే త్యజింతునా? లేక, భుక్తభోగినై వార్ధక్యమున వీడుదునా? "అతృప్తస్తాననుధ్యాయన్ మృతోఽన్ధం విశతే తమః — తావ ద్రాగాదయ స్తేన స్తావత్ కారాగృహం గృహమ్" (ఇంద్రియములు చరితార్థత నందనంతవఱకు నియమిత భోగముల ననుభవింపుము; వానిని తృప్తిపరపక మనసా ధ్యానించిన నరకమునకు బోవుదువు. కామక్రోధము లున్న, గృహమే కారాగృహము) అని గార్హస్థ్యసన్న్యాసధర్మముల విధి యున్నది. వీనిలో నెయ్యది ఆశ్రయణీయము? కీర్తన, కథాశ్రవణము మున్నగు అంగములలో నెద్దానిని గ్రహింతును? అంబరీషాదుల వలె అనేకాంగమగు భక్తిని గ్రహింతునా?" అను వివిధ వికల్పనలచే పీడింపబడు స్థితియే వ్యూఢవికల్పము. "విషయావిష్టచిత్తానాం విష్ణ్వావేశః సుదూరతః, వారుణీదిగ్గతం వస్తు వ్రజ న్నైన్ద్రీం కిమాప్నుయాత్" అను వాక్యమువలన ప్రబోధింపబడి, విషయభోగముల పరిత్యజింప జేయు యత్నమే విషయసంగరము. ఇట్లు, భక్తు డొకొక్కప్పుడు విషయేచ్ఛను త్యజించుచు, మరొకప్పుడు విషయేచ్ఛవలన జయింపబడుచుండును. "ఇంత జపమును జేయుదును, ఇన్ని తడవలు ప్రణామ మొనర్తును, భగవత్సంబంధములగు వాక్యములను వినను, నుడువను" మొదలగు నియమములను స్వేచ్ఛాపూర్వకముగ విధించుకొనియు, వానిని సంపూర్ణముగ ఆచరింపజాలకుండుట నియమాక్షమ. భజనప్రభావఫలితముగ జనానురాగము, సంపదలు, సిద్ధులు

1. "కృష్ణస్య సుఖే పీడాశంకయా నిమిషస్యాపి అసహిష్ణుతాదికం యత్ర, స రూఢో మహాభావః. కోటిబ్రహ్మాండగతం సమస్తసుఖం యస్య సుఖస్య లేశోఽపి నభవతి, సమస్తవృశ్చిక సర్పాది దంశకృత దుఃఖమపి యస్య దుఃఖస్య లేశో నభవతి. ఏవంభూతే కృష్ణసంయోగ వియోగయోః సుఖదుఃఖే యతో భవతః సః అధిరూఢః మహాభావః. అధిరూఢస్యైవ 'మోదన' 'మాదన' ఇతి ద్వే రూపే భవతః."
—శ్రీ విశ్వనాథచక్రవర్తి.

అను తరంగములు లేచి, భజనక్రియ సాఘాతపడుచు స్థితియే తరంగరంగిణి. భక్తుని జూచి జనులు సామాన్యముగ గౌరవమును, అనురాగమును జూపుదురు. 'సర్వభూతాంతరాత్ముఁ'డగు హరి నర్చించుటవలన స్థావరజంగమాత్మకమగు జగత్తు తృప్తినందును. అప్పుడు విషయసుఖములు, అణిమాదిఅష్టసిద్ధులు వచ్చి భక్తుని ఆశ్రయించును. లేక, భక్తుని దార్ఢ్యమును బరిశీలింప మహామాయయే ఈ ప్రలోభనముల జూపవచ్చును.2

## 3

ఈ భజనక్రియాఫలితముగ అనర్థము లన్నియును తొలగిపోవును. అనర్థములు దుష్కృతోత్థములు, సుకృతోత్థములు, అపరాధోత్థములు, భక్త్యుత్థములు అని నాల్గువిధములు.

అందు, అవిద్యాస్మితరాగద్వేషాభినివేశము లను పంచక్లేశములుకె దుష్కృతోత్థములు. వీని నన్నిటిని అవిద్యాంతర్గతములుగనే గ్రహింపవచ్చును. ప్రారబ్ధము (ఫలోన్ముఖము), అఫలోన్ముఖము, రూఢము (బీజోన్ముఖము), బీజము అనునవికూడ ఈ క్లేశాంతర్గతములే. వీనినే భక్తిరసామృతసింధుకారుడు ఫలోన్ముఖము, అప్రారబ్ధఫలము, కూటము, బీజము అని వ్యవహరించి యున్నాడు. సుకృతోత్థము లన, వివిధములగు భోగాభినివేశములు. కొందరు వీనినిగూడ క్లేశాంతఃపాతములుగనే పరిగ్రహించుచున్నారు.

## ౪

సేవాపరాధ నామాపరాధ జనితములగు అనర్థములు అపరాధోత్థములు.

దేవాలయమునకు యానారోహియై వెడలుట, పాదుకాధారియై భగవద్దర్శన మొనర్చుట, ఉత్సవదినముల (విశేషపూజ నొనర్చి) భగవత్సేవ నొనర్పకుండుట, ఈశ్వరసాన్నిధ్యమున ప్రణామ మొనర్పకుండుట, అశుచియై భగవద్వందన మొనర్చుట, ఏకహస్తప్రణామ మొనర్చుట, పృష్ఠభాగ ప్రదర్శనపూర్వకముగ ప్రదక్షిణము నొనర్చుట, దేవునియందు పాదములను జాపుట, వంగి నమస్కరించుట, తదగ్రమున శయన, భక్షణ, మిథ్యాభాషణ, ఉచ్చభాషణ, నిష్ఠురభాషణ, పరస్పరసంభాషణ, రోదన, నిగ్రహానుగ్రహములను సల్పుట, పరనిందా పరస్తుతులను, అశ్లీలవాక్యములను ఉచ్చరించుట, కంబళమును ధరించుట, అపానవాయువును త్యజించుట, శక్తియున్నను గౌణోపచారములను అర్పించుట4, అనివేదితాన్నభక్షణము, ఆయా ఋతుప్రాప్తములగు ఫలపుష్పముల సంగ్రహించి యర్పింపకుండుట, అగ్రభుక్తములును, వ్యవహృతములును నగు అన్న- వ్యంజన- వస్త్ర- పుష్పాదుల నర్పించుట, పృష్ఠభాగమును ఈశ్వరవిగ్రహమునకు ప్రదర్శన మొనర్చుచు కూర్చుండుట, దేవతాసాన్నిధ్యమున ఇతరుల కభివాదన మొనర్చుట, గురువు ప్రశ్నించినను తత్సాన్నిధ్యమున బదులు పలుకకుండుట, తత్సాన్నిధ్యమున తన్ను ప్రశంసించుకొనుట, దైవనింద నొనర్చుట అనునవి భక్తసమాజమున ద్వాత్రింశత్ (౩౨) సేవాపరాధములుగ పరిగణింపబడు చున్నవి.5

ఇవిగాక, రాజాన్నభక్షణము, అంధకారగృహమున నున్న దేవవిగ్రహమును స్పృశించుట, అవిధిపూర్వకముగ విగ్రహసమీపమున కరుగుట, వాద్యరహి

---

2. ఈ విభాగము 'మాధుర్యకాదంబినీ' కారుడగు శ్రీ విశ్వనాథచక్రవర్తి ననుసరించి.

3. చూ: యోగదర్శనము(పతంజలి-౨ అ. సూ. ౩, ౪, ౬, ౭, ౮, ౯)—౧౯౩౯ నవంబరు భారతిలో ఏతన్నామకమగు శీర్షికయందు ఈ విషయము లాలోచింపబడినందువలన ఇట విశదీకరించుటలేదు.

4. తంత్రోక్తమగు పూజ సామాన్యముగ పంచోపచారపూజ, దశోపచారపూజ, షోడశోపచారపూజ అని త్రివిధము. షోడశోపచారపూజ ప్రత్యహ మొనర్చుట అసంభవము కాన, దశోపచారపూజ నిత్యపూజగ తచ్ఛాస్త్రనిర్దిష్టము. ఇట, పంచోపచారముల నొనర్చిన గౌణపూజ యగునని భావము. ఉత్సవదినముల విశేషపూజ - అనగా షోడశోపచారపూజ నొనర్పవలె నని విధి.

5. భక్తిరసామృత సింధుబిందు.

తముగ మందిరద్వారముల తెఱచుట, శునకాదిదూషిత భక్ష్యములను పూజార్థము సంగ్రహించుట, అర్చనా కాలమున మౌనభంగ మొనర్చుట, పూజాసమయమున మూత్రపురీషత్యాగార్థము చనుట, గంధమాల్యములను ముందుగ నొసగకయే ధూపము నర్పించుట, నిషిద్ధపుష్పములతో పూజించుట, దంతధావనమొనర్చుకొనకయే శ్రీ విగ్రహమును తాకుట—తత్సంబంధములగు కార్యముల నొనర్చుట, స్త్రీసంగము నొనర్చియు, రజస్వలా మృతదేహ దీపముల ముట్టుకొనియు, రక్త, నీల, అధౌత, అన్యత్యక్త, మలినవస్త్రముల ధరించియు, మృతదేహమును చూచియు, అపానవాయువును త్యాగ మొనర్చియు, క్రుద్ధతను దాల్చియు, శ్మశానమున తిరుగాడియు, అజీర్ణ స్థితితోడను, కుసుంబ, శాక, హింగు భక్షణ మొనర్చియు, తైలమర్దన మొనర్చికొనియు శ్రీ విగ్రహమును స్పర్శించుట - తత్సంబంధములగు కార్యముల నాచరించుట కూడ సేవాపరాధములే యని గ్రహింపనగును.6

మఱియు, భగవచ్ఛాస్త్రి అనాదరము, ఇతర శాస్త్రప్రవర్తన, దేవతాసమ్ముఖమున తాంబూలమును సేవించుట, నిషిద్ధపత్రపూజ, ఆసురసమయపూజ, కాష్ఠాసనమున, లేక భూమిమీద కూర్చుండి పూజించుట, దేవతను స్నానమొనరింప జేయు సమయమున వామహస్తముతో తాకుట, శుష్కములును, యాచితములును నగు పుష్పములతో పూజించుట, పూజాకాలమున నిష్ఠీవనమును త్యజించుట, గర్వముతో తానొనర్చిన పూజనుగుఱించి చెప్పుకొనుట, వక్రముగ తిలకమును ధరించుట, పాదప్రక్షాళనరహితముగ దేవమందిరమున కరుగుట, ఇతరపక్వములగువస్తువుల నర్పించుట, అభక్తుల సమ్ముఖమున పూజ నొనర్చుట, గణేశాది పంచ దేవతా పూజను ఒనర్పకయే అర్చించుట, కాపాలికదర్శన మొనర్చియు, ఘర్మాక్తశరీరముతోడను పూజనొనర్చుట, నఖస్పృష్టజలముతో దేవతను స్నానమొనరింపజేయుట, భగవన్నామగ్రహణపూర్వకముగ శపథ మొనర్చుట అనునవిగూడ సాంప్రదాయికముగ సేవాపరాధములని చెప్పబడుచున్నవి.

సాధునింద, శివవిష్ణువుల నామరూపముల భేదబుద్ధి, గుర్వవజ్ఞ, శ్రుతి స్మృతి నింద, నామమాహాత్మ్యమున అర్థవాదబుద్ధి, నామార్థ కువ్యాఖ్య, నామబలమున పాపప్రవృత్తి, ఇతరశుభకర్మలతో నామమును సమమొనర్చుట, శ్రద్ధాహీనునకు నామోపదేశ మొనర్చుట, మహిమను వినియు నామమునెడల అప్రీతిని వహించుట అనునవి దశవిధనామాపరాధములు. ఈ విషయమును శ్రీ జీవగోస్వామి భక్తిరసామృతసింధు టీకయందు ప్రసంగించియున్నాడు.7 శరణాగతి గద్యయందు శ్రీరామానుజుడు 'భగవదపచార భాగవతాపచారాసహ్యాపచారరూప నానావిధానంతాపచారాన్...క్షమస్వ' అనునప్పుడీయపరాధములనే సూచించియుండనోపును.

ఈ అపరాధశాఖల కుపశాఖ లనదగు ధనసంగ్రహము, ప్రతిష్ఠాలాభము, ఇతర సాధకుల చిత్తమును వీనిమూలమున ఆకర్షించుట అనునవి భక్త్యుత్థములగు అపరాధములు.

ఈ అపరాధము లన్నియును భజనవలననే నివృత్తము లగును. ఈనివృత్తి ఏకదేశవర్తిని, బహుదేశవర్తిని, ప్రాయికి, పూర్ణము, ఆత్యంతికము అని పంచవిధము. వ్యాసవిస్తృతిభయమున వాని నిట వివరించుటలేదు.

అనర్థనివృత్తి యైనతోడనే భజన 'నిష్ఠిత' మగును. అప్పుడు లయవిక్షేపాప్రతిపత్తి కషాయరసాస్వాదన లను అంతరాయము లైదును తొలగిపోవును. ఇవి యుండుటవల్లనే భక్తి అపరిపక్వదశయందుండి, అనిష్ఠిత మనబడును.

కీర్తనశ్రవణస్మరణసమయములలో నిద్రవచ్చుటయే లయము. కీర్తనకంటె శ్రవణమునను, శ్రవణముకంటె స్మరణసమయమునను నిద్ర అత్యంతసహజముగ వచ్చును. కీర్తన నలుగురితో కలిసి చేయుచుండుటవలన నిట నిద్రవచ్చుట తక్కువ

6. చూ: వరాహపురాణము.

7. చూ: పద్మపురాణము.

అవకాశము లేదు. శ్రవణ సమయమున తానొక్కడే ఇతరుల ప్రసంగ వ్యాఖ్యానములను వినుచున్నందువలన మనస్సు ఆ ఆలంబనమును సరిగా గ్రహింపలేకున్న అత్యంతసహజముగ నిద్రకు లోబడును. కనుక, కీర్తనశ్రవణ స్మరణములలో ఉత్తరోత్తరము అధికముగ నిద్రామాంద్యమునకు తావున్నదని గ్రహింపనగును.

శ్రవణ కీర్తన స్మరణ సమయముల వ్యావహారిక వార్తాసంపర్కము-వాచికముగగాని, మానసికముగగాని -ఉన్న, విక్షేప మనబడును. లయవిక్షేపములు లేకున్నను కీర్తనాదుల నొనర్చు సామర్థ్య మభావమైన, అప్రతిపత్తి యనబడును. ఈ సాధనాసమయమున క్రోధలోభగర్వాదుల సంస్కారము లేచిన, కాషాయ మనబడును. విషయరసము భజన నాటంకపరచు స్థితియే రసాస్వాదము.

ఈ అర్థద్వయ మన్నియును భగవద్భజనవలననే విఘాతము లగునని నుడువుట పునరుక్తి.8 ఈస్థితియందు భక్తి ఆత్మసంప్రసాదిని యనబడును.

ఈ నిష్ఠ భక్తివర్తిని, అనుకూలవర్తిని యని ద్వివిధము. భక్తివర్తిని మరల స్థూలముగ కాయికము, వాచికము, మానసికము అని త్రివిధము. అమానిత్వ, మానదత్వ, దయాదిగుణశోభిత మగు నిష్ఠ అనుకూలవస్తు వర్తిని యనబడును.

శ్రవణాదులయందు యత్నప్రాబల్య మున్న నిష్ఠిత భక్తి యనియు, యత్నశైథిల్య మున్న అనిష్ఠిత భక్తి యనియు గ్రహింపనగును.

---

8. శృణ్వతాం స్వకథాః కృష్ణః పుణ్యశ్రవణ కీర్తనః హృద్యంతస్థో హ్యభద్రాణి విధునోతి సుహృత్ సతామ్. నష్టప్రాయే ష్వభద్రేషు నిత్యం భాగవతసేవయా, భగవ త్యుత్తమశ్లోకే భక్తి ర్భవతి నైష్ఠికీ.

—శ్రీమద్భాగవతమ్, ౧-౨-౧౭, ౧౮.

9. పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః.

10. కథాదిష్వితి గార్గ్యః.

11. ఆత్మరత్యవిరోధేనేతి శాండిల్యః.

12. చూ: నా. భ. సూ.

౬

పూర్వోక్తమగు భజన క్రియాభ్యాసమువలన నుద్దీపితమై, భక్తహృదయమున 'రుచి'జనించును. రుచియన శ్రవణ కీర్తనాదులకంటె అన్యతరములగు విషయములయెడ అరుచి. కనుక భజనసంబంధమగు ప్రీతియే రుచియని గ్రహణీయము.

ఈరుచి వస్తువైశిష్ట్యాపేక్షిణి, అనపేక్షిణి యని ద్వివిధము. భగవన్నామరూపగుణలీలాదుల వైశిష్ట్యమును, కీర్తనమాధుర్యమును, దేశకాలపాత్రద్రవ్యములను, ఆలంకారికధ్వన్యాదియుక్త మగు వాఙ్మాధుర్యమును స్వరుచిఅనుసారము అభిలషించుటయే వస్తువైశిష్ట్యాపేక్షిణి. క్షుధామాంద్యయుక్తుడు ఏమేమి వ్యంజనము లున్నవని ప్రశ్నించునట్లు. ఈ విషయముల నపేక్షింపక నామరూపాదిశ్రవణమాత్రముననే ఆవిర్భవించునది అనపేక్షిణీ రుచి.

భజనవిషయమగు ఈ రుచి భజనీయుడగు భగవంతుని విషయముగ నొనర్చుకొనిన, ఆసక్తి యనబడును. ఈఆసక్తియే అంతఃకరణ దర్పణమును పరిశుభ్రమొనర్చి భగవంతు డందు ప్రతిబింబించుటకు వీలొనర్చును.

తన భక్తిసూత్రములయందు నారదుడు పారాశర్య, గార్గ్య, శాండిల్యుల అభిప్రాయమును పేర్కొనియున్నాడు. పూజాదుల అనురాగము భక్తి యని పారాశర్యుడు.9 కథాశ్రవణమున అనురాగము భక్తియని గార్గి10. అవిరోధమగు ఆత్మరతియని శాండిల్యుడు.11 మఱియు నందే నారదుడు, ఈభక్తి గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయతాసక్తులరూపమున ప్రకాశించు ననినాడు. నారదుడు మొత్తము మీది పదకొండురూపములుగ భక్తి ప్రకాశించు ననినాడు. అందులో నివి ఆరువిధములు. 12

స్థూలముగ ఇంతవరకు వైధీభక్తియొక్క రాజ్యమని గీటు గీయవచ్చును. పారాశర్య, శాండిల్య, గార్గ్యల నిర్వచనమును, ఈ షడ్విధప్రకాశములును గూడ ఏతదంతర్గతములే యగునని ఊహచేయగలము.

'రుచి'యందు మనస్సును ఇతరవిషయముల నుండి మరల్చి, భగవత్పాదపద్మములకు గట్టవలసి యుండును. 'ఆసక్తి'యందు ఈశ్వరధ్యానమున విచ్ఛేద ముండదు. 'రుచి' యందు చాలసేపు ఉండినను విచ్ఛేద మగును.

ఈ ఆసక్తియే పరమపరిణామము నంది (దృఢమై) రతి, లేక భావ మనబడును. ఈరతియే భక్తికల్పలతయొక్క ఉత్ఫుల్లపుష్పము. ఈ భావకుసుమ పరిమళమే ఈశ్వరుని ఆహ్వానించును. ఇందు బాహ్యదశ, అర్ధబాహ్యదశ, అంతర్దశ (భావసమాధి) అని మూడు అంతరువు లున్నవి.

ఈ భావావస్థయందే సాక్షాత్ భగవ ద్దర్శన స్పర్శనములు లభించును. అప్పుడు భక్తుడు భగవత్సంగ వియోగఫలము లగు హర్ష విషాదములవలన కలిగిన సంచారీ భావములచే నలంకృతుడై, లోకచక్షువున కంతర్హితుడై యుండును. ఈ స్థితినే రాగానుగ భక్తి యని చెప్పగలము. నారదుడు 'సా కస్మై పరమప్రేమస్వరూపా' (నా. భ. సూ. ౨.) అనియు, శాండిల్యుడు 'సా పరానురక్తి రీశ్వరే' (శాం. భ. సూ. ౨) అనియు సూచించిన దీ భక్తినిగురించియే.

ఈ భావము (రతి) రాగభక్త్యుత్థము, వైధీభక్త్యుత్థము అని ద్వివిధము. మొదటిది ఈశ్వర ఐశ్వర్యజ్ఞానగంధశూన్యమై ప్రగాఢమై యుండును. రెండవది ఐశ్వర్యజ్ఞానయుక్తమై కించిత్తు న్యూనమై యుండును. ఈ భక్తులిద్దరును విభిన్న మగు మాధుర్యమును ఆస్వాదించుచుందురు.

ఈస్థితిని ప్రాపించిన భక్తియందు మరల అహైతుకి, ఉజ్ఝిత, జ్ఞాన, శుద్ధము అని అవాంతరవిభాగము లున్నవి. ఈశ్వరునినుండి ఎద్దానిని అభిలషింపకయే, మనస్సును అర్పించుట అహైతుకీ భక్తి. దీనికి ప్రహ్లాదుడు దృష్టాంతము. ఉజ్ఝితభక్తియందు శరీరము సంపూర్ణముగ విస్మృతమై, సర్వత్ర ఈశ్వరస్ఫూర్తి దృష్టమగును. వంశవనమును గాంచి బృందావనము, నదిని గాంచి యమున, తమాలవృక్షమును గాంచి శ్రీ కృష్ణుడే యను ప్రత్యయము శ్రీ చైతన్యదేవునకు కలిగెడిది. ఇయ్యదియే ఉజ్ఝిత భక్తి. 'ఈయన శ్రీ కృష్ణుడు' అని కాని, 'ఈయాస్థలముల ఈయాలీలలు జరిగినవి' అని కాని వినినతరువాత, అనగా తత్సంబంధమగు జ్ఞానము కలిగినతరువాత భక్తి లభించిన దానిని జ్ఞానభక్తి యందురు. భగవత్ప్రీతికరములగు కార్యములనుగాక జీవితమున మఱి నిర్వహింపదగిన దేమియు లేకున్న, ఆస్థితి శుద్ధభక్తి యనబడును. గోపబాలకులు శ్రీకృష్ణుని కెట్టి కష్టము కలుగకుండ జూచెడువారు. ప్రేమభక్తియందు ఈశ్వరుడే పతిగ భావింపబడును.

ఈభక్తులు శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మాధుర్యభావముల నాశ్రయించి పంచవిధములుగ జెప్పబడుదురు. 13 ఈ భావపంచకము విభావ, అనుభావ, వ్యభిచారిభావములతో గూడి స్థాయిభావము నంది, శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, ఉజ్జ్వల రసములుగ పరిణతినందును. ఈ రసము లన్నియును వ్రజేంద్రనందనుడగు శ్రీకృష్ణునియందే పరాకాష్ఠ నందుచున్నవి. అప్పు డియ్యది ప్రేమ యనబడును. ఇట అష్టవిధములగు సాత్త్వికవికారము లుండును. 14

ఈ ప్రేమ సమర్థ, సమంజస, సాధారణి, ఏకాంగి అని చతుర్విధము. తనకు సుఖము లభించినను లభింపకపోయినను, ప్రభువు సుఖముగ నున్న చాలు ననుకొనుట సమర్థప్రేమ. దీనికి దృష్టాంతము శ్రీరాధిక. ప్రేమాస్పదుని బొంది ఇరువురము సుఖింత మనుకొనుట సమంజస. గోపికలు దీని కుదాహరణము. ప్రభుసుఖము నంతగ లెక్కచేయక నేను సుఖముగ నున్న చాలు ననుకొనుట సాధారణి. చంద్రావళి దీని

---

13. నారదుని దాస్య, సఖ్య, వాత్సల్య, కాంతాసక్తులతో వీనిని బోల్పనగును.

14. యేచిత్తం తనూంచ క్షోభయంతి, తే సాత్త్వికాః, తే అష్టౌ. స్తంభ, స్వేద, రోమాంచ, స్వరభేద, వేపథు, వైవర్ణ్యాశ్రు ప్రలయాః ఇతి. తే ధూమాయితా జ్వలితా దీప్తా ఉద్దీప్తాః సుదీప్తా ఇతి పంచవిధా యథోత్తర సుఖదాః స్యుః.

(శ్రీరామకృష్ణలీలాప్రసంగకారు డుదాహరించినది)

కుదాహరణము. ప్రేమ ఒకేవైపున నుండుట, అనగా ప్రేమించినవానిచే మరల ప్రేమింపబడకుండుట ఏకాంగి.

౭

నదు లన్నియును సముద్రమున గలియునట్లు, రసముల పరిణతి కృష్ణభక్తిరసమున. ఏదోయొకతీరుగ కృష్ణభక్తికి తోడ్పడనిది రసముకాదు. దానిని వైష్ణవ ఆలంకారికులు రస మనరు. కృష్ణానురాగవ్యతీతమగు అనుభూతి రసము కాదు.

సాహిత్యదర్పణకారుడగు విశ్వనాథ కవిరాజు-

"విభావే నానుభావేన
వ్యక్తః సంచారిణా తథా,
రసతా మేతి రత్యాదిః
స్థాయీ భావః సచేతసామ్."

అని వచించియుండెను. ఇట సూచింపబడిన ప్రేమ నాయికానాయకుల మధ్యనే ఆబద్ధము. వీరు మనుష్య మాత్రులు. అథవా, సంపూర్ణముగ నరత్వమును బొందిన దేవతలు. దీనిని ప్రేమ యనుటకంటె కామ మనుటయే మేలు. ఈ కామవృత్తి నవలంబన మొనర్చుకొనియే సంస్కృతకవులు కావ్యనాటకములను నిర్మించిరి. (అటనట దీనికి వ్యతిక్రమ మున్న నుండవచ్చును.) ఈ కామమునే లోకమున ప్రేమ యని హర్షించుచుందురు. మఱి కొందఱు స్వదారేతరప్రేమ (?) ను గర్హించి, స్వదారనిష్ఠితమగుదానిని పరమపవిత్రమగు ప్రేమ యని ఉటంకింతురు.

వైష్ణవ గోస్వాము లిద్దాని నొప్పరు. బాహ్యజ్ఞానవిరహితమును, సంపూర్ణముగ భగవంతుని పట్ల ప్రయుక్తమును నగు రతి, లేక భావమే వారి లక్ష్యము. మనుష్యులపట్ల మనుష్యుల కుండు అంధమోహమును వారు ఈసడింతురు. వారు కోరునది బ్రహ్మరసాస్వాదము. 'రసో వై సః' ఇదియే వారి రసము.

" విభావై రనుభావైశ్చ
సాత్త్వికై ర్వ్యభిచారిభిః,
స్వాద్యత్వం హృది భక్తానా
మానీతా శ్రవణాదిభిః.
ఏషా కృష్ణరతిః స్థాయీ
భావో భక్తిరసో భవేత్. " [భ. ర. సిం.]

శ్రీకృష్ణరతి యను స్థాయిభావము శ్రవణాదులవలన పోషితమై, విభావ అనుభావ సాత్త్విక వ్యభిచారి భావములుగ భక్తహృదయమున దోచి స్థాయిభావమై భక్తిరస మగును. ఈ కృష్ణభక్తిరసము 'స్నేహము' తో నారంభమై, మాన, ప్రణయ, రాగ, అనురాగ, భావ, మహాభావములుగ పరిణతి నందును. మహాభావమున రూఢము, అధిరూఢము అని రెండు భేదము లున్నవి. అధిరూఢము మరల మోదన మాదనము లని ద్వివిధము. ఈ మహాభావము పరాకాష్ఠ నందిన దివ్యోన్మాద మనబడును.15 ఇదియే నారదుడు సూచించిన 'పరమవిరహాసక్తి.'

ప్రేమ అధికతరముగ గాఢమై హృదయమును ద్రవీభూత మొనర్చిన స్నేహ మనబడును. స్నేహము దృఢమై నవమాధుర్యము ననుభవింపజేయుచు, బయటికి కొంకింత కటువుగ తోచిన మాన మనబడును. మానము వృద్ధినంది, ప్రియునితో నభేదబుద్ధిని కలిగింప ప్రణయ మనబడును. మానము పెంపొంది, కృష్ణసంగ కారణము దుఃఖప్రదము, సుఖకరముగూడ నని తోచిన రాగ మనబడును. రాగము ఉత్కర్ష నంది, ప్రియతముడు సర్వదా అనుభూతు డగుచున్నను, అతనిని "తదేవ రమ్యం రుచిరం నవం నవమ్". అను రీతిగ, క్రొంగ్రొత్తగ తోపింపజేసిన అనురాగ మనబడును. ఈ అనురాగము రాగముగనే యుండియు 'మహాభావము' యొక్క చిహ్నముల దాల్చిన భావ మనబడును. ఈ

15. భక్తి పూర్వమునుండి సాధనగ అంగీకరింపబడియున్నది కాని, దానిని రసముగ గ్రహించినవారు కనపడరు. ఈ భావ, రస నిర్వచనము సంపూర్ణముగ గౌడీయ గోస్వాముల సంపత్తి (Private Property). ఈ క్రింది శ్లోకమును గమనింప నగును:

" భక్తిః పూర్వైః శ్రితా, తాస్తు
రసం పశ్యేద్ యదాత్తధీః,
తం నౌమి సతతం రూప
నామ ప్రియజనం హరేః ". [ము.కౌ.౧.

స్తరముల నన్నిటిని గర్భీకృత మొనర్చుకొనిన ప్రేమయే మహాభావము. మహాభావమే ప్రేమయొక్క తుది. దీనితోడనే ప్రేమయొక్క గతి ఆగిపోవును.[16]

శ్రీ రాధికమాత్రమే ఈ మహాభావమునకు అధికారిణి. శ్రీకృష్ణుని తదితర భార్యలకుగాని, శ్రీ రాధికయొక్క సఖులనబడు లలితా, విశాఖా, సుచిత్రా, ఇందులేఖా, చంపకవల్లీ, శ్రీ రంగదేవీ, తుంగవిద్యా, సుదేవీ, అనంగమంజరులకుగాని అధికారము లేదు. మనుష్యమాత్రులమాట వేరుగ చెప్ప నక్కరలేదు! జీవుల కధికారము భక్తి, భావము, మఱి లభించిన ప్రేమవఱకే. ఇహలోకమున జీవు డాకాంక్షింపదగిన మితి ఇంతవఱకు.

అసంఖ్యములగు బ్రహ్మాండము లున్నవి. వాటియందు క్రమముగ శ్రీకృష్ణుని 'ప్రకటలీల'[17] జరుగుచుండును. అట కీజీవులు శరీరపాతానంతర మరిగి దానిని బడయగలరు. పాంచభౌతికశరీరము మహాభావము యొక్క వేగమునకు–అంతవఱకు ఎందులకు? ఒక్క భావము ప్రకాశించినను–ఆగలేదు. తుత్తునియ లైపోవును. కనుకనే, శ్రీ రఘునాథగోస్వామి రాధికను, 'మహాభావోజ్జ్వలచింతారత్నోద్భావిత విగ్రహామ్'[18] ని వర్ణించినాడు.

కాని, మహాభావమూర్తియగు శ్రీచైతన్యదేవుని యందుకూడ నిత్యాది వికసించినది. ఆధునికుడును, సర్వధర్మసమన్వయమూర్తియును నగు శ్రీరామకృష్ణ పరమహంసయందుగూడ దీని వికాసమును గాంచి, వైష్ణవాచరణు డను పండితుడును, ఆయన గురువుగ ఎన్నుకొనిన భైరవీబ్రాహ్మణియును, బృందావనము నందలి గంగామాతయును ఆశ్చర్యపడి, ఆయనను అవతారపురుషునిగా ప్రకటించియుండిరి.

స్నేహమునుండి మహాభావమువఱకు గల అంతరువు లన్నియు స్థాయిభావములు. విభావ, అనుభావ, సాత్త్విక, వ్యభిచారిభావములతో గలసి ఇవి రసత్వము నందును.

ఈ కృష్ణభక్తిరసము శాంత దాస్య సఖ్య వాత్సల్య మధురము లను ఐదు ముఖ్య రసములుగను, హాస్య అద్భుత వీర కరుణ రౌద్ర బీభత్సభయానకము లను సప్త గౌణరసములుగను విభజింపబడినది. ముఖ్యములగు పంచరసములు భక్తులహృదయమున నెలకొనియుండును. గౌణరసములు ఆగంతుకములు.

ఐశ్వర్యజ్ఞాన మిశ్రరతి, కేవలరతి యని మఱియొక విభాగము. శ్రీకృష్ణుని వైకుంఠాధిపతిగను, సృష్టిస్థిత్యాది అలౌకిక కార్యనిర్వాహకునిగను భావించుట మిశ్రరతి. ఈ ఐశ్వర్యజ్ఞానమువలన చిత్తము సంకుచిత మగును. భయాశ్చర్యములకు తా వున్నది. శాంతభక్తు లిట్టివారు. వీరి ఉనికి వైకుంఠమునసే. గోకులాధిపతిగ భావించుట కేవల రతి. ఇట అంతరంగము సంపూర్ణముగ కృష్ణోన్ముఖ మగును.

దాస్యరతియందు స్నేహ, మాన, ప్రణయ, రాగము లుండును. సఖ్యరతి అనురాగమువఱకు నడచును. వాత్సల్యరతియందు అనురాగము పరిపక్వత నందును. మధురరతియందు ఇవన్నియును జేరి, మహాభావ మగును. శాంతరతియందు ఇం దేదియు నుండదు.

౪

ఇక ఈ రసములను గుఱించి వేర్వేరుగ ఒకింత ఆలోచింతము. శాంతరస మన నేమి?

"విహాయ విషయోన్ముఖ్యంనిజానందస్థితి ర్యతః,
ఆత్మనః కథ్యతే సోఽత్ర స్వభావశమ ఇత్యసౌ.

---

16. ఈ క్రమమును శ్రీరూపగోస్వామి స్వవిరచితమగు 'ఉజ్జ్వలనీలమణి' యను గ్రంథమున విశదీకరించియున్నాడు. ఈ పుస్తకమును బొంబాయి నిర్ణయసాగరప్రెస్సువారు జీవగోస్వామిటీకతో వెలువరించియున్నారు.

17. లీల ప్రకటము, అప్రకటము అని రెండువిధములు. ప్రకటలీల యన, సాక్షాత్తుగ శ్రీకృష్ణుడే లీలను సల్పుచుండుట, భక్తుని నయనగోచరమగుట. అప్రకటలీల యన, ఆయావిషయములను భక్తుడు ధ్యాననేత్రమున గాంచుట. ఈ విషయమును శ్రీ కృష్ణదాస్ కవిరాజు తన 'చైతన్యచరితామృతము'న జెప్పెను.

18. ప్రేమాంభోజమకరందస్తవరాజః

ప్రాయః శమప్రధానానాంమమతా గంధవర్జితా,
పరమాత్మతయా కృష్ణేజాతా శాంతీరతిర్మతా."
[భ. ర. సిం.]

మనస్సు విషయస్పృహను పరిత్యజించి, నిజానందమున నెలయుట శమము. ఇయ్యది ప్రాయికముగ శమప్రధాను లగువారియందు, శ్రీకృష్ణుని పరమాత్మగ భావించుటవలన నుత్పన్నమగును. ప్రేమయందు దుండు మమత్వబుద్ధి దీని లోటువడను.

ఈ శాంతభక్తి రసమునకు పరబ్రహ్మముగ తోచు చతుర్భుజధారియగు శ్రీకృష్ణుడు విషయాలంబనము. ముక్తిని బొందగోరు ఋషులు ఆశ్రయాలంబనము. మహోపనిషచ్ఛ్రవణము, నిర్జనస్థాననిషేవణము మున్నగునవి ఉద్దీపన. శాంతరసమునకుదాహరణ:

"కదా శైలద్రోణ్యాం పృథులవిటపీక్రోడవసతి
ర్వసానః కౌపీనం రచితఫలకందాశనరుచిః,
హృది ధ్యాయన్ ధ్యాయన్ ముహు రిహ ముకుందాభిధ మహం
చిదానందం జ్యోతిః క్షణమివ వినేష్యామి రజనీః"

బ్రహ్మర్షులు,అద్వైతసన్న్యాసులు శాంతభక్తులు.

ఈ శాంతరసమును శాంతశాంతము, శాంత దాస్యము, శాంతసఖ్యము, శాంతవాత్సల్యము, శాంత మధురము అని మఱి యైదు విభాగములుగ నొనర్పవచ్చును. వాని తీరును సంగ్రహముగ చెప్పుచున్నాను.

శాంతశాంతమున భయముతో గూడిన శ్రద్ధ, శాంతదాస్యమున పాలనకర్త యను భావముతో నిర్వివాదముగ సేవించుట, శాంతసఖ్యమున పరస్పరవాక్యాలాపము, శాంతవాత్సల్యమున ప్రతిపాలనాభావము, శాంతమధురమున కృతజ్ఞతాజనిత మగు అనిర్వచనీయభావము క్రమముగ నెలయుచుండును.

శాంతరసము శాంతశాంతముతో నారంభమై శాంతమాధుర్యమున పర్యాప్త మగుచున్నది. ఇట్లే, తదితరరసముల పట్లగూడ గ్రహింపనగును.

దాస్యరసమును 'ప్రీతి' యనికూడ చెప్పుదురు. దీని లక్షణము:

"స్వస్మాద్ భవంతి యే న్యూనా
స్తేఽనుగ్రాహ్యా హరే ర్మతాః,
ఆరాధ్యత్వాత్మికా తేషాం
రతిః ప్రీతి రితీరితా,
తత్రాసక్తికృ దన్యత్ర
ప్రీతిసంహారిణీ హ్యసౌ." [భ. ర. సిం.]

తమ్ము హరికంటె తక్కువగ తలచుకొనువారు హరి అనుగ్రహమునకు పాత్రులు. వీరి రతి కృష్ణుడారాధ్యు డను జ్ఞానముతో కూడుకొనినది. ఇదియే ప్రీతి దాస్యము. కృష్ణుని ప్రతి ప్రీతి, తదితర విషయముల పై ముఖ్యము దీని లక్షణము.

దాస్యభక్తిరసమున సర్వగుణాధారు డగు శ్రీకృష్ణుడు విషయాలంబనము; హరిదాసులు ఆశ్రయాలంబనము; భగవంతుని చరణధూళి, భుక్తావశిష్టమగు ప్రసాదమును గ్రహించుట, భక్తసంగము మున్నగునవి ఉద్దీపనలు. ఈ దాస్యరసమున శాంతరసమునందలి గుణము లన్నియును ఉండును. అధికముగ ప్రభుజ్ఞానమున 'సేవ' నొనర్చుట కూడ నుండును.

ఉదాహరణ:

"ధిగశుచి మవినీతం నిర్దయం మా మలజ్జం
పరమపురుష యోఽహం యోగి వర్యాగ్రగణ్యైః,
విధిశివసనకాద్యై ర్ధ్యాతు మత్యంతదూరం
తవ పరిజనభావం కామయే కామవృత్తః"
—స్తోత్రరత్నమ్, ౪౭

మఱియు నందే—

"తవ దాస్యసుఖైకసంగినాం
భవనే ష్వస్త్వపి కీటజన్మ మే,
ఇతరావసథేషు మాస్మభూ
దపి మే జన్మ చతుర్ముఖాత్మనా." [౫౫]

హనుమంతుడు మున్నగువారు దాస్యభక్తులు.

దాస్యశాంతము, దాస్యదాస్యము, దాస్యసఖ్యము, దాస్యవాత్సల్యము, దాస్యమధురము అనునవి దాస్యరసాంతర్గతములు. దాస్యశాంతమున భయముతో ప్రభుని ఆజ్ఞ నిర్వహించుట, దాస్యదాస్యమున ప్రభుని మనస్సును మెప్పింప వ్యగ్రతతో

శ్యామల తన మొదటిభర్తను మరచిపోయింది. చచ్చిపోయాడనుకుంది. ఆవిషయాన్ని తరచబోకు. నాకు మళ్లీ జ్ఞాపకంచేయబోకు. నువ్వు నారామ్‌కు స్నేహితుడవు. అలా వచ్చావు, అలా వెళ్లిపో"

ఇంతలోకే రామ్ స్నానం పూర్తిచేసి మమ్మ కలుసుకొన్నాడు. మేమిద్దరం యింటికి చేరాం. అతడు తన బసకు వెళ్లిపోయాడు.

మర్నాడు మధ్యాహ్నం రెండుగంట లయింది. వుదయం పదిగంటలకు కాలేజీకి వెళ్లాడు రామ్. ఒంటరిగా రుమాలు అల్లుతూ కూచున్నాను. వాకిట్లో బూట్లుచప్పుడు వినబడ్డది. "రామ్!" అంటూ ద్వారం తోసుకు లోపలికి వచ్చాడు మోహన్!

"రామ్ లేడూ?"

"ఇవ్వాళ కాలేజీ వుందని తెలియదూ?"

"అరే, మరచిపోయాను"

అబద్ధమాడుతున్నాడని గ్రహించాను. ఒక కుర్చీ వుంటే లాక్కొని కూర్చున్నాడు. దీర్ఘంగా నావంక రెండు నిమిషాలు చూశాడు.

"శ్యామలా, నీవు నాభార్యవు. రామ్‌ను చేసుకోడానికి నీకు హక్కు లేదు. హిందూధర్మ..."

"మోహన్, నువ్వు అనవసరంగా మాట్లాడుతున్నావు. నీకు నిన్ననే చెప్పాను-నాపైన ఆశ వదలుకోమని. నాభర్త లేని సమయంలో నీ విక్కడ వుండటం నా కిష్టంలేదు. మళ్లా అయిదుగంటలకు రా, మనమంతా కలిసి మాట్లాడుకోవచ్చు"

"నేను మళ్లీ యీయింటికి రాదలచుకోలేదు. ఇదే ఆఖరుసారి. కాని, నువ్వు నాతో వచ్చేయాలి."

"మోహన్, నువ్వు యీయింట్లోనుంచి తక్షణం లేచిపో"

"నేను వెళ్లను"

"నేను రామ్‌తో చెప్తాను"

నా బెదరింపు అతడు నిర్లక్ష్యంచేశాడు. పైగా వికృతంగా నవ్వి "నేనూ చెప్తాను. ఏం చెప్తానో తెలుసా? శ్యామల నాదనీ, నేను ఆమె మొదటిభర్తననీ చెప్తాను. తనకు నీమీద హక్కు లేదని చెప్తాను. నా సొమ్ము నాకిచ్చివేయమని అడుగుతాను."

"మోహన్!"

అతని మాటలు నాకు శూలాల్లాగా పొడుచుకున్నాయి. రామ్‌కు యింతవరకూ యీరహస్యం తెలియకుండా దాచాను. రామ్‌కు యీసంగతి తెలిస్తే యేమనుకుంటాడు! తన్ను ద్రోహం చేశానని అనుకోడూ? ఎంత మంచివాడయినా యిట్టి అవమానాన్ని భరించగలడా? రామ్‌ను నేను ప్రేమించాను. అతడు నా అంధకారజీవితంలో ప్రణయజ్యోతిని వెలిగించాడు. మే మిద్దరం హాయిగా జీవితాన్ని గడిపాం. మా నిర్మల సరోవరంలో నేడు యీ తుచ్ఛుడు బడబాగ్ని వేయడానికి సిద్ధపడ్డాడు. అతని ముఖం చూస్తే పులి నోట్లో లేడిని పెట్టుకొని "ఏం చేస్తావు?" అన్నట్లుంది. అతన్ని బెదిరించి లాభం లేకపోయింది. నేను బెదిరిస్తే మోహన్ తప్పక యీ విషమరహస్యాన్ని బయలుపెట్టేటట్లు వున్నాడు.

"మోహన్! యిప్పుడు మనం అయిపోయిందానికై విచారిస్తే యేం లాభం చెప్పు. నన్ను ప్రేమించి పెళ్లాడిన రామ్‌ను యెలా వదిలిపెడతాను చెప్పు. అత నేమనుకుంటాడు? అయినా నన్నావిధంగా తృణీకరించిన నీవు మళ్లా యేముఖం పెట్టుకొని నన్నడుగుతావు?"

మోహన్ బతిమాలటం మాని పట్టుదలలోకి దిగాడు.

"అయిపోయిం దేదో అయిపోయింది. నేడు నేను నీవాణ్ణి. మన మిద్దరం కలిసి యెక్కడకో వెళ్లిపోదాం. సామాన్యంగా నీయిష్టం నీదని అతను వూరుకుంటాడు. వూరుకోక వెంబడిస్తే ఉన్న సంగతి చెప్పేదాం. వచ్చినదారిన వెళ్లిపోతాడు."

"మోహన్! నువ్వు నన్ననవసరంగా తొందర చేస్తున్నావు. నాకు టైమివ్వు, అంతదాకా నే నేం చెప్పలేను."

"శ్యామలా...ఎంత తొందరగా అయితే..."

రామ్ వచ్చాడు.

రామ్ వచ్చేటప్పటికి మోహన్ నాకు చాలా సమీపములో వున్నాడు. మా మాటల సందడిలో అడుగుల చప్పుడుకూడా మాకు వినబడలేదు. అతడు హఠాత్తుగా రావడం చూసి మేము కొంతవరకు గాభరా పడ్డాం. మోహన్ దూరంగా వెళ్లిపోయాడు. రామ్ యివన్నీ నోటు చేశాడని గ్రహించాను. ఆ సాయంకాలం చాలా రిజర్వ్‌డుగా వున్నాడు. మోహన్ ఒక గంటసేపు వుండి, తర్వాత పని వుందని వెళ్లిపోయాడు.

నేనూ, రామ్ బీచికి వెళ్లాం. ఆసాయంత్రం ఒకరినొకరు మాట్లాడించుకోలేదు. రాత్రి భోజనా లయినయి. తాంబూలం వారి చేతి కిచ్చాను. అది అందుకుంటూ యిలా అన్నారు: "శ్యామలా, నువ్వు మోహన్‌ను యిదివరకు యెరుగుదువా?" చాలా శాంతంగా అడిగారు యీ ప్రశ్న. ఆ శాంతమే నాహృదయాన్నంతా కలికివేసినట్లు వుంది. రామ్‌కూడా యేదో యమబాధ పడ్డట్లు కనబడుతున్నాడు. అతనిలో అనుమానపిశాచం పనిచేస్తోంది. చివరకు యిలా సమాధానం చెప్పాను:

"ఎందుకలా అనుకున్నారు?"

"మొదటినుంచీ నా కనుమానంగానే వుంది, మొదటిసారి మీరు ఒకర్ని ఒకరు చూచినప్పుడు ఎవరో చిరపరిచితులను చూచినట్లు గాభరా పడ్డారు. తర్వాత యివ్వాళ సాయంకాలం మోహన్ వచ్చింది నాకోసంకాక నీకోసమని తెలుస్తూవుంది."

"మీ అనుమానాలకు ఆధారం లేదు."

"ఎందుకని?"

ఉలిక్కిపడ్డాను. ఆ ఒక్క మాటలో ఈర్ష్య, అసూయ, కోపం అన్నీ యిమిడివున్నయి. నేను సమాధాన మివ్వలేదు. అంతటితో మా సంభాషణ పూర్తయింది.

మర్నాడు రెండు గంటలకు "శ్యామలా!" అంటూ మాట వినబడ్డది. క్రిందకు దిగి వెళ్లబోయాను. రామ్ నన్ను ఆపి "వుండు. అతన్ని రానియ్యి" అన్నాడు. మేడమె క్కెక్కుతూ "శ్యామలా" అన్నాడు. పలకలేదు. మేమున్న తలుపు తోసుకొని—

"శ్యామ...రామ్! కాలేజీకి వెళ్లలేదూ?"

రామ్ మాట్లాడలేదు. నే నన్నాను:

"అవును. యివ్వాళ తలకాయ నెప్పిగా వుంటే కాలేజీకి సెలవు పెట్టారు!"

"అరె, నాకు తెలిసిందిగాదు."

తొందరలో అన్నా డీ మాట. తర్వాత నాలుక కొరుక్కున్నాడు. రామ్ తీక్ష్ణంగా చూశాడు నావంక.

"ఇప్పు డెలా వుంది?"

"కొంచెం నయం."

ముగ్గురం నిశ్శబ్దంగా అయిదు నిమిషాలు కూచున్నాం. ఎవరు ఏవిషయం మాట్లాడాలో తెలిసింది కాదు. నేను కాఫీ పెట్టడానికి కిందకు పోయాను. కాఫీ పెడుతూవుంటే నాకు పైన అరుపులూ, కేకలూ వినబడ్డాయి. పరిగెత్తుకొని పైకి వెళ్లాను, ఇద్దరూ కొట్టుకుంటున్నారు. బలహీను డవడంచేత రామ్‌ను క్రింద పడవేశాడు మోహన్. అలా నొక్కి కూచున్నాడు.

"మోహన్!"

నన్ను చూచి లేచాడు. రామ్ లేచి తలవంచుకున్నాడు. మోహన్‌ను బయటకు సాగనంపాను.

"చెప్పావా?"

"ఇంకా లేదు."

హృదయం కుదటబడ్డది. తలుపు వేసి పైకి వెళ్లాను. రామ్ మామూలుగా మంచంమీద పడుకున్నాడు. క్రిందకు వెళ్లి కాఫీ తయారుచేసి తీసుకువచ్చి యిచ్చాను. కాఫీ తీసుకొని ముఖం రెండవవేపు తిప్పుకొని పడుకున్నాడు. కదిలిస్తే ఎక్కడ హుంకరిస్తాడోనని భయమేసింది.

రెండురోజులు కాలేజీకి వెళ్లలేదు. భగవంతుని దయవల్ల మోహన్‌కూడా మ్యాయింటిచాయల రాలేదు. ఆ మర్నాడు కాలేజీకి వెళ్లాడు. పదకొండు గంటలయింది. వాకిటి ముందు కారుచప్పు డయింది. "శ్యామలా!"—మళ్లీ వచ్చాడు మోహన్.

"మోహన్! యింకా నన్నువల్లి వదల్లేదూ?"

"నేను రామ్‌కు చెప్పనందుకు నువ్వు చేసే సన్మానమా యిది?

"అది కాదు మోహన్, నా జీవితంలో నువ్వు రెండుసార్లు అడ్డుపడ్డావు. నాకై నే నెక్కువ విచారించను. కాని నీ మూలంగా రామ్‌కు మతికూడా పోయేటట్లుంది."

నవ్వుతూ అన్నాడు: "శ్యామలా? నువ్వు అనవసరంగా నామీద నింద మోపుతున్నావు. నిజమే—నిన్ను ప్రథమంలో విడిచిపెట్టటం నా తప్పే. కాని ఆ తప్పును పరిహరించడానికి నీ వెందుకు అంగీకరించవు? నిన్ను నేను మళ్లీ స్వీకరిస్తాను. నీ జీవితాన్ని మధురంగా చేస్తాను. నీ సుఖంకై నాశాయ శక్తులా పాటు పడతాను. నా మాట నమ్ము."

ఈ కల్లమాటలు నేను నమ్మడం లేదు. నమ్మక చేసేదీ లేదు. రామ్ నావంక జాలిగా చూస్తున్నాడు. అతన్ని నేను ప్రేమించాను. అతన్ని మనసారా కోరి పెళ్లి చేసుకున్నాను. అతన్ని నేను మోసపుచ్చలేను.

"మోహన్, నన్ను వదులుకో. నీతో నేను రాను."

జాలిగా- "రావూ?"

"రాను."

బెదిరిస్తూ—"రావూ? అవును, నువ్వు మంచి మాటలతో ఎందుకు ఒప్పుకుంటావు? రామ్‌తో యీవిషయం అటో యిటో తేల్చేస్తే మంచిది."

"మోహన్, నువ్వు రాక్షసుడవు. నీకు జాలీ లేదు, దయా లేదు!"

"నాపైన నీకు జాలి వుంటేగదా నీపైన నాకు వుండటానికి! అయినా యీ అనవసరపు మాటలతో వృథాగా కాలక్షేపం దేనికి? రాత్రి మూడుగంటలకు నేను కారుమీద మీయింటికి వస్తాను. అయిదుగంటలకు కలకత్తా పోయే ట్రెయిను వుంది. దానిపైన మనమిద్దరం వెళ్లిపోదాం. నువ్వు అలా రాకపోతే మర్నాడు వుదయం అన్నివిషయాలూ రామ్‌కు చెప్పేస్తాను"

"మోహన్, మోహన్!..."

నామాట వినిపించుకోకుండా కారుమీద వెళ్లిపోయాడు.

నిస్పృహతో యింట్లోకి వచ్చాను. కుర్చీలో కూచున్నానో లేదో, బయట చప్పుడు వినపడ్డది. లోపలికి వస్తున్నారు ఎవరు? మోహనా? కాదు రామ్!

"మన వాకిట్లో కారాగింది, ఎవరిది"

"లేదే!"

"లేదూ?"

"లేదు."

అంతే, మళ్లా అయిదు నిమిషాలదాకా మాటల్లేవు.

"యివ్వాళ మధ్యాహ్నమే వచ్చారేం?"

"ఈ పూట సెలవుపెట్టాను. తలకాయనెప్పి యెక్కువగా వుంది."

అబద్ధం! నన్ను పరీక్షచేద్దామని వచ్చారు. మధ్యాహ్నం కాఫీకాచి యిచ్చాను. తాగారు. ఏవో పంకజ మల్లిక్ ప్లేట్లుంటే ఫోను పెట్టాను. నెమ్మదిగా, హాయిగా పాడుతూవుంటే ఆ సంగీతం మాదుఃఖంవలె పొంగి వెల్లువయై పారుతున్నట్లనిపించింది. సాయంకాలం బీచికి బయలుదేరాము. మాట్లాడకుండానే ముందుకు నడిచాం. నామనస్సంతా ఖంగారుగా వుంది. ఆబీచివొడ్డున అనేకదంపతులు ఆనందంతో మాట్లాడుకుంటూవుంటే వాళ్లంతా మావంక చూచి వెక్కిరించినట్లనిపించింది. దూరంగా యిసుకతిన్నెలమీద నిశ్శబ్దంగా కూర్చొన్నాం. నాహృదయం అతన్ని మాట్లాడించటానికీ, అతన్ని నాదగ్గిరిగా చేర్చుకోడానికీ ఆరాటపడుతోంది. ఆ విచారముఖంతో, ఆ సముద్ర ఆకాశాలు బ్యాక్‌గ్రౌండుగా, రామ్ ఎంత అందంగా వున్నాడూ! ఆసముద్రం నాహృదయంవలె ఆరాటపడుతోంది. నాప్రియుడు నాకు దూరమౌతున్నట్లూ, మేఘాల్లో కలిసిపోతున్నట్లూ అనిపించింది. మోహన్ నన్ను యీడ్చుకువెళ్తున్నట్లూ, దూరంగా రామ్ కళ్లనీళ్లు పెట్టుకున్నట్లు అనిపించింది. రామ్‌ను మాట్లాడించకుండావుండలేకపోయాను. "రామ్...." మాట పెగిలిరావడంలేదు. మోహన్ నాగొంతు నులిమివేస్తున్నట్లనిపించింది. "రామ్! నన్ను నీవు ప్రేమించడం లేదూ?" రామ్ నావంకకు తిరిగాడు. కళ్లు ఎర్రగా

వున్నాయి. ఆసముద్రంముందు తన హృదయావేదన అంతా వెళ్లబోసుకొనివుంటాడు. పాపం ! అతడు నా వంక దయతో, జాలితో చూచాడు. ఒక్క నిమిషం. తర్వాత తన హృదయానికి నన్ను గట్టిగా అదుముకున్నాడు. ఆ పవిత్రసన్నివేశంలో నాహృదయం ఆగలేక బిగ్గరగా యేడ్చింది. ఇంటికి తిరిగివచ్చేశాం.

సావిట్లో గోడగడియారం టిక్కు టిక్కుమంటూ వుంది. ప్రతి సెకండూ ఒక బాణంలాగా నాహృదయంమీదగా దూసుకుపోతోంది. ఆ గడియారం "నేను ఆగను, నేను ఆగను" అంటూ నన్ను వెక్కిరిస్తోంది. "మూడుగంటలకు కారు తెచ్చి వుంచుతాను, నువ్వు రావాలి" అంటూ మోహన్ గర్జిస్తున్నాడు. రామ్ నా కిచ్చిన గాఢాలింగనం మరుపుకు రావడంలేదు. ఏదో యంత్రంరీతిగా పనులు చేశాను. ఏ పని చేద్దామన్నా చేయి రావడంలేదు. రామ్‌ను చూస్తే చాలు, నాహృదయం ఝల్లుమంటోంది. అతని అమాయకపు చూపులు మరుపుకు రావు. మోహన్ నన్ను ప్రేమించడంలేదు. అతనిలో ఈర్ష్యాభావం విజృంభించి వుంది. "తన సొమ్మును యితరులు అపహరించారే" అనే అహంభావత్వం అతనిలో యేర్పడింది. నా యొక్క కష్టాల్ని తన కాక సాకుగా యేర్పరచుకొని నామీద అధికారం చెలాయిద్దామని చూస్తున్నాడు. నేను వాని దాన్నయితే ... నన్ను గడ్డిపరకగా భావిస్తాడు. కాని అది అసంభవం.

నా హృదయంలో రామ్ ఒక్కనికే స్థానం వుంది. రక్షించినా, శిక్షించినా, నన్ను అనేక హింసలు పెట్టినా అచంచలమైన ప్రేమ. కరకుగొడ్డలితో కొట్టిన కిరాతకునకు గంధపుచెట్టు చక్కని సువాసననే యిస్తుంది. అలాంటి ప్రేమ నాది. కాని రామ్‌ప్రేమ అటువంటిది కాదు. రామ్ సామాన్య మానవుడు. నేను తనదాన్ని అవుతానుగదా అనే స్వలాభాపేక్షతో నన్ను ప్రేమించాడు. కాని, నాయందు విశ్వాస ముంచలేకపోయాడు. తన్ను ప్రేమించిన శ్యామల యితరులను కన్నెత్తయినా చూడదనే నమ్మకం అతనిలో లేదు. అందువల్లనే రామ్‌కు నిజం తెలుస్తుందేమోనని భయం. నేను మోహన్ భార్యననీ, అతడు విడిచిపెట్టడంవల్ల మళ్లీ పెళ్లిచేసుకున్నాననీ రామ్‌కు తెలుస్తే అతడు భరించలేని సత్యమది. ఒకవేళ తన యింటిలో వుండటానికి రామ్ అంగీకరించినా మేము వెనుకటివలె నిష్కల్మషంగా ప్రేమించలేము. వెనుకటివిషయాలు రాహువుల్లాగా మమ్ములను వెంటాడుతూనేవుంటాయి. అలాంటి జీవనం నరకంకంటే అన్యాయం. దానికంటే చావు.....

ఏమన్నాను? "చావువుత్తమం" అంటున్నాను గదూ. మూడు గంటలకు కారు వచ్చి ఆగుతుంది. నేను వెళ్లాలి. వెళ్లలేను. వెళ్లకపోతే మర్నాడు వుదయం మోహన్ వస్తాడు. వచ్చి రామ్‌కు అంతా చెప్పేస్తాడు. అప్పుడు రామ్ నావంక చూస్తాడు. ఆచూపులో వేయి నరకాలలో పడే బాధ వుంటుంది. అలాంటి చూపు నేను భరించగలనా? "ఇది నిజమేనా" అని నన్ను రామ్ అడిగితే నే నేమని జవాబు చెప్పాలి? మా యిద్దరిలో వున్న పాతపరిచయం యిదివరకే గ్రహించాడు. దానికే అతడు ఆగలేకుండావున్నాడు. ఇదికూడా బయటకు వస్తే తనతో వుండనిస్తాడా? "రామ్." "ఆ!" —ఎవ రామాట్లాడింది? కాదు, గడియారం అరగంట కొట్టింది. క్రిందకు వెళ్లి చూసివచ్చాను. పదకొండున్నర గంటలయింది. ఇక మూడున్నరగంట లుంది. ఏమిటి?

నాజీవితం. అవును. నన్ను ప్రేమించే తల్లీ, తండ్రీ ఇదివరకే గతించారు. నన్ను ప్రేమించే నా రామ్ రేపటితో నన్ను విసర్జిస్తాడు. మోహన్ నావంక చూసి వికృతంగా నవ్వి "వస్తావా, రావా?" అంటాడు. చివరకు నాగతి? నన్ను నానాహింసలూ పెట్టి, మంగళసూత్రం తెంపి, కాలిబూటుతో తన్నిన ఆమోహనే శరణ్యమా? ఛీ...

దూరంలో సముద్రపుహోరు వినిపిస్తోంది. మళ్లీ గడియారం పండ్రెండు గంటలు కొట్టింది. రామ్ కొంచెం మంచినీళ్లు తాగి నిదురించాడు. ఆ నిశ్శబ్దంలో బయట సముద్రపుఘోష, యింట్లో గడియారం టిక్ టిక్ ధ్వని స్పష్టంగా వినిపిస్తున్నాయి. గడియారపు ముల్లు నా హృదయంలో గిరగిరా తిరుగుతోంది. సముద్రపుఘోష యింకా స్పష్టంగా వినబడుతోంది. అదిగో, గంట. అదిగో మోత.

మంచంమీదనుంచి లేచాను. క్రిందకు దిగాను. మళ్లీ గంట కొట్టింది. టైము ఒంటిగంట. మెల్లిగా తలుపు తీశాను. మళ్లీ దగ్గరకు వేశాను. రోడ్డు నా ముందు నిదిరిస్తోంది. మెల్లగా నడిచి వెళ్లాను. కాళ్లు వెనక్కు పీకుతున్నయి. అవును. నా రామ్‌ను నేను విడిచి వెళ్లగలనా? అతడు నన్ను క్షమిస్తా డని నా అంతరాత్మ ఎక్కడో బోధిస్తూవుంది. కాని, దానిమీద ధైర్యం లేకపోయింది.

కాని, రామ్ నిజాన్ని యెలా గ్రహిస్తాడు? అతనికి తన శ్యామల యేమయిందో యెవరు చెప్తారు? నేనే చెప్పాలి. మళ్లీ యింటివేపు తిరిగాను. ఇక దాదాపు రెండుగంట లుంది. రామ్‌కు వుత్తరం రాయాలి. లోపలికి వెళ్లి, ఒక గదితలుపు తోసి, టేబిలుముందు కూర్చొని వుత్తరం రాశాను. అదే యీ వుత్తరం:

"ప్రియమైన రామ్ !

ఇదే నాజీవితగాథ. ఈ నా గాథను నీకు వ్రాయనట్లే రాశాను. నాజీవిత మనే నాటకరంగంలో నువ్వుకూడా ఒక పాత్రధారి వవడంచేత నిన్ను సంబోధించకుండానే యీ నాగాథను విపులపరచాను. నిన్ను విడిచి వెళ్లిన యీ నీ శ్యామలను మరచిపోకు. అదిగో సముద్రఘోష న న్నాహ్వానిస్తోంది. గంట రెండున్నరకు దాటిపోయింది. బయట వెళ్తూవున్న ప్రతికారూ మనయింటిముందు ఆగుతుందేమోనని భయంగావుంది. రామ్, నన్ను క్షమి చవూ? అదిగో...అదిగో సముద్రపు మోత..."

* * *

పొద్దుటూన మామూలువేళకు లేచాను. శ్యామల కాఫీ తెచ్చియిస్తుంది కదా అని అలాగే పడుకునివున్నాను. కాని ఎంతసేపటికీ శ్యామల అజ లేదు. సరే తప్పనిసరిగా లేవాలిసొచ్చింది. మేడ క్రిందకు దిగివచ్చాను. ఇంకా బద్ధకం పోలేదు. పని మనిషి గది ఊడుస్తోంది.

"ఏమే, శ్యామ లేదే?"

"ఏమో బాబూ! యింకా అమ్మగారు క్రిందకు రాలేదు."

"అయితే తలుపు తీసిం దెవరు?"

"నేను వచ్చేటప్పటికి అది తీసే వుంది బాబయ్యగారూ."

పైకి వెళ్లి చూశాను. ఎక్కడా కనబడలేదు. క్రిందకు వచ్చి మళ్లీ పనిచేసేదా న్నడిగాను.

"ఏమే, తలుపు తీసుందా?"

"అవును బాబూ."

"ఎక్కడకు వెళ్లివుంటుంది? ఆ మోహన్‌గాడితో ఏమైనా రాత్రివేళ వెళ్లిపోయిందా? నా శ్యామల అంత కృతఘ్నురా లనుకోను."

ఇంతలోకే నా కాపోలుమధ్య టేబిలుమీద పెద్ద కాగితాలకట్ట కనబడ్డది. దానిపైన ఫ్లవర్ పాట్ వుంది. ఆ కాగితాలకట్ట తీసి చూశాను. "రామ్‌కు" అని రాసి వుంది శ్యామలదస్తూరిలో. గబగబా తీసి చూశాను. దానిలో యిలా వుంది:

"ఇటు చూడండీ! దేనికండీ..."

ఆసాంతంగా చదివాను. నన్ను నేను నమ్మలేకపోయాను. శ్యామల—నా శ్యామల—నా హృదయం. ఎటువంటి శీలవతిని పోగొట్టుకున్నాను! ఆమెకు ఎంత ద్రోహం చేశాను! ఎంత అనుమానించాను! రెండు రాతి హృదయాలమధ్య నలిగిపోయింది ఆ నవనీతహృదయం.

వాకిటిలో చప్పుడయింది. మోహన్ వచ్చాడు. "శ్యామల వుందా?"-ఎంత ధైర్యంగా అడిగాడు! అతని ముఖాన ఆ కాగితాలకట్ట పారవేశి పైసి వెళ్లాను. అరగంటదాకా అలాగే నిశ్శబ్దంగా కూచున్నాను. దూరంగా వున్న సముద్రం నన్ను చూసి నవ్వుతోంది. నాశ్యామల ప్రతి అలలో, ప్రతిబిందులో వూగులాడుతోంది సంతోషంతో. ఆమెఅనిర్వచనీయమైన విచారం సముద్రఘోషలో వ్యక్త మాతోంది. అప్పుడప్పుడు శ్యామల ఆ సముద్రంలోనుండా తన జాలి చూపు నావంక ప్రసరిస్తోంది.

బయట కారుచప్పు డయింది. మోహన్ వెళ్లిపోయాడు. "మీ కాగితాల కట్ట యిదుగో బాబూ" అంటూ పనిమనిషి ఆ కాగితాలను నా చేతి కిచ్చింది. అవి నా హృదయానికి అదుముకొని ఏడ్చాను.

# కలగూరగంప

## శ్రీ వ్యాసాశ్రమము

చిత్తూరుమండలములో రేణిగుంటకును, శ్రీకాళహస్తికిని నడుమ ఏర్పేడుకు సుమారు మైలుదూరమున ఈయాశ్రమము వెలయుచున్నది. సుందరవనాలంకృత గిరుల దాపున, కనువిందొనరించు కేదారముల కుఱగట, రమణీయమైన ప్రకృతికి పుట్టినిల్లైన తావున, పవిత్రమై, ప్రవిమలమై, ప్రశాంతమైన వాతావరణమున నిది విలసిల్లుచున్నది. పూతభావపూరితమై, పురాణప్రసిద్ధమైన గుహలకున ప్రవేశించునట్లు ఇందు కాలిడినంతనే అపూర్వానుభూతినందు యాత్రికు డూహించును.

### జపాల మహోత్తరచరిత్ర :

ఇందు 'కాశీబుగ్గ'యనునొక తీర్థము కలదు. ఇది విశేషమాహాత్మ్యము గలదని హిందువులు విశ్వసింతురు. దీని వృత్తాంతము శివపురాణమున గలదు. ఈపురాణమున శ్రీకాళహస్తీశ్వరమాహాత్మ్యమునకు సంబంధించిన భాగమున, జపాలమహిమోదంతఘట్టమున నది రోమశ మహర్షి భరద్వాజమునికి తెలిగించినట్లు తెలుపబడినది. దానిని సంక్షేపముగ నిందు వివరింతును.

గర్గగోత్రమున పుట్టి నందియని ప్రతీతిపడసిన శివభక్తుడు శ్రీకాళహస్తిమూలలింగమునకు పడమర దెస కొలదిమైళ్లదూరమున గల కొండపై వసించుచుండెను. అతని భార్య జపాల మహామతియై, పతివ్రతయై యుండెను. నందికి వాసమైనదికావున పూర్వోక్త గిరి నందిపర్వత మని ప్రసిద్ధిబడసినది. కొంతకాలము కడచినపిదప ఆవిప్రుడు పరలోకమున కేగుచు, సహగమన మొనరింపరాదనియు, ఈశ్వర సేవ జేయుచుండు మనియు అర్ధాంగికి తెలిపెను. అతనియాజ్ఞను తలదాల్చి, జపాల వర్తించుచుండెను. నందిపర్వతమునకు దిగువ పద్మభూషితమై, విమల సలిలపూరితమైన ఒక సరస్సు కలదు. జపాల అందు స్నానమాచరించుచు, శివభక్తులను సేవించుచుండెను. ఆమె కావించు శివపూజకచ్చెరు వొంది కుమారస్వామి తొలుత శివభక్తుడైన కిరాతుని రూపముతోడను, పిదప నిజరూపముతోడను ఆమె ప్రమోల గోచరించెను. ప్రత్యక్షమైన స్వామి నామె పరమభక్తితో పూజించెను. సంతసించి అతడు వరము గోరుమనినపుడు సర్వతీర్థ స్వరూపమైన తీర్థమును తన నివాససమీపమున సృష్టింపు మని ఆమె కోరెను. అత డట్లే యొనరించెను. అది జపాలశక్తితీర్థ మనబరగెను. ఉత్తరాయణమున నది పెరుగుచు, దక్షిణాయనమున తరుగుచుండును. అనంతర మొకనాడు శ్రీకాళహస్తీశ్వరుడు ఆమె భక్తిప్రాభవమును కనుగొనదలచి, సాధువేషమున నామెయింటి కరిగెను. అతడు శివభక్తు డని తలచి, పీఠమున గూర్చుండబెట్టి, సపర్య లొనరించి జపాల మిక్కిలి వేడియైన పరమాన్నమును అతని పురిషిట బోసినదట! పాయసపు వేడికి బాధ నొందినట్లు నటించి "హరి హరీ!"యని హరు డఱచి, పాయసమును క్రింద విసరెనట! హరినామము చెవిబడినంతన నాభక్తురాలు మండిపడి వజ్రమువలె కఠినమైన గరిటతో బలముకొలది వాని శిరముపై గొట్టెనట! మహాదేవు డపుడు ఆమెవీరశైవవ్రతమునకు ప్రీతినంది, తక్షణమే శివలింగ మాయెనట! ఐదు వ్రయ్యలై రక్తసంసిక్తమైన ఆ లింగమును విలోకించి జపాల ఆశ్చర్యాన్వితయై, దానికి ప్రదక్షిణ మొనరించి, శివుని పూజించెనట! సంతుష్టాంతరంగు డైన శ్రీ కాళహస్తీశ్వరుడు రేవతీనక్షత్రయుక్త చైత్రబహుళ చతుర్దశీ గురువారమునాడు 'జ్ఞానాంబాలింగిత శరీ

రుద్రా'నట్లు ఆమెకు గోచరించెనట. శివుని సేవించి, వరములు కోరి ఆమె వానిని పడసెను. అనంతరము మహాదేవుడు దివ్యసౌందర్యసంశోభితయైన జపాలను తన విమానముపై నెక్కించుకొని కైలాసమునకు గొనిపోయెను.

జపాల తీర్థము 'కాశీబుగ్గ తీర్థ' మనియు వ్యవహరింపబడుచున్నది. శ్రీ వ్యాసాశ్రమమున కీ తీర్థము (ద్వంద్వనామముతో) పర్యాయపదమై యొప్పుచున్నది. ఇందు ప్రవేశించినపుడు యాత్రికుని హృదయము కైలాసమునకు సహపాఠి యగును.

## దీని భావమేమి? :

పూర్వోక్తకథ నించుక విమర్శకదృష్టితో వీక్షించుట తప్పుకాదు. జపాలానందులు శివనామము నుచ్చరించుచు, అన్యదేవనామము విననొల్లకుండిరని (శివాన్యదేవతానామకీర్తన శ్రవణాసహా) శివపురాణము తెలుపుచున్నది. శివభక్తులనే వారు సేవించుచుండిరని వాకొనుచున్నది. శ్రీహరిశబ్దము వినవచ్చినంతన 'మహామతి' యని ప్రశస్తినందిన జపాల భిక్షుని తల వ్రయ్యలొనరించినదట! భిన్నమౌళియైన చంద్రమౌళి ఆమెభక్తి కలరి, స్వస్వరూపముతో ఆమె మ్రోల సాక్షాత్కరించి, ఆమె కనేకవరము లొసగి, స్వీయవిమానమున నామెను కైలాసమునకు గొనిపోయె నను వృత్తాంతమును పరిశోధకులు నిశితదృష్టితో వీక్షింతురు. మహామతియైన భక్తురాలు శివుని భూషించి కేశవుని దూషించుననని కాని, శివుని సేవించి కేశవుని అవమానపఱచునని కాని ఎట్లు విశ్వసింతుము? అట్టి భక్తురాలు హరినామోచ్చారణమున మండిపడునా? వేఱునామములతో వఱలు భగవంతుని ఆమె నూచి సహింపదా? శ్రీ హరినామము చెవిబడినంతన సహనశక్తిని గోలుపోయి, దాని నుచ్చరించినవాని శిరమును తుక్కలొనరించునా? ఇట్టి చర్యను భగవంతుడు మెచ్చునా? అత్యాచార మొనరించినవారికి ఆదరానురాగములు ప్రసాదించుట కీశ్వరునకు సుసాధ్యమనుట నిక్కమే! అజ్ఞానమును, అవినీతిని భగవంతుడు ప్రశంసించి, వానిని ప్రదర్శించిన వ్యక్తికి వరము లొసగి, కైవల్యమును ప్రసాదించె నని హేతుశక్తిసమన్వితులు విశ్వసింపజాలరు. విశాలదృష్టినిగాని, విజ్ఞానదృష్టినిగాని అలవఱచుకొనక శ్రీ విష్ణువును, విష్ణునామమును, విష్ణుభక్తుని, విష్ణు నామోచ్చారణమును సహింపక విద్వేషముతో విజృంభించుచు, దోషాక్తహృదయులైనవారు కొందఱు మన నేలలో గోచరించిరి. ఇట్లే శివుని ద్వేషించువారును, శివనామోచ్చారణము చెవిబడినంతన క్రుద్ధులగువారును మన నేలయం దున్నారు. మహిమోపేతములైన పురాణగ్రంథములందు చిత్తమువచ్చినరీతిని వీరు చేతులుదూర్చియుందురు. తమ ప్రకృతికిని, ప్రత్యేకదృష్టికిని అనుకూలించులాగున కథాసృష్టి జేసి, పురాణగాథలందు చొప్పించియుందురు. కావుననే ఉద్గ్రంథములని జగత్ప్రసిద్ధినందిన రచనములందు గొప్ప తప్పులు గోచరించుచున్నవి. పురాణములను విమర్శకదృష్టితో చూడనొల్లక పల్వు రందలి కథలను ఉన్నవాని నున్నట్లుగ గ్రహించుచున్నారు. ప్రాచీనఋషులు మహామేధావులు; మహనీయ గుణ గరిష్ఠులు; మతిమంతులైన కళోపాసకులు. వారి వచనములు మహితభావములతో తేజరిల్లుచుండును. అవి సత్యసందీపితములు; సౌందర్యసంశోభితములు. వారి పవిత్రాభిధేయముల నుచ్చరించి, వారిని పాత్రములుగావించి, వారికి తమ భావముల నాపాదించినవారును, తమ వ్రాతలను వారి వచనములందు చొప్పించిన వారును ఉండిరని పరిశోధకు లెఱుగుదురు. పూర్వోక్త శివపురాణకథయం దిట్టి వారి సృష్టి ఎట్లో ప్రవేశించుటచే అట్టి స్ఖాలిత్యము తలసూపి యుండును. ఈ విషయ మిట్లుండ జపాలయను తపస్విని యొక్కర్తుక వ్యాసాశ్రమస్థలమున వఱలెననియు, ఆపతివ్రత మహిమకతన ఆస్థలప్రభావము ఘనతర మైనదనియు తెలుపజెల్లును.

## వేదవ్యాసుడు - కమండలువు :

వ్యాసమునీంద్రు డిందు తప సొనరించె నని పల్వురు విశ్వసించుచుందురు. కాశీకడ నున్న గంగాస్రవంతినుండి యిచటి తీర్థములోనికి నీ రుబుకుచుండు ననియు, కావుననే యిది 'కాశీబుగ్గ' యని ప్రసిద్ధి నందిన దనియు అనేకులు వచించుచుందురు. వ్యాస

భట్టారకు డొకప్పుడు జాహ్నవియందు స్నాన మాచరించుచుండగా, ఆతని కమండలువు నీట గొట్టుకొని పోయెనట! తనకు గల ఆ యాస్తి అట్లు సలిలమున గలిసిపోవుటచే ఋషి మిగుల దుఃఖించి, విరక్తుడై దక్షిణదిశగా పోయెనట! దక్షిణాపథమున సంచరించుచు ఒక యరణ్యమున విడిసి, ఒకనాటి ప్రాతఃకాలమున నందలి తీర్థమున నాతడు స్నానమాచరించుచుండెనట. ఆ చిన్నగుంటయందు మునీంద్రుడు తన కమండలువును విలోకించెనట. గంగయందు మునింగిన కమండలువు అందు తేలెనట. పోయిన సర్వస్వము మరల చేజిక్కుటచే ఋషికుంజరుడు పరమానందభరితు డాయెనట. వ్యాసుని తరువాత కూడ ఆకమండలు వందే యుంచబడిన దనియు, పిదప నది భద్రమొనరింపబడిన దనియు, నేడును అది యొకానొక తావున నున్న దనియు కొందఱు చెప్పుకొనుచుందురు. ఈ కథయందు ఎంతేని విడ్డూర మున్నది.

భక్తిప్రభావ సముద్భవములైన అంశములును, ఆధ్యాత్మికశక్తి సంజనితములైన విషయములును సాధారణ హేతుశక్తికి లొంగకుండుట యథార్థమే! పురాణపురుషుల చరిత్రములును, పురాణస్థలగాథలును ఇట్టి విషయములతో బంధురములై యుండును. తపోమహిమవలన ఊహాతీత సంఘటనములు విజృంభింపగలవు. ఈ సంఘటనములను, ఆ విషయములను విస్మయముతో విలోకించి, వానిని సృష్టింపజాలిన అద్భుతశక్తి యెట్టి దనియో ఆశ్చర్యాన్వితులై యోచించి, దాని నలవఱచుకొనుటకై జిజ్ఞాసువులు తపసాచరింతురు. ఆ యద్భుతశక్తి వేఱు; హేతువిరుద్ధమై అజ్ఞానసముద్భవమైన ఊహ వేఱు. విశ్వాసము దొడ్డదే! కాని మూఢవిశ్వాసము మనుష్యత్వమునకు తలవంపులు తెచ్చును. అద్భుతాధ్యాత్మికశక్తిసంజనితాంశములను మూఢవిశ్వాస సముద్భవ విషయములనుండి వేఱుచేయుట (వానితో నివియును కలిసి ప్రసంగములందును, గ్రంథములందును ప్రచారమును పడయును గావున) జిజ్ఞాసువుల కర్తవ్యము. హేతుశక్తికి అవధి యున్నదని, పారమార్థికాంశములు దాని యాకళింతకు దూరస్థములై యుండునని దానిని ప్రయోగింపక గ్రుడ్డియేటుగా ముందంజవేయరాదు. దివ్యప్రదీపకళికవంటిది హేతుశక్తి. దాని వెలుంగున మనము వీక్షింప



మరణించిన శిశువు - మరణావస్థయందున్న తల్లి

●

[ప్రఖ్యాతచిత్రకారుడు, శిల్పి, మద్రాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్సు ప్రిన్సిపాలు శ్రీ దేవీప్రసాదరాయి చౌదరిగారు ఇటీవల తయారుచేసిన శిలాప్రతిమయొక్క ఛాయాచిత్రము]

జాలు విషయములును, నేర్చుకొనగలుగు అంశములును అనల్పములు. జ్ఞానమును త్రోసిరాజని, భక్తినే యవలంబింపరాదని నాతలంపు. భక్తిజ్ఞానకర్మయోగముల సమన్వయము నెఱిగి ఆధ్యాత్మిక పథమున జిజ్ఞాసువు అగ్రేసరుడు కావలెను.

### అదియా, ఇదియా ?:

ఈ యంశమును మది నిడికొని పూర్వోల్లిఖిత కథా వస్తువును మనము పరిశీలింపవలెను. వ్యాసభట్టారకుడు వారణాసీతీరమున వసించి, విశ్వేశుని సేవించె ననుట నిస్సంశయము. నేడును గంగ ప్రవహించు తావునకు రమారమి నాలుగుమైళ్ల దూరమున కాశీ కవ్వల వ్యాసాశ్రమ మున్నది. యుగములకు మున్ను దివిజకల్లోలిని అందుండి స్రవించుచుండెడిదనియు, సరిత్తీరమున కృష్ణద్వైపాయనుడు తప సొనరించుచుండె ననియు, ఆతడు వసించిన తావలమే వ్యాసాశ్రమమై యొప్పెననియుపరిశోధనమువలన మనముగ్రహింతుము. కాశీ కెదుట, గంగ కవ్వల, రామనగరము దాపున నున్న తావుచాలకాలమునుండి వ్యాసకాశి యనబరగుచున్నది. తన బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాయుటకు శ్రీ శంకరుడు సమర్థుడగునో కాడో యెఱుగుటకై వ్యాసుడు వేఱు రూపముతో శంకరాచార్యుని పరీక్షించి సంతృప్తి నందెనని తెలుపు ఉదంతము కలదు. బహుళ మతశాస్త్ర తత్త్వశాస్త్ర గ్రంథములను పరిశీలించినపుడు వ్యాసుడు వారణాసి కడ (యుగములకుమున్ను కాశి పూర్వోక్త వ్యాసాశ్రమ సమీపమున ప్రవహించు భాగీరథీతీరమున నుండెనని యూహించుట కష్టము కాదు కావున) గంగాకూలమందును, నైమిశారణ్య మందలి గోమతీ తీరమందును వసించెనని గ్రహింతుము. వ్యాసుడు శ్రీ విష్ణువునవతారమే యందురు. శివుడు కేశవు నారాధించునట్లే కేశవుడు శివు నారాధించును. వ్యాస విశ్వేశ్వరులు సన్నిహితులనుట నిస్సంశయము. ఇట్లని కాశీ చరిత్రము ఘోషించుచునేయున్నది. కాశీయందేకాక అన్యనామములతో విశ్వనాథుడు వసించు తావలములందు వ్యాసుడు తపసొనరింప ఆతురపడునని తలపవచ్చును.

విశ్వేశ్వరుని సమీపమున వసించినట్లే శ్రీకాళహస్తీశ్వరుని సమీపమున నుండి ఆతనిని సేవింప కృష్ణద్వైపాయనుడు మిక్కిలి మక్కువపడియుండును. కావున నాతడు ఆర్యావర్తమునుండి యాత్రికుడై వెడలి దక్షిణాపథమున ప్రవేశించి శ్రీకాళహస్తి జేరియుండును.

నేడు వ్యాసాశ్రమమని వ్యవహరింపబడు ప్రదేశము శ్రీకాళహస్తి కనతిదూరమందే యున్నది. శ్రీకాళహస్తీశ్వరుని సేవించుచు కృష్ణద్వైపాయనుడా ప్రదేశమున వసించి, తపసొనరించియుండును. ఎందున్నను ఈశ్వరధామము మహిమోపేతమైనదికదా! కాశిబోలు మహా శివ క్షేత్రము కాళహస్తి. కాశీ కాళహస్తుల నాథుడైన విశ్వనాథుని భజించిన వ్యాసుడు వసించిన చోటు మహాక్షేత్రమగుట నిస్సంశయము. కాశీవాసియైన మునిసార్వభౌముని తరుణాతి నెలవైన తావలమునకు కాశీప్రభావము నాపాదించుట తప్పుకాదు. ఈ భావమును పురస్కరించుకొనియే మతిమంతులైన యాత్రికులు కొందఱు వ్యాసాశ్రమస్థతీర్థమునకు 'కాశీబుగ్గ' యను పేరిడియుందురు. పామరవచనమందలి వివరములు వింత కల్పితములు కావచ్చును. స్థలమహాత్త్యమును గురించిన సత్యమును పామరు లెఱుగకపోవచ్చును. సూక్ష్మదృష్టికి గోచరించు భావము స్థూలదృష్టికి గోచరింపదు కదా! గంగోత్తరి సూక్ష్మదృష్టికి తోచును; వెల్లువపైబడు వివిధ పదార్థములు స్థూలదృష్టి కగపడును. ఆ పదార్థసంచయమే గంగోత్తరియని స్థూలదృష్టిసమన్వితు లూహింపవచ్చును. చూపు లోనికి పోయినపుడే తత్త్వము సుబోధక మగును. పామరులు చెప్పుకొను కథలనుండి కడచి విమర్శక హృదయమున జొచ్చి చూడ్కి గభీరతత్త్వమును, భాసురసత్యమును కనజాలును.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

---

## నిద్రను గురించిన చిత్రాలు

రోమ్ దేశపు చక్రవర్తి, జెరుసలేం - సిసిలీలకు రాజు అయినటువంటి రెండవ ఫ్రెడరిక్‌నకు ఒక

జిజ్ఞాస పట్టుకున్నది: "జీర్ణశక్తికి నిద్దర తోడ్పడుతుందా?" అని.

ఇద్దరు సిపాయీలను రప్పించి, యిరువురకూ ఒకే మోస్తరు భోజనం పెట్టించి, అందులో ఒకణ్ణి నిద్దర పొమ్మనిన్నీ, రెండవవాడిని వేటకు పోయిరమ్మనీ ఆజ్ఞాపించాడు. ఈపని జరిగిన ఒకటి రెండు ఘంటలకు ఉభయుల్నీ చంపించివేసి, జీర్ణకోశాలు పరీక్షించాడు.

పరీక్ష అయినపిమ్మట "నే ననుకున్నట్టే జరిగింది. వేటకు వెళ్లివచ్చినవానికంటె నిద్రపోయిన వాడికి ఆహారం ఎక్కువగా జీర్ణమయింది. ఇటుపైన భోజనానంతరం చిన్న కునుకు తీసితీరాలె" అని ప్రభువు నిశ్చయించుకున్నాడు.

పై పరిశోధన జరిగింది క్రీ. శ. ౧౨౦౦ ప్రాంతంలో. అటువంటి మారణాలు అవసరంలేకనే ఈనాడు మనం యిందునుగురించిన విశేషాంశాలు సేకరించవచ్చు. ప్రస్తుత యుద్ధసమయంలో — నిద్దరవంటి పరమప్రయోజనకారి అయిన సాధనం మరొకటి లేదనే యాథార్థ్యాన్ని చరిత్ర ధ్రువపరిచింది.

ఈరహస్యం తెలుసుకున్న కారణంచేతనే శత్రువు తరుచు నిద్రాభంగం చేయటానికి తలపడుతూ వుండటం పరిపాటి అయివున్నదికూడ. అంచేత శత్రువును సాధించాలంటే, వేళకు నిద్రించటం తప్పిపోకుండా చూచుకోవాలి. సైనికబలానికి తగిన నిద్ర లేని పక్షంలో ఆపక్షం ఓడిపోవటం తథ్యం.

ఇంతటి ముఖ్యమయింది గనకనే, ఈ నిద్రను గురించిన చిత్రాలను తరతరాల, యుగయుగాల శాస్త్రజ్ఞులు కనుగొంటూనే వస్తున్నారు. నిద్ర ఎట్లా వస్తుంది? దాన్ని నిరోధించడ మెట్లా? నిద్రావస్థలో భౌతికశరీరం ఎట్టిమార్పు చెందుతుంది?— ఈ మొదలయిన విషయాలు ఆధునికదృష్టితో సమన్వయించి చూస్తూనేవున్నారు పరిశోధకులు.

నిద్దరనుగురించి శాస్త్రజ్ఞులు తెలియజెప్పే అంశాలను కేవలం పురాణకాలపు మూఢవిశ్వాసాలుగా కొట్టిపారెయ్యటానికి వీల్లేదు.

నిద్దరను గురించిన విషయాలపైన నవయుగ ప్రామాణ్యకర్త చికాగోపట్టణంలోని నెథేనియల్ క్లీట్మన్ అనే డాక్టరు. ఈ మహాశయుడు ఒకటి కాదు రెండుకాదు, ఎనిమిదివేల రాత్రులు మేల్కొని, నిద్దరనుగురించి పలువిధాలుగా పరిశోధించి, అత్యద్భుతవిషయా లెన్నిటినో గ్రంథస్థం చేసివున్నాడు.

జాగ్రదవస్థలోనూ, నిద్రావస్థలోనూ వివిధదశలందు ఒక్కొక వ్యక్తిని ఆయన శోధించివున్నాడు. ఒకే వ్యక్తిని ముందు ఉయ్యాలలో, తరవాత కటికనేలమీద, తదుపరి హంసతూలికాతల్పమునందూ పండుకోబెట్టించి, ఆయా సూక్ష్మాతిసూక్ష్మ తారతమ్యాలను సయితం సునిశితంగా కనిపెట్టివున్నాడు. నిద్రావస్థలో వాడి తెలుసుకునేందుకని వేలికి ఒక విద్యుత్పరికరము అమర్చి మనిషిని పండుకోబెడతాడు.

స్థలాభావంచేత—డాక్టరు క్లీట్మన్ చేసివున్న అపారపరిశోధనలను వర్ణించుటకంటె—ఇవ్విషయంలో ఆయన ప్రజానీకానికి ప్రబోధించిన స్వానుభవాలను వెల్లడించటం యెక్కువ ప్రయోజనకరంగా ఉండగలదు.

మంచినిద్రను గురించి ఆయన చెప్పే నాల్గు ముఖ్యసూత్రా లివి: ౧. ఎదో ఒక వేళ నిర్ణయించుకుని, ప్రతిరాత్రీ ఆదేవేళకు సరిగా పండుకోవాలి. ౨. నిశ్చలంగా వుండే చీకటిగదిలో నిద్రించడం చాలా మేలు. ౩. నిద్రించబోయేముందు పొట్ట నింపవద్దు. ౪. ఆరు గంటల కాలమునకు తక్కువ లేకుండా హాయిగా నిద్రించటం మంచిది.

ఇంకా యెక్కువకాలం నిద్రించవచ్చునా? ఏ పక్కకు తిరిగి పండుకోవాలె? — ఈ మున్నగునవి స్వల్పాంశములనీ, ఇవి చర్చించతగినంత ప్రయోజనకారులు కావనీ ఆయనఅభిప్రాయం. అలవాటు చేసుకోవడంమీదనే మంచినిద్ర ఆధారపడివుంటుంది గాని, ఏపక్కకి తిరిగి పండుకొన్నా నిద్రకు భంగం కలగదని అంటా డాయన.

పరిశుభ్రమయిన గాలి రావటానికిగాను ఫలానా మోస్తరు కొలతలు గల కిటికీలు పడకగదికి పెట్టించితీరాలని ఆధునికవైద్యులు తరుచు నియమిస్తూవుం

టారు. కాని, డాక్టరు క్లీట్మనుమటుకు మంచినిద్రకు ఇటువంటి వేపీ అడ్డురావనే మతంలోవాడు.

ఈవిషయంలో మనల్ని నమ్మించడానికి ఆయన వివరించిన కారణాలేమిటంటే-వన్యమృగాలు గాలిచొరని యిరుకుగుహల్లో హాయిగా నిద్రిస్తున్నాయి. కొన్నికొన్ని పక్షులు రెక్కల్లో ముక్కుదూర్చి పండుకుంటాయి. అంటే, వాటికి వెచ్చటిగాలి అవసరమన్నమాట.

ఉదయాన లేవంగానే మనిషి చురుకుగా చకచక లాడుతూ పనిపాటలు చూచుకుంటూ దసుకోవటం వట్టి వటన అని డాక్టరువుద్దేశం. సామాన్యంగా మధ్యాహ్నం మయ్యేసరికి గాని, నిద్దరమత్తువదిలి మనిషిలో సరియైన చురుకుదనంపుట్టదని ఆయన అంటాడు.

నిద్దర ఎట్లా వస్తుంది ?—ఇదుగో, ఆయన జవాబు: శరీరంలోని నాడులకూ, గ్రంథులకున్నూ, మెదడుకున్నూ గల సంబంధం పనిఒత్తిడివల్ల తెగిపోతుందని క్లీట్మనుపరిశోధనలవల్ల తేలింది. నాడులూ, గ్రంథులూ అలిసిపోయినప్పుడు అవి మేధస్సుకి సందేశాలను అందజేయలేవు. అంచేత ఏపనీ జరగటానికి వీల్లేదు. ఇదే నిద్దర ఆవహించే దశ.

ఈ సూత్రాన్నే ఆయన ఒక చిత్రమయిన తీరున తార్కాణిస్తున్నాడు:

రష్యాలో ఒక వింతబాలిక జననమయింది—ఒకే శరీరం. కాని, చతుర్భుజాలు, రెండు తలలున్నూ! రక్తప్రసారం ఇరువురకూ ఒకే శరీరమున జరిగినప్పటికీ, నాడీనిర్మాణం ఎవరిది వారిదే. నవ్వటం, యేడవటం మొదలైన క్రియలు ఎవరిమట్టుకి వారు వేర్వేరుగనే జరుపుకొంటున్నారు. ఒకపిల్ల నిద్రిస్తూవుంటే రెండవ బాలిక మేలుకునే వుంటున్నది! ఈ విషయం బాగా గురుతించ మంటున్నాడు డాక్టరు క్లీట్మన్.

అయితే, కొంతమంది ఆధునిక వైద్యుల అభిప్రాయం ప్రకారం—రక్తప్రవాహంలోని కొన్నికొన్ని విషాల కూటమివల్లనే నిద్రావస్థ కల్గుతున్నదని ఒక నమ్మిక యేర్పడివున్నది.

అట్లా అయినకల్పంలో పైబాలిక లిద్దరూ ఒకేసారి నిద్దరపోయి, ఒకేసమయమందు మేల్కొంచవలెకదా అని క్లీట్మన్ ప్రశ్న. ఈపని జరక్కపోవటానికి కారణం—క్లీట్మనుసూత్రాన్ని బట్టి—నిద్రావస్థ నాడులకు సంబంధించిన క్రియ అయివుండటమే. దీనినే ఆయన అనేకవిధాల రూఢిపరుస్తున్నాడు.

నిద్రించకుంటే జరగబోయే పని యేమిటి?—ఇది వక విస్తారపుసమస్య! కొద్దికాలంకిందటనే శ్రీమంతుడగు ఒక భారతీయవర్తకుడు, తను రెండేళ్ళనించి నిద్ర అనేమాట ఎరగ ననిన్నీ, నిద్రపట్టించగలవారికి రు. 30,000 లు బహూకరిస్తాననీ బహిరంగంగా ప్రకటించాడు.

ఇది ఆవర్తకుడు పడుతున్న పిచ్చిభ్రాంతి! కొంతమంది మెలకువలోనే - అనగా జాగ్రదవస్థలోనే, తమకు తెలియకుండా నిద్దర తీస్తూవుంటారు. అనుకుంటారేగాని, నిద్రలేక ఎవ్వరూ జీవించలేరు.

నిజానికి, మెలకువ అనేది — వారాలున్నూ కాదు—కొన్ని రోజులకంటె ఎక్కువ ఉండనేరదు. నిద్దర అనేది లేకుండా ఒకవ్యక్తి ౨౩౧ గంటలు-అంటే రమారమి ౯ ౨/౩ రోజులు — మాత్రమే ఉండగలడని ఇటీవలి పరిశోధనలు చెబుతున్నాయి.

ఒక యువకుడు పదిరోజులపాటు నిద్ర లేకుండా ఉన్నాడీమధ్యను. కాని, అతడు అప్పుడూ అప్పుడూ నడుమనడుమ కునుకులు లాగిన కాలం మొత్తం చేస్తే ౫ ఘంటల నేపయింది.

వరుసగా సుమారు ౫౦ గంటలు నిద్రలేకుండా వుండినట్టయితే, దృష్టినిరోధం కల్గవచ్చు. నిద్ర లేమివల్ల మానవునికి నిస్త్రాణ, దానివల్ల అంత్యదశ ప్రాప్తించవచ్చు.

అందుచేత,నిద్దరవంటి పరమప్రయోజనకరమైన వస్తువు మనిషికి మరివొకటి లేదని ధ్రువపడుతున్నది.

ముద్దా విశ్వనాథం.

---

# ఆయుర్వేదానుకరణమే పాశ్చాత్య వైద్యశాస్త్రము

సర్వదేశములూ వైద్యమంటే ఏమో తెలియక, రోగాలు వస్తే కుళ్లికుళ్లి చస్తూ, అజ్ఞానాంధకారములో కొట్టుకుంటున్నప్పుడు (యిది క్రీస్తు పుట్టుటకు పూర్వం 300 సం. మాట) అఖండజ్ఞానం గల ఆయుర్వేదపండితుల విజ్ఞానపరిశీలనాశక్తిపూరితము లైన వ్రాతప్రబోధములే ఆయుర్వేదవైద్యం. క్రమశః ఈ వైద్యం హారూన్, మన్సూరుల కాలంలో (క్రీ. వె. 223) అరేబియాకు, ఈజిప్టుకు, స్పెయినుకు, గ్రీసుకు, తదుపరి రోముకు ప్రాకి, ఆయుర్వేదానికి ఆటపట్టయిన చరక, సుశ్రుత, మాధవ నిదాన గ్రంథములు ఆయా దేశ పండితులచే ఆయా దేశభాషల లోకి అనువదించబడ్డాయి, అర్థం పర్థం లేకుండాను. ఇలా యివి అరబ్బులచే గ్రీసుకు, ఐబేరియన్ ద్వీపకల్పానికి, స్పెయినుకు గొంపోబడ్డాయి. ఈ విజ్ఞానం అలా అలా ప్రాకి యూరపు ఖండమంతా ఆవరించింది. దీన్నే ప్రొఫెసర్ డా. రాయల్ విల్సన్ దొరగారు తమగ్రంథములో యిలా వ్రాశారు: "అరేబియా భాషయందు తర్జుమా చేయబడిన హిందూ వైద్యగ్రంథములను గ్రీకులు తమ స్వభాషకు మార్చుకొనిరి" అని.

ఒక దేశపు భాషను ఇంకొకరు వారి భాషల్లోకి అనువదించడం కష్టం చూడండిమరి. అలా అనువదించినపుడు, అసలు గ్రంథాల్లోని భావాలు కొన్ని, అసందర్భంగా వాళ్ల కొచ్చినట్లల్లా అనువదించేశారు. దీనికి నిదర్శనం, ఆరేబియాపండితులైన సిరేపియన్, రేజస్, అవిసెన్నా అనువారలు చరకుని పరుసప్రకారం Xarch అనియు, Searac అనియు, Seiarak అనియు తమతమ గ్రంథాల్లో రాసేయడమే. అంచేతనే అర్థంలేని తర్జుమా అన్నాను. దీన్నిబట్టి తేలిం దేమంటే– అరేబియా పండితులు మన గ్రంథాల్ని తమకు తోచినట్టు అనువదించారనీ, మనవల్ల జ్ఞానం సంపాదించారనీ. అసలు అల్బరూనీ అను అరబ్బుచరిత్రకారుడే ఒప్పుకొన్నాడు "మేము విజ్ఞానం హిందువులవల్లనే పొందాం" అని.

ఇక గ్రీకులు మనవద్ద ఎలా నేర్చుకున్నారో విచారిద్దాం. పై తర్జుమా చేయబడిన అరేబియా గ్రంథాల్ని తమ భాషల్లోకి గ్రీకులు అనువదించుకున్నారని మీద చెప్పే ఉన్నాను. అంతటితో గ్రీకులు ఊరకోనక అలెగ్జాండర్ మన దేశంపైకి దండెత్తడానికి వచ్చినపుడు మరికొన్ని విషయాలు నేర్చుకున్నారు. అందు ముఖ్యంగా పాముకాట్లకు మందు మన హిందువులచెంతనే నేర్చుకున్నారని ఏరియన్ అనునాతడు చెప్పెను. మరియు అలెగ్జాండర్ తన భవనములోనే హిందూ వైద్యులను తన చెంత నుంచుకొని, పాముకాట్లకు గురియైనవారు అక్కడకు రావల్సిందని ఆజ్ఞాపించినట్లుకూడ నియార్ఛస్ అను నాతడు చెప్పెను. దీన్నే పోకక్ గారు 'గ్రీసు దేశమునందలి హిందూ దేశము' అను గ్రంథమున "గ్రీసుదేశమునందలి ప్రారంభనాగరికత హిందూదేశమువలననే కల్గిన"దని వ్రాసిరి. దీన్నిబట్టి గ్రీకులుకూడా మనచెంత విజ్ఞానాన్ని పొందినట్టు తెల్సుకున్నాం.

ఇక రోములో—అశోకుడు మొదలగు బౌద్ధులు బౌద్ధప్రచారకులను పంపినపుడు, వీరి చెంత వారు విజ్ఞానం ఆర్జించుకున్నారని చరిత్రకారులు తెలుపుచున్నారు. ఈజిప్టునకుకూడా మనవారు వలసపోయి అక్కడివారికి విజ్ఞానం నేర్పినట్టును అనేకమంది చరిత్రకారులు వ్రాసినారు. అందు డా. వైజ్ గారు తమ History of Medicine among the Asiatics అను గ్రంథమున "గ్రీకు దేశీయులు ఈజిప్టు మతగురువులవలన హిందువుల వైద్యశాస్త్రమును నేర్చుకొనిరి." అని వ్రాశారు. దీన్నిబట్టి మన హిందువులవల్ల ఈజిప్టుమతగురువులు వైద్యశాస్త్రం నేర్చుకున్నట్టు తెలుస్తుంది.

ఇలా దేశంవెంబడి దేశానికి మన విజ్ఞానం వ్యాపించింది. వారు స్వతంత్రులుగా ఉన్నారు కాబట్టి నేర్చినవిద్యను కొస్తా మిషనరీవర్క్సులో దించి రాణింపజేశారు. మనం కొన్నివందల సంవత్సరాలపాటు అస్వతంత్రులుగా నున్నాం కాబట్టి మనలోని విద్యలు, కళలు అభివృద్ధి పొందలేకపోయాయి. అయినప్పటికీ మన విద్యలను వారు నేర్చుకొని

దినదినానికీ అభివృద్ధి పరుచుకుంటున్నారు. మనం శిథిలావస్థలో నున్న మన విద్యల్ని అభివృద్ధి పరచకుండా, యింకా శిథిలావస్థలోనుంచి రూపుమాపు చేయ సంకల్పించినాము.

ఇక బ్రిటీష్‌వారు మన విజ్ఞానమును యూరపు దేశస్థులతో కలిసి పంచుకోవడమే గాకుండా, మన దేశంవారికి స్వాధీనమైన దగ్గరనుంచి మన దేశంలోకి కొంతమందిని పంపి, యిచ్చటి వైద్యశాస్త్ర మంతా వారితో పరిగ్రహింపజేసి, వాటిని స్వదేశానికి తీసుకపోయి పరిశోధించి అమలులో పెట్టారు. అందు హిందూదేశమున లభ్యమగు ఓషధులను గురించి షాగ్‌నెస్సి, వేరింగ్, బరడ్‌వుడ్, ఫ్లెమింగ్, వాట్, డైమోక్, మొహదీన్ షెరీఫ్ మొదలగువారు వ్రాసిన పుస్తకముల లోని విషయములను, చార్లెస్ ముర్చిషయన్ వ్రాసిన బర్మాదేశముయొక్క శీతోష్ణస్థితిని, వ్యాధులనుగూర్చిన గ్రంథములలోని విషయములను, హిందూదేశశీతోష్ణస్థితిని గురించియు, వ్యాధులనుగురించియు ప్రసిద్ధి చెందిన జాన్ పీటర్‌వేడ్, విల్లియం హంటర్, సర్ జేమ్సు అన్నెస్లె, విలియం ట్వినింగ్, సర్ జేమ్సు ర్యానాల్డు మార్టిన్, ఆలెన్ వెబ్, చార్లెస్ మూర్ హెడ్ మొదలగువారలు వ్రాసిన గ్రంథములు, జాన్‌లండ్ ఉష్ణదేశమునందలి రోగౌషధులను (Tropical Medicine) గురించి వ్రాసిన గ్రంథములలోని విషయములను, మన వృక్షాయుర్వేదము, జంతుశాస్త్రము, కలరా, శ్లీపదము (Filariasis), కుష్ఠు-యిలా అనేక రోగాల ఉత్పత్తిచరిత్రను విపులంగా మన దేశంలో-ఆయా రాజధానులలో ప్రసిద్ధమైన డాక్టర్లను నియమించి తాయించుకొని లండనుకు ఎగుమతిచేయించుకుంటున్నారు. ఈపద్ధతి బ్రిటిషువారు ౧౮-వ శతాబ్దమునుంచి ఆరంభించారు.

చూడండి! లండన్‌కింగ్సుకాలేజీలో నుండు ప్రొఫెసర్ రాయల్‌గారేమిచెప్పారో:—"హిందువుల పదార్థతత్త్వశాస్త్రమును, మనము దానివలన పొందిన యుపకారములను చూచినయెడల ఉబ్బసరోగములకు ఉమ్మెత్తఆకుయొక్క పొగను పీల్చుట, పక్షవాత అజీర్ణవ్యాధులకు ముషిణిని ఉపయోగించుట మొదలగు పురాతనచికిత్సలను ఐరోపాఖండమున వైద్యశాస్త్రజ్ఞులు క్రొత్తగా అవలంబించిరను సంగతిని మనము జ్ఞప్తికితెచ్చుకున్నయెడల వారి చికిత్సలలో ననేకములగు గుణములు గలవిగా నుండుట స్పష్టమగుచున్నది" అని చెప్పారు. లెఫ్టినెంటు కర్నల్ కీర్తికర్ గారు ౧౯౧౬-వ సం.లో కాశీ హిందూ విశ్వవిద్యాలయ శంకుస్థాపనమహోత్సవ సందర్భమున ఉపన్యసిస్తూ యిట్లా చెప్పారు. "ప్రపంచమందలి తక్కిన దేశములవారికి హిందూదేశము వైద్యమును, శస్త్రచికిత్సయును ఆచరించునట్లు గడచిన కాలముల యం దుపదేశించెను." ఎల్ఫిన్‌స్టన్‌దొరగారు తమ హిందూదేశచరిత్ర ౧౪౬-వ పుటలో మనవారు ఓషధీపరిజ్ఞానమును చాలాకాలంక్రిందటనే ఐరోపాఖండమునకు బోధించిరనియు, మరియు నిటీవల కాస రోగమున (Asthma) దుత్తూరపానము చేయుట, క్రిములను నశింపచేయుటకు దూలగొండిని ఉపయోగించుట కూడా తెల్పిరనియు వ్రాశారు.

వీటన్నిటి బట్టి మనం తెలుసుకున్న దేమంటే—పాశ్చాత్యులు మొదలగువారలు భారతదేశపు శిల్పకళ, గణితము మొదలగు శాస్త్రాల్ని ఎట్లా అనుకరణచేశారో యీవైద్యకళను కూడ అట్లాగే అనుకరణచేశారనీ, ఆ అనుకరణశాస్త్రమే యీపాశ్చాత్యవైద్యశాస్త్రమనీ."

డా. ప్రకాశచంద్రశతపథి.





# విమర్శనము

## శ్రీ అరవిందజీవితము

[రెండవకూర్పు]

ప్రకాశకులు : శ్రీ తు. కోదండరామారావు గారు, బి. ఏ., అనంతపురము. వెల: రెండు రూపాయలు.

భారతీయ విజ్ఞాన చరిత్రను పరిశీలించినపుడు, సమస్తయుగములందును (రాజకీయార్థికపరిస్థితులం దెట్టి మిట్టుపల్లములు గోచరించినను) భారత జనయిత్రి వీరప్రసవిని యై వఱలిన దని నొక్కి చెప్పవచ్చును. విశేషించి, కలుషభూయిష్ఠమైన ప్రస్తుతయుగమందు సయితము భారతదేశమున మహిమోపేతులైన మహాపురుషు లుదయించిరి. వీరిలో శ్రీ అరవిందయోగి యొక్క డనుట నిస్సంశయము. ఉత్తమాశయ జ్యోతిర్లీల నారాధించి ఆత్మజీవితములను సౌందర్యసందీప్తము లొనరించుకొన నువ్విళ్లూరువారు శ్రీ అరవిందుని జీవితమహత్త్వమును హృదయంగమ మొనరించుకొన వలెను. ఈతడు శంఖచక్రములతో నుదయించిన అవతారపురుషుడు కాడు. కాని చిఱుతప్రాయమందే ఆత్మశక్తిని, ఆత్మజీవితాశయమును గుఱుతించిన భాగ్యశాలి. మనుష్యహృదయగ్రథన మొక్కనాటిది కాదు; ఒక్క జన్మములోనిది కూడ కాదని చెప్పజెల్లును. స్వతస్సిద్ధమైన శక్తితో శ్రీ అరవిందు డుదయించినాడు. ఈ హృదయశక్తి (ఈశ్వరశక్తితో నుజ్జీయగువఱకు) క్రమపరిణతిని కాంక్షించును. ఈ కాంక్ష అంతరంగమున బలవత్తరమైయుండ నుత్కృష్టమైన తన యుద్దేశదిక్కై నరుడు తపించును. నరు డర్జునుడు! మహాజిజ్ఞాసువు! క్రమనిష్కతన సర్వశక్తులను వృద్ధిగావించుకొని, ఈశ్వరుని నెచ్చెలియై వెలయును! శ్రీ అరవిందు డిట్టి జిజ్ఞాసువు — ఇట్టి తపస్వి! తన హృదయ సంచలన మెట్టిదో ఈతడు ఏండ్లకుమున్నే గ్రహించినట్లు ధర్మపత్నికి తడు వ్రాసిన లేఖలవలన బోధపడును. ఎల్లరు నడచు పుంతయందు నడువనొల్లనివారిని సాధారణు లున్మాదు లనుచుందురు. పిచ్చివాడును, ఉజ్జ్వలప్రతిభాసమన్వితుడును దూరస్థులు కారని షేక్స్పియరు పలికినాడు. (Vide:'As you Like It') తాను పిచ్చివాడ నని శ్రీ అరవిందుడు తన యర్ధాంగలక్ష్మికి వ్రాసిన లేఖలందు తెలుపుకొనినాడు. గిరిశిఖరమును జేర నెంచిన యాత్రికుడు (Vide : Bunyan's Pilgrim's Progress) నిముసమైనను నిలువనొల్లడు. ముక్కంటికంటిమంటవలన బుగ్గైన అతనునివలె పూర్వోక్త యాత్రికుని అంతర్దృష్టి సముద్భవదీప్తి సోకినంతన నైహికవాంఛలు భస్మమగును. బహిరంగమునుండి ఇనుప సంకెళ్లతో బిగించినపు డింద్రియములు లొంగవు. అంతరంగమందలి ఉజ్జ్వలశక్తికి తన నవి యణగియుండును. ఈ శక్తికిని, నిరంతర తపసుకును అవార్యసంబంధ మున్నదనిన, అలసభావముగాని, నగుమోము ప్రలోభముగాని సంయమీంద్రుని హృదయము నాకర్షింప నేరదని వచింప నక్కఱలేదు. శ్రీ అరవిందుని జీవితచరిత్రమును నిశితదృష్టితో పరీక్షించినపుడు పూర్వోల్లిఖిత దివ్యశక్తి (వైకుంఠమందలి రత్నఖచిత దివ్యసింహాసనమును దేవదేవు డలంకరించినట్లు) శ్రీ అరవిందుని హృదయపీఠము నలంకరించిన దని గ్రహింతుము. బ్రహ్మాండమున నిండిన శక్తి మనుష్యహృదయమున వర్ధ

గింజవలె నిమిడియున్నదని ఉపనిషత్తులు వాకొనుచున్నవి. ("God is Immanent and Transcendent" అని భారతాశయమును జీర్ణించుకొనిన పాశ్చాత్యతత్త్వశాస్త్రము తెలుపుచున్నది కదా) పూర్వోక్తమైన ఉజ్జ్వలశక్తి శ్రీ అరవిందుని హృదయమున వెలుగొందుచున్నది. వెల్లువయై వెలుగు వెలారునపుడు కాంతిచ్ఛటలను లెక్కించు టెట్లు? లెక్కించుట నగుబాటేకదా! మహోదధి వీచికలు అంబరవీథి కెగయుచుండ వాతూలమందలి నీటితుంపురులను గణించి, గుణించి సింధుప్రభావమును గుర్తింప నెంచువాడెవడు? దివ్యశక్తి హృదయమున సహస్రమయూఖములతో తేజరిల్లుచుండ మేధాశక్తి యిట్టి దనియు, కళాకౌశల మట్టిదనియు దెలిపి ఋషిప్రభావనిర్ణయమును చేయు టెట్టిది? సర్వోత్కృష్టవిజ్ఞానమును సృష్టించినవారు భారతమహామునులు. ఆధ్యాత్మికశక్తిని — సాధారణాధ్యాత్మికశక్తినే కాదు, ఈశ్వరశక్తిని అందిన సంయమీంద్రులు (ఈ శక్తియందు సర్వశక్తులును అంతర్భూతమైయుండ) మహామేధావులని వేఱుగా పేర్కొననేల? భారతఋషిసంప్రదాయము నారాధించి, ఆధునికయుగమున మహర్షియై, మహనీయగుణగరిష్ఠుడైనవాడు శ్రీ అరవిందుడని తెలుపుట నాయాశయము. భావశక్తి సమస్త బ్రహ్మాండమంతను ప్రతిధ్వనించు దివ్యశంఖారవమును సృష్టింపగలదు! ఒక్కనిహృదయములోనది విలసిల్లుచున్న నేమి, దాని ప్రభావముకతన సర్వభువనములందును దివ్యఘంటారవము ముఖరిత మగును! అంతర్దృష్టితో పరీక్షించినపుడే ఈ శక్తిమహత్త్వము హృదయంగమ మగును. ఆధునికయుగమున నీ శక్తి యలవఱుచుకొనినవారి సంఖ్య అత్యల్పము. కావుననే శ్రీ అరవిందుడు ముక్కు మూసికొని, మూలగూర్చుని, స్వంతముక్తికై దేవులాడుచు, క్రియాక్షేత్రమున కొఱగానివాడై యున్నాడని చవుకవిమర్శకు గడంగువారు కొందఱు గోచరించుచున్నారు. ఋషిశక్తి సుదూరనక్షత్రములను సయితము కవలించి వాని గతులను నిర్ణయింపగలదుసుడీ! శ్రీ అరవిందయోగిశక్తి పుదుచ్చేరి ఆశ్రమమందు (గూటిలోని మిణుగురుపురుగువలె) నక్కియుండునని తలచుట తప్పు. అది మానవహృదయసముద్ధరణమును గావింపగల శక్తి! సేడంధకారబంధురమై, పైశాచికభావసంభరితమై యున్న మనుష్యమానసమున దివ్యదీపకళికను వెలిగింపగల శక్తి! ప్రపంచమున మరల పచ్చతోరణమును గట్టగల శక్తి! ఈ శక్తిని గుర్తించిన ఋషీంద్రుడు రవీంద్రుడు శ్రీ అరవిందయోగి నుద్దేశించి యిట్లు పలికెను: "ఆ దివ్యవాక్కు మీయందున్నది. దానిని మీనుండి గ్రహించి శిరసావహించుటకు మేము ప్రతీక్షించుచున్నాము. 'నన్నాలకింపు' డని భరతఖండము మీ కంఠద్వారమున ప్రపంచమున కుపదేశించుచున్నది. ............ ఓ అరవిందా! రవీంద్రుని వందనముల నందికొమ్ము" (పుట ౨౩౩, 'శ్రీ అరవిందజీవితము').

స్థూలదృష్టికి గోచరించు శ్రీ అరవిందుని జీవితాంశముల నన్నిటిని వివరించుచు, సూక్ష్మదృష్టి కగపడు ఆతని జీవిత తత్త్వమును ప్రస్తుత గ్రంథకర్తగారు నేరిమితో తెలిపిరి. భావము ననుసరించి భాష యుండవలె ననుసాహితీసూత్రమునకు వీరి రచనము ప్రత్యక్షదృష్టాంతము. గ్రంథము గంభీరభావవిలసితమై, సర్వాంగసుందరమై యున్నదనుట చర్వితచర్వణమే యగును. జిజ్ఞాసువు లెల్ల రీగ్రంథమును పఠించి, ఇందలి పరమార్థమును గ్రహించి, ఎనలేని మేలు నందగలరు.

ఈ యుద్గ్రంథమును ప్రకటించిన ప్రకాశకు లెంతయు వందనీయులు.

జొ. స.

---

## తత్సమచంద్రిక

[ క్రొత్త ముద్రణము ]

గ్రంథకర్త: సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు, గోకులము, ౨౨, జీరా, సికిందరాబాదు. వెల రూ ౩-౦-౦.

ఆంధ్రవిద్వల్లోకమునకు బ్ర. శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిలవారు చిరపరిచితులు. ౧౯౨౮-వ సం.న వారి ఈ తత్సమచంద్రిక కడునన్నువమై పొడసూపినది. అనేకులు విద్వాన్‌పరీక్షకై ఆ గ్రంథమును జదివియున్నారు. ప్రస్తుత మీ గ్రంథము (డెమ్మీ)

రరాం పుటలకు మించి చక్కని యుద్గ్రంథరూపమున గద్వాల్ సంస్థానపుమహారాణిగారి యాదరణమున వెలువడినది.

తొలికూర్పున లేని నూతన విశేషాంశము లమితవిశేషముగ నీ మలికూర్పున ప్రవేశించియున్నవి. శ్రీ శాస్త్రిలవారు విశదీకరణమునందు అందెవేసిన చేయి యని ఈవ్యాకృతిపుస్తకము చాటుచున్నది. కౌముద్యాది సంస్కృతవ్యాకరణముల జదువునప్పటి కంటె నీగ్రంథపఠనమున విషయములు కదళీపాక న్యాయమున విస్పష్టము లగుచున్నవి. ఇందు సిద్ధాంత కౌముదిలో లేని ఉపసర్గప్రకరణము, రూపభేదప్రకరణము, లౌకికన్యాయప్రకరణము లను మూ డెక్కువగ జేర్పబడియున్నవి.

ఆంధ్రభాషాయోష గీర్వాణభాషావధూటితో సహవాసమైన సంబంధము గల్గించికొన్నది. ఆంధ్ర వివిత్సులకెల్లరకు నాద్యప్రకృతి స్వరూపవిజ్ఞానమును, ప్రయోగవిజ్ఞానమును దప్పనిసరిగ బఠనీయము లనుట నిర్వివాదాంశము. కాని యదంత సులువుగ లభించుట దుస్సాధ్యముగ నుండెను. శ్రీ శాస్త్రిలవా రీగ్రంథరచనయందు శెక్కుసులభాతిసులభము లైన మార్గముల నవలంబించియున్నారు. వ్యాకరణ రచనయందు సుబోధ మగునట్లు వ్రాయుటే శ్రీ శాస్త్రిలవారి యాశయమై యుండవలయును. 'టీకా టూకామ పేక్షతే' అన్నట్లు సూత్రప్రాయములుగ నున్న నవి నేటి విద్యార్థి లోకమున కట్టి సాయమును జేయ నేరవు. "ఎంత సులభముగా వ్రాయవీలగునో యంత సులభముగా వ్రాయవలయును." అని పూనుకొన్న రచయిత యభిప్రాయము సంపూర్ణముగ సిద్ధించినది.

శ్రీ శాస్త్రిలవారి వైదుష్యము, విశదీకరణ పాండిత్యము ఈతత్సమచంద్రికయందు విద్వజ్జనలోకమున ప్రకాశితమగుచున్నది. ఈ సూర్యనారాయణ శాస్త్రిలవారి గ్రంథమునకు నాంధ్రభాషానుశాసనగ్రంథ నిర్మాతలయిన శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిల వారు మిక్కిలి చక్కనిపీఠిక వ్రాసియున్నారు.

కుమారదేవ.

## వా లు జ డ

కర్త: శ్రీరామచంద్ర అప్పారావుగారు, నవ్యసాహిత్యపరిషత్తు, గుంటూరు.

'కళోపాసనావేదన' ఉన్న వసంతుడు 'హృదయవైశాల్యాన్ని తెలిపే' సోగకళ్లుగల కోకిలను ప్రేమిస్తాడు. ఆవిడా ప్రేమిస్తుంది. నాయికతలిదండ్రులైన లక్ష్మీమాధవులు కోకిలను శిశిరునకు ఇచ్చి పెళ్లిచేయ నంటారు. కోకిల వొప్పుకోదు. శిశిరునకు లోపల భగ్న మంటుంది. కోకిల లోగడ తనకు వ్రాసిన ప్రేమలేఖలూ, తనతో కలిసి తీయించుకున్న చిత్రాలూ వసంతునికి చూపి కోకిలావసంతుల ప్రణయం విఫలం చేస్తా నంటాడు. కోకిల గతుక్కుమంటుంది. వసంతునికి ఇది తెలిసి, ఆ ప్రేమలేఖలూ, చిత్రాలూ తగలేస్తాడు. నీతప్పు ఏమీ లేదని కోకిలను ఓదారుస్తాడు. వసంతు డసలు కోకిల 'కలకలలాడు వాలుజడకై' తపస్సు ఒనర్చినవాడు. ఈ భూతచరిత్ర తెలుసుకుని ఒకనాడు 'నీ ములు వాంఛలు తీర్చుకొనే ఆటవస్తువైనావా' అని అంటాడు. తాను పతితా, తన శరీరము చెడినదీ గనక దానికి అగ్నిపరీక్ష అవసరం అనీ, ఆత్మ ఎప్పుడూ వసంతునిదగ్గరే ఉంటుందనీ కోకిల నిశ్చయించుకుంటుంది. భగ్నప్రేమికుడైన శిశిరుడు వేసిన ఆమె (కలకలలాడు వాలు) 'జడఉరి' చే ఆమె చనిపోతుంది. ఇదీ కథ.

దీని ధోరణి చూస్తే – రూపక ప్రాయంగానూ, గొడవ చూస్తే అతుకుల మారిబొంతగానూ కనబడుతోంది. కొంత రొమాన్టిసిజం, కొంత అలిగారిజమూ; సగం 'సాలెనేతా సగం 'మాలనేతా.' ఈరచనలో రూపకానికి కావలసిన మనస్తత్వమును రంగరించి పాత్రల సంభాషణద్వారా తెలపడంగాని, ప్రతిభాసంకలితమైన సంభాషణలు కాని, గాఢమైన చిత్తక్షోభలుగాని లేవు.

ఇది చదువరిని ఏ మాత్రం కదిలించగలదా అని సందేహం.

జ. రు.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.

